# ప్రవచింపబడిన ప్రస్తుతము-భవిష్యత్తు



రచయిత :

డాన్ ఇ. స్టాన్టన్

అనువాదం :

కే. థామస్ యన్. రెడ్డి

# ప్రవచింపబడిన ప్రస్తుతము భవిష్యత్తు





డాన్ ఇ. స్టాన్‌టన్,
క్లఫ్రెండ్ పబ్లికేషన్స్,
సిమ్లా-1, హిమాచల్ ప్రదేశ్.

Published and Printed by Claffind Publications
at the Deccan Literature Printers, 94-E, Sarojini Devi Road,
Secunderabad-500003, A. P. India.

# విషయ సూచిక

పేజి నెం:

పటములు (Maps)

# —:★ ముం దు మా ట★:—

ఈ గ్రంథ రచయితయగు సహో. డాన్. ఇ. స్టాన్టన్ ఆస్ట్రేలియా దేశపు మిషనెరి. వీరు ఈ పుస్తకము ద్వార మన దేశమందలి అన్ని ప్రాంతముల వారికి పరిచయస్థుడు. వీరు సిమ్లాలో యుండి, బహు సామాన్యమైన జీవితమును గడుపుచు, నేటివరకు వారి పేరుపై ఒక్క లోకాస్తిని సంపాదించుకొనక, వారికి వచ్చెడి ఆదాయమంతయు, మన దేశీయుల ఆత్మల రక్షణ కొరకై వినియోగించుచున్నారు. విదేశీయులగు వీరు మన దేశస్థుల రక్షణకొరకు ఇంతగా పాటుపడుట గాంచిన, దేశీయులమగు మనము మరి యెక్కువగా ప్రయాసపడుట ఎంతో అవసరము. ఈ పుస్తకము నేడు పదునెనిమిది భారతీయ బాషలలోనికి అనువదించబడి ప్రచురించబడుచున్నది.

ఈ పుస్తకపు మొదటి తెలుగు ప్రచురణ ద్వార మన రాష్ట్ర మందే కాక, దేశ విదేశములందున్న తెలుగు వారెందరో రక్షింపబడిరని తెలుపుటకు సంతసించుచున్నాను. క్రైస్తవ నాయకులు, పాస్టర్లు మొ॥వారు దీని ద్వార ఉజ్జీవింపబడుటయే కాక, ఈ అంత్య దినములందు, సువార్తను ప్రకటించుటలో తమ బాధ్యతను గ్రహించినవారై, పురికొల్పబడిరి. హిందు, ముస్లిం మతస్థులు; పుస్తకమందలి సత్యవాక్యము ద్వార పట్టబడి రక్షింపబడిరి. పెక్కు ఖైదీయులు దీని ద్వార తమ పాపముల భయంకరత్వమును మరియు దాని ద్వార కలిగెడి పరిణామమును గ్రహించినవారై, కన్నీటితో తమ పాపములను ఒప్పుకొని, క్రీస్తును తమ స్వరక్షకునిగా స్వీకరించిరి. రోమన్ కాథోలిక్ మతస్థులు, మత గురువులు వాక్యమందలి సత్యముద్వార ఒప్పింపబడి రక్షింపబడిరి. ఈ పుస్తకము ద్వార ప్రభువు రక్షించినవారి జాబితాలో ఇవి కొన్ని మాత్రమే.

ఒక్కొక్క రోజు గడుచుచున్న కొలది మనమును ప్రభు రాకడ రోజుకు సమీపించుచున్నామని ప్రతివారు తెలిసికొనవలెను. ప్రభు రాకడ సమీ

పించుచున్నదని తెలిసికొని సంతోషించుట ద్వార ప్రయోజనము లేదు. కాని నిత్య–నరకపు భయంకరత్వమును ఊహించక; అనిత్యమైనవి, నిత్యములని, లోకాశలలో మునిగి నశించుచున్న తోటివారిని రక్షించుటకును, మరియు క్రీస్తు సముఖములో, విశ్వాసులమని చెప్పుకొను ప్రతివారము మన జీవితములను దిద్దుకొనుటకును త్వరపడవలెను.

కోట్లకొలది ప్రజలు నేడు మన దేశమందు క్రీస్తు నెరుగక మరియు లోకము మీదికి రాబొయ్యేడి తీర్పుల ఉగ్రతా రోజులను తెలియక నశించు చుండగ, క్రైస్తవులమైన మనము బాధ్యతారహితముగా యుండి, సువార్తను నశించుచున్న ఆత్మలకు ప్రకటించకుండుట విచారకరము.

"...... వారు వినినను వినకపోయినను వారు తెలిసికొనునట్లు— ప్రభువగు యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడని నీవు వారికి ప్రకటింపవలెను" — (యెహెజ్కేలు 2:4).

"........వినని వానిని ఎట్లు విశ్వసించుదురు? ప్రకటించువాడు లేకుండ వారెట్లు విందురు?" రోమా 10:14.

క్రైస్తవుడా! స్వదేశ ప్రజలు నిత్యనాశనమునకు సమీపించుచుండగ వీరిని రక్షించుటలో నీ బాధ్యతను విస్మరించిన, ప్రభుకు లెక్క ఒప్పగించవలెనని తెలిసికొనుము. (యెహెజ్కేలు 3:18–20 చదువుము).

మోషే మాదిరిగా, నీ ప్రజలకొరకు విజ్ఞాపన చెయ్యలేవా? — "అయ్యో, నీవు వారి పాపములను ఒకవేళ పరిహరించితివా లేనియెడల నీవు వ్రాసిన గ్రంథమునుండి నా పేరు తుడిచివేయుమని బతిమాలుకొనుచున్నాను." (నిర్గమ కాండము 32:32).

అపో. పౌలుకు, తన స్వకీయ జన రక్షణకొరకున్న భారము, త్యాగము నీకు కలదా? "........సాధ్యమైన యెడల దేహ సంబంధులైన నా సహోదరులకొరకు నేను క్రీస్తునుండి వేరై శాపగ్రస్తుడనై యుండ గోరుదును." (రోమా 9:3).

అపో. పౌలు— "ఎవడైనను స్వకీయులను, విశేషముగా తన ఇంటి వారిని రక్షింపకపోయిన యెడల వాడు విశ్వాస త్యాగము చేసినవాడై, అవిశ్వాసికన్న చెడ్డవాడై యుండును." 1 తిమోథి 5:8.

క్రీస్తు ద్వార దేవుడేర్పరచిన రక్షణా సంకల్పమును తెలియక తమ పాపములందు నశించుచున్న, కోటానుకోట్ల ప్రజలను చూస్తూ, లోక మందలి అశ్వాశ్వత ధనమును, ఘనతను పొందుటకు ఆశించక; మన పొరుగువారితో మొదలిడి, సర్వలోకమంతట సువార్తను చాటించుటకు, నేడు ప్రతి విశ్వాసి నడుము బిగించవలెను. మన సమయము, శక్తి సామర్థ్యములను ఇతరులను రక్షించుటకు వినియోగించి, పరలోకమందలి శాశ్వత ధనమును సంపాదించుకొన పాటుపడుదుము గాక! (లూకా 12:23–34).

కృతజ్ఞత గల నమ్మకమైన విశ్వాసులు, తమ విరాళముల ద్వార, ప్రార్థనల ద్వార ఈ సేవాభివృద్ధికి తోడ్పడి, ఎందరో రక్షింపబడుటకు సహకరించిరి. వారికి మా కృతజ్ఞతలు. తగిన కాలమందు వారు ప్రభుచే మెప్పు నొందెదరు. అయితే చాలామంది, ఈ పుస్తకము ఉచితముగా పంపబడుచున్నదని, ఉచితముగా పొంద నాశించుచున్నరే కాని, ఇతరులు దీని చదివి దేవుని రక్షణ సంకల్పమును గ్రహించి రక్షింపబడునట్లుగా, వారి కొరకై తమ విరాళముల ద్వార, ఈ పుస్తకమును తిరిగి ముద్రించుటకు, పోస్టు, ప్యాకింగు మొ॥ ఖర్చుల కొరకు తోడ్పడిన వారు కారు. ఇతరులు దీని కొరకు విరాళము లివ్వకున్న, ఈ పుస్తకము నీకు ఉచితముగా ఏలాగు వచ్చెడిదో ఆలోచించుము? "పుచ్చుకొనుటకన్న ఇచ్చుట ధన్యతని" ప్రభువైన యేసు చెప్పిన మాటలను జ్ఞాపకము చేసికొనుము.

"నేను యీవిని అపేక్షించి యీలాగు చెప్పుట లేదు గాని మీలెక్కకు విస్తార ఫలము రావలెనని అపేక్షించి చెప్పుచున్నాను" ఫిలిప్పీయులకు 4:17.

ఆయన కార్యము నిమిత్తము ధారాళముగా నిచ్చు హృదయము గల వారికి మరింత అధికముగా ఇవ్వబడును. కాని అలాంటి మనస్సు లేని వారి యొద్ద నుండి, వారికి కలిగినదియు తీసివేయబడును. (మత్తయి 13:12 చదువుము).

కానుక పెట్టె దగ్గర, బీద విధవరాలిని గూర్చి యేసు ప్రభువు చెప్పుచు, "వారందరు (ఐశ్వర్యవంతులు) తమకు కల్గిన సమృద్ధిలో నుండి వేసిరి. గాని యీమె తన లేమిలో (గమనించండి!) తనకు కలిగిన దంతయు అనగా జీవనమంతయు వేసెనని చెప్పెను". (మార్కు 12:44). ఇది ఎంత త్యాగ సహితమైన కార్యము! తన సమృద్ధిలో నుండి ఇచ్చుటకన్న తన లేమిలో కలిగిన దంతయు ఇచ్చుట, తన లేమి స్థితిలో కూడ దాతృత్వపు గుణమును చూపుటయే! ప్రభుసేవపట్ల, ఇతరుల రక్షణ విషయము ఆశ, భారము యున్న, ఎదో కొంతనైన ఇవ్వలేనంత బీద లెవరుండరని చెప్పుటకు ఇది ఒక ఉదహారణము.

"వెదజల్లి అభివృద్ధి నొందువారు కలరు, తగిన దాని కన్న తక్కువ ఇచ్చి లేమికి వచ్చువారు కలరు. ఔదార్యము గలవారు పుష్టినొందుదురు. నీళ్ళు పోయువారికి నీళ్ళు పోయబడును." సామె 11:24-25.

చాలా మంది తలంచుచున్నట్లుగా, ఈ సేవకొరకు, ఏ విదేశ ద్రవ్య సహాయము లేదు. ఇది పూర్తిగా విశ్వాసముపై ఆధారపడి, స్వభాష వారి రక్షణార్థమై ఉద్దేశించబడినది. సహో. స్టాన్టన్, ఈ పుస్తకముల ముద్రణ కొరకు మాత్రమే డబ్బు చెల్లించిరి. కాని ఈ పుస్తకములు దేశ, విదేశములందున్న తెలుగువారికి పోస్టు, రైలు ద్వార పంపుటకు అవసరమగు ఖర్చులను మన తెలుగువారే భరించవలెనని తెలిపిరి.

కృపకాలము గడచిపోనై యున్నది! విశ్వాసీ, నీకు ఆత్మలను రక్షించుటకు తిరిగి తరుణము దొరుకదు. దినములు చెడ్డవి గనుక, నీవు సమయమును పోనియ్యక సద్వినియోగము చేసికొనుచు, ఈ పుస్తక సందేశ వ్యాప్తి కొరకు, నీ స్వజన రక్షణ కొరకు, ఎలాగు తోడ్పడగలవో తెల్పిన సంతోషించగలను.

తేది 17-1-74 — క్రీస్తునందు మీ సహోదరుడు.

హైద్రాబాదు-500018. — కే. థామస్ యన్. రెడ్డి.

# ప్రవచనమెట్లు నెరవేరును ?

"ఒకడు తన ఊహనుబట్టి చెప్పుటవలన లేఖనములలో ఏ ప్రవచన మును పుట్టదని మొదట గ్రహించుకొనవలెను. ఏలయనగా ప్రవచనము ఎప్పుడును మనుష్యుల ఇచ్ఛను బట్టి కలుగలేదు. గాని మనుష్యులు పరిశుద్ధాత్మ వలన ప్రేరేపింపబడినవారై దేవుని మూలముగ పలికిరి."

2 పేతురు 1:20–21.

ప్రపంచము ప్రతి సంగతియందు తీరని సమస్యను ఎదుర్కొను చున్నది. ప్రపంచ నాయకులు, లోక సంగతులను తీర్చుటకు వీలు కాకుండగుచున్నవని, వీనిని చక్కపర్చుటకు ఒక అసామాన్యమగు మనుష్యుని అవసరత కలదని భావించుచున్నారు. శాస్త్రజ్ఞులు "ప్రపంచము ఎదుర్కొంటున్న గొప్ప సమస్యలనుండి నెమ్మది పొందకున్న కొంత కాలము తర్వాత లోక ఉనికిని గుర్తించుట కష్టమని" హెచ్చరించు చున్నారు. సామాన్య జనులు మార్పొందుచున్న దినములను చూస్తు, వీని అంతమెచ్చటనో కదా? అని ఎటు తోచక విస్మయమొందుచున్నారు.

చదువరీ! లోక భవిష్యత్తు దాచబడి మర్మముగా లేదు. కాని బైబిలులో దీని అంతమును గూర్చి ముందుగానే వివరముగా ప్రవచింప బడియున్నది. నేను ప్రవక్తను కాను లేక ఈ ప్రపంచము ఏమగునో దానిని తెల్పుటకు సమర్థుడను కాను. అయితే నేను ప్రవచనములను తెలుపు బోధకుని మాత్రమే. అయినను నేను నా స్వంత జ్ఞానము ద్వార ప్రవచనముల భావములను తెల్పువాడను కాను. నేను చెప్పబోయే సంగతులు నా స్వంత ఇష్టప్రకారము చెప్పునవి కాక, నేను వివరించే ప్రవచనములను, నా తోటి ఎందరో ప్రవచన బోధకులు ఏకీభవించు వారుగా యున్నారు.

ఈ పుస్తకమును వ్రాసి, మీ కందించుట నాలోనున్న ఏ ప్రత్యేక మైన వరము ద్వార జరిగినది కాదు కాని ఈ పుస్తకములోని వార్తను మీ కందించే బాధ్యత నాపై మోపబడినది. ఈ పుస్తకములో భవిషత్తు సంగతులను మాత్రమే తెలుపక, నేడు మన కాలమందలి సంగతులను కూడ వివరించుచు, వేలకొలది సంవత్సరములకు పూర్వమే ఇవి బైబిలులో ప్రవచింపబడి ఏలాగు నెరవేరుచున్నవో వివరించితిని.

నేడు మనము ప్రవచనముల నెరవేర్పు దినములలో యున్నాము. మన కాలములో అనేకములైన ప్రవచనములు నెరవేరబడుచున్నట్లు మరే కాలములలో నెరవేర బడలేదు. ఈ రోజులను నీవు ఎదుర్కొనుట ఎలాగో తెలియకున్న, రాబోయ్యేడి సంగతులను తెలిసికొని సంతోషించుట ద్వార ఉపయోగము లేదు. ఈ పుస్తకమును వ్రాసి, నీకు ఉచితముగా అందించుటకు గల ముఖ్యోద్దేశము, నీవు ఈ రోజుల కొరకు సిద్ధ పాటుతో యుండవలెననియే. నీవు ఈ రోజుల కొరకై సిద్ధపాటుతో యుండక, భవిషత్తు విషయముల మర్మములను తెలిసికొని యుండుట ద్వార నీకు ఏ ప్రయోజనము కలుగనేరదు.

నేను ప్రసిద్ధి చెందిన గొప్ప ప్రవక్త మాటలనే తిరిగి చెప్పు చున్నాను. ప్రియ చదువరీ, రాబోయే ఉగ్రతనుండి తప్పించుకొనుమని బ్రతిమాలుచున్నాను.

## రాబోవు ఉగ్రతను తప్పించుకొనుము (మత్తయి 3:7)

ఈ పుస్తకములో బయలు పర్చబడిన భవిష్యత్ సంగతులు, ఊహాసంబంధమైన, ప్రవచన వరము ద్వార, గూఢ విద్యకు సంబంధమైన జ్యోతిష్య శాస్త్రము మొదలగు వాని ద్వార బయలుపర్చబడినవి కావు. కాని దేవుని వాక్యమగు, పరిశుద్ధ గ్రంథమగు బైబిలులోని ప్రవచనముల నాధారము చేసికొని తెల్పబడినవి. ఈ ప్రవచనములు 1900_5000

సం॥ లకు పూర్వము ప్రవక్త ద్వార వ్రాయబడినవి. ఈ ప్రవక్తలు జ్యోతిష్య శాస్త్రము, గూఢ విద్యలు తెలిసినవారు కారు కాని, వారు దేవునియందు పరిశుద్ధ జీవితము జీవించుటవలన వారికి ఈ భవిష్యత్ సంగతులు బయలు పర్చబడుటచే వారి ద్వార లిఖింపబడినవి. వీరు పరిశుద్ధాత్మని నడుపుదల ద్వార మాటలాడి, ప్రవచనములను వ్రాసిరి. (2 పేతురు 1:21 చదువుము.)

చదువరీ ! నీవు ఇంత పురాతన పుస్తకములోని ప్రవచనములు నేటి నాగరికమైన 20వ శతాబ్దములో ఎలాగు నెరవేరబడునని, అడుగ వచ్చును. స్నేహితుడా! దేవునికి కొన్ని వేల సంవత్సరములు నిన్నటివలె యున్నవని తెలిసికొనుము. ఎందరో ప్రవక్తల ప్రవచనములు 'అంత్య రోజులను,' గూర్చే తెల్పబడినవి. అనగా ఈ యుగ సమాప్తిని గూర్చే తెలిపిరి.

బైబిలు, నేడు మనకు వర్తమాన కాలమునకు సంబంధించినదే కాక భవిషత్తును కూడ తెలుపునదియై యున్నది. ప్రవచింపబడిన ఎన్నో ప్రవచనములు శతాబ్దముల క్రితమే నెరవేర్చబడినవి; ఇంకా ఎన్నో ప్రవచనములు ఇప్పటినుండే నెరవేరబడుచు, రాబోవు కాల మందు నెరవేర్పు నొందునవిగా యున్నవి. ఈ పుస్తకములో నెరవేర వలసిన ఎన్నో ప్రవచనములు వివరింపబడినవి.

బైబిలు ప్రవచనములు ఎలాగు నెరవేర బడునో తెల్పుటకు ముందుగా నేను రెండు ప్రవచనముల నెరవేర్పులను ఉదహరించు చున్నాను.

# తూరు పట్టణమును (Tyrus or Tyre) గూర్చిన ప్రవచనము

"ప్రభువైన యెహోవా సెలవిచ్చున దేమనగా–తూరు పట్టణమా నేను నీకు విరోధినైతిని. సముద్రము దాని తరంగములను పొంగచేయు రీతిగా నేను అనేక జనములను నీ మీదికి రప్పించెదను, వారు వచ్చి తూరు యొక్క ప్రాకారములను కూల్చి దాని కోటలను పడగొట్టుదురు. నేను దానిమీద నున్న మంటిని తుడిచివేయుదును. దానిని వట్టి బండగా చేసెదను. సముద్రము దాని నావరించును. అది వలలు పరచుటకు చోటగును. నేనే మాట యిచ్చితిని. ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. అది జనములకు దోపుడు సొమ్మగును. బయట పొలములో నున్న దాని కుమార్తెలు కత్తిపాలగుదురు. అప్పుడు నేను యెహోవానై యున్నానని వారు తెలిసికొందురు. ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా–రారాజగు బబులోను రాజైన నెబుకద్రెజరును నేను తూరుపట్టణము మీదికి రప్పించుచున్నాను. అతడు గుఱ్ఱములతోను రథములతోను రౌతులతోను గుంపులు గుంపులుగా నున్న సైన్యముతోను ఉత్తర దిక్కునుండి వచ్చి బయటి పొలములోని నీ కుమార్తెలను ఖడ్గముతో, నీ కెదురుగా బురుజులు కట్టించి దిబ్బ వేయించి నీ కెదురుగా డాలు నెత్తును......ఇట్లు నేను నీ సంగీత నాదమును మాన్పించెదను. నీ సితారా నాదమికను వినబడదు. నిన్ను వట్టి బండగ చేయుదును. వలలు పరచుకొనుటకు చోటగుదువు నీ వికను కట్టబడకయుందువు. నేనే మాట యిచ్చియున్నాను, ఇదే ప్రభువగు యెహోవా వాక్కు." (యెహెజ్కేలు 26:1-8,13,14).

## నెరవేర్పు :

తూరుపట్టణము వ్యాపారమందు మిక్కిలి భాగ్యవంతమగు పట్టణమైనదిగా యుండెను. అయితే దీని పాపమును బట్టి దేవుడు దీనిని నాశనము చేయుదునని తెల్పెను. ఈ ప్రవచనము ఎంత వివరముగా చెప్పబడినదో ఈ పట్టణమును గూర్చి మనము పరిశీలించిన దేవుడు

చెప్పిన తన ప్రతి మాట దీనియందు నెరవేర్చినట్లుగా చూడగలము. ఈ ప్రవచనపు నెరవేర్పు కొరకే నన్నట్లు నెబుకద్నెజరు ఈ పట్టణపు గోడలను నాశనము చేసి, దీనికి అరమైలు దూరములోని ద్వీపమందు క్రొత్త పట్టణమును కట్టించెను.

యెహెజ్కేలు ప్రవక్త ప్రవచించిన 250 సం॥ల తరువాత క్రీ. పూ. 322 సం॥న ఈ ప్రవచన నెరవేర్పు, అలెగ్జాండరు ది గ్రేట్ ద్వార నెరవేరబడెను. ఇతని కాలమందు ద్వీపమునకు వంతెనను కట్టుటకు ఈ పట్టణపు మట్టి, రాయి, కట్టెలు వాడబడి, ఈ ప్రదేశము ఒట్టి బండగా మిగల్చబడెను. ఈలాగు ఈ పట్టణము నిర్జీవమై నేటికిని జాలరులు తమ వలలను ఆరబెట్టు స్థలముగా మరియు వారు నివసించు ప్రదేశముగా చేయబడినది.

---

# యెరూషలేమును గూర్చిన ప్రవచనము

"ఆయన(యేసు క్రీస్తు) ఈ కట్టడములు మీరు చూచుచున్నారే, వాటిలో రాతిమీద రాయి యుండకుండ అవి పడద్రోయబడు దినములు వచ్చుచున్నవని చెప్పెను."

"యెరూషలేము దండ్లచేత చుట్టబడుట మీరు చూచునప్పుడు దాని నాశనము సమీపమై యున్నదని తెలుసుకొనుడి......వారు కత్తిచేత కూలుదురు; చెరపట్టబడినవారై సమస్తమైన అన్యజనముల మధ్యకు పోవుదురు, అన్యజనముల కాలములు సంపూర్ణమగు వరకు యెరూషలేము అన్యజనుల చేత త్రొక్కబడును." (లూకా 21:6, 20-24).

ఈ ప్రవచనపు మొదటి భాగము ప్రభువైన యేసు క్రీస్తు యెరూషలేము నందలి యూదుల దేవాలయమును గూర్చి చెప్పెను. అలాగే ఈ దేవాలయము యెరూషలేము పట్టణముతో సహా క్రీ. శ. 70 సం॥న రోమా ప్రభుత్వము ద్వార సమూల నాశనము కావించబడెను.

ఈ సమయమందే 10 లక్షల నివాసులు నశించగా, 97,000 మంది యూదులు చెరకొని పోబడిరి. యూదులు ఈ విధముగా ప్రపంచ మందలి నానా దేశములకు ఈ కాలమందే చెదరిపోయిరి. తరువాత యెరూషలేము, తన పాత పట్టణము ఇశ్రాయేలీయుల ద్వార 1967 సం॥న కొంత పట్టుకొనబడువరకు, అన్యుల (యూదులు కానివారు) ద్వార పరి పాలింపబడెను. ఈ నాడు ముస్లిమ్ వారి డోమ్ ఆఫ్ ద రాక్ (Dome of the Rock) మసీదు యూదుల దేవాలయపు స్థలముపైననే కట్టబడి యున్నది. మరియు పాత యెరూషలేము పట్టణము నేడు ఇంకా చాలా వరకు అరబ్బులచే ఆక్రమింపబడి యున్నది.

అన్యజనుల దినములు ఇంకా సంపూర్తి కాలేదు. కాని వీని సంభవములు ఈ కాలపు ముగింపునకు సమీపమున యుండి, ప్రపంచ భయంకర సంగతులు జరుగు దినములు సమీపించుచున్నవి.

ఈ ప్రవచనములు పై చెప్పబడిన సంగతులందే కాక ఇంకా ఎన్నో విషయములలో నెరవేర్చబడి, ప్రవచనముల నెరవేర్పు సత్యము లను చాటుచున్నవి. ప్రవచన దృష్ట్యా ఇకముందు ప్రపంచమందు జరిగే సంఘటనలు నేటినుండి అంత్య కాలమువరకు ఎలాగు నెరవేర బోవుచున్నవో పరిశీలింతము.

---

# దేశములలో ఆపదలు

> యేసు ప్రభువు— "ఆకాశమందలి శక్తులు కదిలింపబడును గనుక లోకము మీదికి రాబోవుచున్న వాటి విషయమై భయము కలిగి, మనుష్యులు ఎదురు చూచుచు ధైర్యము చెడి కూలుదురు. అప్పుడు మనుష్యకుమారుడు (యేసు క్రీస్తు) ప్రభావముతోను మహా మహిమతోను మేఘారూఢుడై వచ్చుట చూతురు" లూకా 21:25-26.

"ఆ దినము భూమియందంతట నివసించు వారందరి మీదికి అకస్మాత్తుగా వచ్చును" లూకా 21:35.

యేసు ప్రభువు ప్రవచించిన పై మాటలు, ఈ లోక అంతిమ ఘడియలను గూర్చి తెల్పుచున్నవి.

"రాబోవు భయంకరమైన కాలము"— (A grim future) అనే శీర్షిక క్రింద జనరల్ లీచ్ (Leech) లండన్ అబ్జర్వర్ (London Observer) అనే పత్రికలో ఈ విధముగా తెల్పెను. "ప్రపంచ శాంతి భద్రితలు, ఆహార జనాభా మొ॥ ప్రపంచ బాగోగులను గూర్చిన సమస్యలను, ప్రపంచ నాయకులు 'కంప్యూటర్' ద్వార తెల్సికొనప్రయత్నించగా, దిన దినము ఈ సమస్యలు తీర్చబడనేరకనే యుండునని తెలిసెనని" తెలిపెను.

కొన్ని సంవత్సరముల క్రితము, చికాగో యూనివర్సిటీ చాన్స్‌లర్ డాక్టర్ రాబర్ట్ M. హచ్చిన్స్, "తొమ్మిది సంవత్సరముల తదుపరి ఈ ప్రపంచ ఉనికి ఉండునా?" అనెడి సంశయమును వెల్లడించెను.

ఒక ప్రసిద్ధ అమెరికా శాస్త్రజ్ఞుడు, డిసంబర్ 29, 1969 సం॥లో బోస్టన్‌లో మాట్లాడుచు నేడు కనిపెట్టబడుచున్న క్రొత్త క్రొత్త మారణాయుధముల ద్వార, విజ్ఞాన శాస్త్రమువలన, నేటి మానవుడు తన స్వనాశనమునే కోరుచున్నాడని; 30 సం॥ల తర్వాత వీని ద్వార ప్రపంచమంతయు నాశనము కావించబడగా, ఉత్పత్తికి సంబంధించిన శాస్త్రము (Genetic Engineering) ద్వార ఏ కొంత భాగమో మిగల్చబడుననెడి భావమును వ్యక్తపర్చెను.

డాక్టర్ ఐజక్ అసిమొవ్ అనే బోస్టన్ యూనివర్‌సిటీ శాస్త్రవేత్త, "క్రీ. శ. 2000 సం॥ తర్వాత ఈ ప్రపంచ ఉనికిని గుర్తు పట్టుటకు మానవుడు లోకములో జీవించుట అనుమానాస్పదమే నని, జలప్రళయము ద్వార భూలోకములో నాశనమైనప్పుడు, నోవహు ఓడ ద్వార మానవ బీజమును కాపాడబడినట్లు, నేటి వైజ్ఞానిక వృద్ధి ద్వార చంద్రమండల

ములో మానవ బీజమును నశింపకుండ జీవింపజేసిననే, ఈ చంద్ర మండలములో నివసించే మనుష్యుల (Moon Men) ద్వార మానవ ఉనికిని కాపాడగలమని" చెప్పెను.

R. కోలిన్ అనే వాడు, 'Nigeria in Conflict' అనే తన పుస్తకమందు "మనుష్యుల జ్ఞానము ఈ విధముగా వృద్ధి చెందుచున్న మరో నూరు సంవత్సరములలో మానవుని మేధాశక్తి ఎలాగు రూపొందునో అంచనా వేయుట కష్టమని" తెలిపెను.

డాక్టర్ S. G. బ్రౌన్ తన Human Ecology పుస్తకములో "అణు మారణాయుధముల భీబత్స, జనాభివృద్ధి, ఒక దేశముపై మరొక దెశమునకుగల విరోధము మొ॥ సమస్యల ద్వార ఇంక 20 లేక 30 సం॥ల తర్వాత మానవుని ఉనికి ఈ ప్రపంచములో ఎలాగుండునో తెల్పికొనుట కష్టమని" తెల్పెను.

ఇండియా పార్లమెంట్ డిప్యూటి స్పీకర్ G. G. స్వెల్, ప్రపంచ సమాజము, అనేక బాధలకు, తీరని వేదనలకు గురియై యున్నదనెను.

H.G. వెల్స్ అనేవాడు తన 'Mind at the end of the tether' పుస్తకములో 'ప్రపంచము అంతిమ దశకు చేరినదని, దీనిలో జీవరాసు లన్నీ నశించిపోయే కాలము సమీపమైనదని' నుడివెను.

పై విధముగా, వెవ్వేరుగా చెప్పబడిన రీతిగానే, బైబిలును, ఈ లోకమునకు అంతము రాబోవుచున్నదని ప్రవచించుచున్నది. ప్రపంచము తన అంత్యదినమునకు దారి తీయుచున్నది. దీనికి ముందు చివరి కాలములో 7 సం॥ ఘోర శ్రమలు భూలోకమునకు రాబోవుచున్నవి. అయితే లోకము సర్వనాశనము కాకముందే దేవుడు దీనిని నాశనము నుండి కాపాడును.

# యుద్ధములు మరియు యుద్ధ సమాచారములు

యేసు ప్రభువు — "మరియు మీరు యుద్ధములను గూర్చియు యుద్ధ సమాచారములను గూర్చియు వినబోదురు; మీరు కలవరపడకుండ చూచుకొనుడి. ఇవి జరుగవలసియున్నవి గాని అంతము వెంటనేరాదు. జనము మీదికి జనమును రాజ్యము మీదికి రాజ్యమును లేచును." మత్తయి 24:6-7



క్రీ. శ. 1900 సం॥ నుంచి యుద్ధముల ద్వార 90,000,000 మంది మరణించిరి. మరియు రెండు శంఖముల డాలర్ల (15,000,000,000,000 రూ॥లు) ఖర్చు, దేశములలో యుద్ధ సామాగ్రిని తయారు చేయుటకు అయ్యేను.

రెండవ ప్రపంచ యుద్ధమే అంతిమ యుద్ధమని భావించగా, అంతిమ యుద్ధములు దీనితోనే ఆరంభమైనవని ప్రవచనముల ద్వార తెల్సికొనెదము. రెండవ ప్రపంచ యుద్ధము 1945 సం॥లో ముగియగా, అప్పటినుండే వివిధ దేశముల మధ్య అంతర్ రాజ్య విప్లవములు, రాజులను పదవీభ్రష్ఠులను చేయుటకు జనుల ద్వార చేయబడిన తిరుగుబాటులు మొ॥ వందల కొలది సమస్యలు యుద్ధములకు దారితీసినవి. ఈ విధముగా యుద్ధములు జరిగిన దేశములు కొన్ని ఇచ్చట ఉదహరించబడినవి.

రష్యా, పోలండు, బల్గేరియా, హంగేరి, చెకొస్లొవేకియా, రుమేనియా, ఇరాన్, ఇరాక్, సిరియా, లెబనన్, ఇశ్రాయేలు, జోర్డాన్, ఈజిప్టు, యెమెన్, లిబియా, ఆల్జీరియా, సైప్రస్, గ్రీస్, టర్కీ, నైజీరియా, సుడాన్, కాంగో, ఇండియా, పాకిస్తాన్, టిబెట్, చైనా, వియత్నామ్, లావోస్, కంబోడియా, కొరియా, థైలాండు, బర్మా, మలయా, ఇండోనెసియా, ఫిలిప్పైన్సు ఫార్మోసా, పశ్చిము ఇరియన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, అమెరికా సంయుక్త రాష్ట్రములు, క్యూబా, డోమినికన్ రిపబ్లిక్, గొతమాల, బ్రెజీల్, బొగోట, క్యూమె, మాట్సు, ఫ్రాన్సు, ఇంగ్లాండు (U.K.), ఐర్లాండు మొ॥ దేశములు. ఇంకా యుద్ధములు జరిగిన దేశములు మరికొన్ని ఇచ్చట ఉదహరించబడక పోవచ్చును.

మూడవ ప్రపంచ యుద్ధము జరిగిన, నేటి అణు విజ్ఞానము ద్వార కనొనబడిన మారణాయుధముల ద్వార ప్రపంచము నాశనము కావడము తధ్యము. అయితే దేవుని హస్తము తోడై యున్నందున ఈ యుద్ధము జరుగకుండ యున్నది. కాని యుద్ధము జరిగితే అనేక పట్టణములతో సహా ప్రపంచమంతా నాశనమగును.

మే, 1972 సం॥లో అమెరికా ప్రెసిడెంటు నిక్సన్, రష్యా దేశముతో మారణాయుధ వృద్ధిని నిలిపివేయుటకు ఒక ఒప్పందము చేసెను. ఈ ఒప్పందము ఈ ఇరుదేశములు గౌరవించిననే లాభమగును. అయితే, ఈ ఒప్పందము ద్వార ప్రపంచములో శాంతి భద్రతలు ఏర్పడునని చెప్పలేము. ఏవో కలతలవలన యుద్ధములు దేశముల మధ్య చెలరేగుచునే యుండును.

రష్యాకు 1,618 I.C.B.M. (Inter Continental Ballistic Missiles)-అంతర్ ఖండములపై ప్రయోగింపబడే మారణాస్త్రములు కలవు. అమెరికాకు ఇవి 1,054 కలవు. ఇరుదేశములకు ఒక్కొక్క స్టేషన్‌లో 100 అస్త్రములు కలవిగాయున్న రెండు A.B.M. (Anti Ballistic Missile) స్టేషన్లు కలవు.

రష్యా, అమెరికా దేశములు ఒకరికి పోటీగా ఒకరు I.C.B.M ఆయుధముల ఉత్పత్తిని పెంపొందించుచున్నారు.

శాంతి కొరకు చేయు మాటలు, ప్రపంచములోని దేశములను మభ్యపెట్టుటకే గాని, యుద్ధములు, యుద్ధ సమాచారములు దిన దినము ఎక్కువగుచునే యుండును. ప్రపంచములో ఇంతవరకు జరుగని అంతిమ ఘోర యుద్ధము జరుగు దినము వచ్చుచున్నది. దేశములు దీనికొరకై సిద్ధపడుచున్నవి.

# ఆకాశమందు మహా భయోత్పాతములు, గొప్పసూచనలు

యేసు ప్రభువు—"ఆకాశమునుండి మహా భయోత్పాతములును గొప్ప సూచనలును పుట్టును." లూకా 21:11.



ఈ కాలములో కనుగొనబడిన, అంతరిక్షములోనికి పంపబడే రాకెట్లు, అణుమారణాస్త్రములు మొ॥ వానిని గొప్ప సూచనలనుగా గుర్తించ వచ్చును వీటిని భూమిపై ఏ ప్రదేశములోనైన, సూది మొనతో గుర్తుపెట్టిన స్థలమందు ప్రయోగించ గల్గె విధముగా కన్గొన బడినవి. ఈ ఆయుధములు ఒక ఖండమునుండి వేరే ఖండమువరకు చేరుటకు ?0 నిమిషములే పట్టును. ఇవి తమ దేశముపై ప్రయోగించ బడినట్లుగా పేలుడుకు చివరి మూడు నిమిషములకు ముందుగా మాత్రమే రేడార్సు (Radars) ద్వార తెల్పికొనబడును.

1971 సం॥లో రష్యా దేశము మనుష్యుని అవసరము లేకుండ అంతరిక్షములోనికి సోయజ్ II ను పంపగలిగెను అప్పటి నుండి సోయజ్, సాల్యుట్ (salyut) సాటెలైట్లను అంతరిక్షములోనికి పంపి అంతరిక్ష విజ్ఞానమందు ఎన్నో క్రొత్త సంగతులను కనుగొనిరి. వీని ద్వార ముందు ముందు అవసరమగు అంతరిక్ష విజ్ఞాన అభివృద్ధి కొరకు ఏర్పాట్లు చేయుచున్నారు.

అంతరిక్ష విజ్ఞానము ఎంతగా అభివృద్ధి నొందినదంటే ప్రత్యేక మైన కెమెరాలు, రెడార్లు, ఎలక్ట్రానిక్ పరికరముల ద్వార యుద్ధము నకు సంబంధమైన ఉనికిని, భూమిపైన గాని, ఆకాశమందైన గాని లేక సముద్రములోనైన గాని తెల్సికొన వీలుకలదు. రష్యా కనిపెట్టిన సాల్యుట్ సాటెలైటు ద్వార పది హైడ్రోజన్ బాంబులను ఎచ్చటకైన ప్రయోగించుటకు పంపవచ్చును. అణు ఆయుధములు ప్రయోగింప బడినట్లుగా, అవి ప్రేలకముందే కనుగొనునట్లు కూడ పరికరములు కనుగొనబడినవి.

అమెరికా, రష్యా దేశములు అంతరిక్ష విజ్ఞానమందు ఒక దానితో ఒకటి పోటీపడుచు, మారణాయుధములను వృద్ధి చేసికొనుచున్నవి. విజ్ఞానము ద్వార కనుగొనబడిన మారణాయుధములచే సర్వనాశనము తథ్యము; ఏ దేశమైనను గెలిచిన, మిగతా దేశములు దాని దయ ద్వార బ్రతుకక తప్పదు. ఈ విజ్ఞానాభివృద్ధి ఆకాశమందలి మహా భయోత్పాతములుగా, గొప్ప సూచనగా ఎంచవచ్చును.

బైబిలు ప్రవచించిన రీతిగా, ఇట్టి వైజ్ఞానిక కాలమందే ఆకాశ శక్తులు కదిలింపబడును—"పెద్ద గాలిచేత ఊగులాడు అంజూరపు చెట్టు నుండి అకాలపు కాయలు రాలినట్టు ఆకాశ నక్షత్రములు భూమి మీద రాలెను. మరియు ఆకాశ మండలము చుట్టబడిన గ్రంథము వలెనై తొలగిపోయెను. ప్రతి కొండయు ప్రతి ద్వీపమును వాటి వాటి స్థానము తప్పెను. భూరాజులును, ఘనులును, సహస్రాధిపతులును, ధనికులును, బలిష్ఠులును, ప్రతిదాసుడును, ప్రతి స్వతంత్రుడును, కొండ గుహల

లోను బండ సందులలోను దాగుకొని—సింహాసనాసీనుడై యున్నవాని యొక్కయు గొఱ్ఱెపిల్ల యొక్కయు ఉగ్రత మహాదినము వచ్చెను. దానికి తాళజాలిన వాడెవడు? మీరు మా మీదపడి ఆయన సన్నిధికిని గొఱ్ఱెపిల్ల ఉగ్రతకును మమ్మును మరుగు చేయుడి అని పర్వతములతోను బండలతోను చెప్పుచున్నాడు" ప్రకటన 6:13-17.

# కరవులు మరియు జనాభా పెరుగుదల

> యేసు ప్రభువు—"అక్కడక్కడ కరువులును భూకంపములును కలుగును." మత్తయి 24:8.

ప్రస్తుత ప్రపంచ జనాభా 3,600 మిలియనులు (మిలియను = పది లక్షలు). 35 సం॥ల తర్వాత జనాభ దీనికి రెట్టింపు అగునని, క్రీ. శ. 2000 సం॥ వరకు 6,000 మిలియనుల జనాభ అగునని మానవుని అంచనా. ఈ రీతిగా జనాభా పెరిగిన, లోకమందధిక ఆహార సమస్య ఏర్పడగలదు.

ప్రపంచ ఆహార సమస్యలను గూర్చి ఎక్కువగా వ్రాసిన, ప్రొఫెసర్ జార్జ్ బోర్గుస్ట్రమ్...."వ్యవసాయాభివృద్ధి ద్వార ఆహారమును పెంపొందించలేకున్న, రాబోవు కాలములో ఆహార సమస్య తీవ్రముగా అగునని అభిప్రాయపడెను. అంతేకాక అతను, ప్రపంచములోని సారవంతమైన భూమి దాదాపు అంతయు సాగుబడి క్రిందికి తేబడినను, ఇంక ఇప్పటికి ప్రపంచములో ప్రతి పదిమందిలో ఎనిమిది మందికి సరియైన ఆహారము లభించుటలేదని, ప్రతి ముగ్గురిలో ఒకరు ఆకలితో బాధ పడుచున్న వారేనని" తెల్పెను.

ప్రపంచ జనాభ ప్రతి దినము రెండు లక్షలు పెరుగుచున్నది. ఇండియా దేశపు జనాభా పది సంవత్సరములలో 12 కోట్లు ఎక్కువగా పెరిగినది. ఈ రీతిగా జనాభ పెరిగిన, ఈ శతాబ్దపు చివరిలోగా

ఇండియా జనాభా 92.4 కోట్లు వరకు పెరిగే అవకాశము కలదు. ఇండియా ప్రభుత్వము, జనాభాను అదుపులోనికి తెచ్చుటకై కుటుంబ నియంత్రణము ప్రవేశపెట్టి సాలుకు 60 కోట్ల రూపాయలను ఖర్చు చేయుచున్నది.

ఇండియాలో, దాదాపు 50 లక్షల భిక్షకులును, 8.2 కోట్లు ఇండ్లు, నివాసము లేనివారు మరియు నూటికి నలువది మంది బీదలు కలరు. ఈ దేశములో 1960 మరియు 1972 సం॥లలో అతివృష్టి అనావృష్టి ద్వార, ఆహార సమస్య తీవ్రముగా ఏర్పడెను. ఆహార సమస్యను తీర్చుటకు ప్రభుత్వము ఎన్నోరకములుగా కృషిచేసినను, ఇంకా ప్రతి సం॥ 36, 31,000 టన్నుల ఆహార ధాన్యము ఇతర దేశములనుండి దిగుమతి చేసికొనవలసిన అవసరము వచ్చెను.

ఒక వ్యవసాయ అనుభవశాలి, "ఇండియా, ఆహార సమస్య త్వరగా తీర్చుకొనుటకు పూనుకొనకున్న, ఘోర విపత్తు సంభవించునని, 1970 సం॥ తర్వాత ఆకలితో ప్రజలు చనిపోయే అగత్యము ఏర్పడునని, అభిప్రాయపడెను.

ఆహార సమస్యను తీర్చుటకు, శాస్త్రజ్ఞులు, వ్యవసాయ అనుభవశాలులు, వృక్ష, జంతు శాస్త్రజ్ఞులు, ఆకు, అలము, విత్తనములు, పురుగులు, కీటకములు మొ॥ వానిపై కూడ పరిశోధన జరిపి, వీనిని ఆహారముకొరకు వినియోగించుట ద్వార ఎలాగుననో ఈ సమస్యను పరిష్కరించవలెనని తీవ్రముగా కృషి సల్పుచున్నారు.

పురుగులు, కీటకములు, నానా రకములైన పక్షులు మొ॥ వానిపై పరిశోధన జరిపి, వీనినికూడ ఆహారముగా వినియోగించుటకు ఆలోచించుచున్నారు. ఈ కాలములో, విజ్ఞానశాస్త్రము ద్వార ఆహారము సమృద్ధిగా పండించినట్లు యే కాలమందును పండించలేదు. అయినను ప్రపంచములో కరువులు దిన దినము ఎక్కువగా అగుచున్నవి.

పంటలను నాశనము చేసే పురుగుల ద్వార ప్రతి సం॥ దాదాపు 2,850 కోట్ల రూపాయల విలువగల ధాన్యము నష్టము అగుచున్నది.

ఆస్ట్రేలియా దేశములోని క్వీన్స్ లాండులో ఎన్నడు ఎరుగని ఎలుకల ద్వార 1972 లో ఎంతో ఆహార నష్టము సంభవించెను. ఇట్లు పురుగులు, కీటకములు, ఎలుకలు మొ॥ వాని ద్వార కల్గుచున్న నష్టము ద్వార ఆహార సమస్య తీవ్రమగుచున్నది.

లోకములో కరువులవలన యుద్ధములు కూడ ఎక్కువగా అయ్యే సూచనలు కలవు. ఆహారవృద్ధి తక్కువగుట ద్వార ధరలు ఎక్కువ అగును. వీని ద్వార దోపిడీలు, హత్యలు, ద్రోహములు, జగడములు మొ॥ సంభవించును. వీటన్నింటిని చూడగా 2 తిమోతి 3:1 లో చెప్పిన రీతిగా, "అంత్య దినములలో అపాయకరమైన కాలములు వచ్చునని తెలిసికొనుము" అని పౌలు తెల్పిన సత్యము నమ్మదగును

ప్రపంచ ఆహార బ్యాంకు (World Food Bank) వారు ప్రపంచమంతటికి ఒక నియంత (Dictator) వచ్చునని, ఆహార క్రయవిక్రియము అతని ఆజ్ఞానుసారముగా జరుగునని భావించుచున్నారు. వారి భయాందోళనములు ప్రకటన 13 వ అధ్యాయములోని ప్రవచన నెరవేర్పును గుర్తు చేయుచున్నది.

# తెగుళ్ళు మరియు విపత్తులు

యేసు ప్రభువు—"అక్కడక్కడ గొప్ప భూకంపములు కలుగును, తెగుళ్ళు, కరువులును తటస్థించును,......భూమిమీద సముద్రతరంగముల ఘోషవలన కలవరపడిన జనములకు శ్రమయు కలుగును." లూకా 21:11-25.

డాక్టర్ చార్లెస్ ఫ్లెచ్చర్, సిగరెట్టు పొగ త్రాగుట ద్వార కాన్సర్ వ్యాధి వచ్చి చనిపోయినవారి సంఖ్య, టి.బి. కలరాతో చనిపోయిన వారి సంఖ్యతో సమానముగా యున్నదని, పొగ త్రాగుట ద్వార మనుష్యుల ఆరోగ్యమునకు తీవ్ర నష్టము జరుగుచున్నదని తెలిపెను.

పేడ పురుగులు, మిడుతలు మొ॥ కీటముకల (Insects) ద్వార అమెరికా దేశములో ఎంతోపంట నష్టములు కల్గెను. వీనిని నాశనము చేయుటకు 6.75 కోట్ల రూపాయలు ఖర్చు అయ్యేను.

1896 నుండి 1948 వరకు పెద్ద భూకంపములు తరచుగా సంభ వించలేదు. అయితే 20 సం॥ తర్వాత లోకమందు భూకంపములు హెచ్చయ్యేను.

ఇశ్రాయేలు దేశమందు ఆరు రోజులు యుద్ధము 1967 సం॥లో జరిగిన తర్వాత లోకమందు భూకంపములు ఎక్కువైనవని కనుగొన బడెను. రానున్న రోజులలో లోకమందు భూకంపములు మరి యెక్కు వగునని అంచనా వేయబడెను.

1967 సం॥లో 17 సార్లు భూకంపములు రాగా తదుపరి క్రమ ముగా 1968 లో, 19, 1969, లో 21, 1970 లో 24 భూకంపములు పెరుగుచు వచ్చెను.

ఈ రోజులలో భూమి, కంపన స్థితియందే హెచ్చుగాయున్నదని, ప్రపంచమందలి ఏదో ఒక ప్రాంతము తరచుగా భూకంపమునకు గురి అగుచున్నట్లు తెలిసికొనబడెను. ఇండియాలో 1967 సం॥ మహా రాష్ట్రములో భూకంపము జరిగెను.

1970 సం॥ లో చైనా దేశములో గొప్ప భూకంపము జరిగెను. దక్షిణ అమెరికాలో పెరూ ప్రాంతమందు 1970 జూన్ మాసమందు గొప్ప భూకంపము కలిగి, 50,000 మంది చనిపోగా, 8,00,000 మందికి నివాస ములు లేక ఇబ్బందుల పాలైరి. యంగే (Yungay) అనే పట్టణ జనాభా 41,000 మంది; వీరిలో 3,000 బ్రతుకగా, మిగిలినవారంతా భూకంపము ద్వార నశించిరి. అదే సం॥ లో టర్కీదేశమందు 1,100 మంది భూకంపము ద్వార చనిపోయిరి. 1971 సం॥ లో అమెరికాలోని లాస్ఏంజల్స్ ప్రాంతమందు భూకంపము ద్వార 30,000 మైళ్ళవరకు కంపింపబడి ఘోరనష్టము కల్గెను. అలాంటిదే తిరిగి మరల కాలిఫో

ర్నియాలో వచ్చునని, తీరని నష్టము కలుగునని కనుగొనబడెను. 1960 సం॥ లో భూకంపముల ద్వార 45,000 మంది చనిపోయిరి. ఇరాన్ దేశమందు 1962 లో 12,000 మంది, 1968లో 11,000 మంది భూకంపముల ద్వార చనిపోయిరి.

అమెరికాలో జూన్ 1972 మరియు 1969 సం॥లలో వచ్చిన భూకంపములవలన, సముద్ర ప్రవాహము కొన్ని పట్టణములలో 20 అడుగుల పైకి ఉబికివచ్చుట ద్వార ఎంతోమంది చనిపోగా, మిక్కిలి నష్టము కలెను.

1972 లో ఆస్ట్రేలియా దేశమందు భూకంపమువలన సిడ్నీ పట్టణ వీధుల లోనికి సముద్రపునీరు ప్రవహించి నదుల మాదిరిగా మార్చెను.

1970 లో బంగ్లాదేశ్ లో ఈ శతాబ్దమందు ఎన్నడు ఎరుగని గొప్ప తుఫాను ద్వార 5,00,000 మంది ప్రాణాలు కోల్పోవుటయే కాక దేశము గొప్ప నష్టమునకు గురి యయ్యెను.

భూకంపములు, ఆపదలు, విపత్తులు, వరదలు మొ॥ వానిద్వార ఇంత వరకు ప్రపంచము ఎంతో నష్టము పొందెను. ఇవి వచ్చెడి రోజులలో ఇంకా హెచ్చుగా కలుగును.

బైబిలులో ప్రవచింపబడినట్లు, భూలోకమందు ఎన్నడు కని, విని ఎరుగని గొప్ప భూకంపము యెరూషలేములో రాబోవుచున్నది. దీని వలన 7,000 మంది చనిపోవుదురు. (ప్రకటన 11:13). ఈలాటి ఆపదలు, విపత్తులు మొ॥ దేవుని తీర్పు ద్వార లోకమందు వచ్చే శ్రమల రోజులలో విపరీతముగా జరుగుననికూడ ప్రవచింపబడినది. (ప్రకటన 16:18-20)

# అంతరిక్షమందలి మర్మములు



> యేసు ప్రభువు—" మరియు సూర్యచంద్ర నక్షత్రములలో సూచనలు, భూమి మీద సముద్ర తరంగముల ఘోషవలన కలవరపడిన జనములకు శ్రమయు కలుగును." లూకా 21:25.

అంతరిక్షమందు క్రొత్త క్రొత్త మర్మములు దూరదర్శినుల ద్వార కాన్పించుచున్నట్లు శాస్త్రజ్ఞులు కనుగొనిరి. ఈ శతాబ్దమందు, మహా కాంతివంతమైన ఉల్కలు మొదలగునవి అంతరిక్షమందు వెలువడుచున్నవని, వానిద్వార ఏదో క్రొత్త పరిణామము కలుగబోవుచున్నట్లు శాస్త్రజ్ఞులు భావించుచున్నారు.

1968 లో రేడియో టెలిస్కోపు ద్వార అంతరిక్షమందు కొన్ని సూచనలు కనుగొనబడినవి. డాక్టర్ ఫ్రాంకు డేగ్ అనే శాస్త్రజ్ఞుడు వీని విషయమై చెప్పుచు, అంతరిక్షమందలి క్రొత్తగా వెలువడుచున్నశక్తుల ద్వార వెలువడే కాంతివంతమైన శక్తి (Energy) లోకమందు ఉత్పత్తియగు మొత్తము శక్తి (Total energy) కన్నా 10 బిలియనులు ఎక్కువగా యున్నదని వివరించెను.

అంతరిక్షమందున కన్పించెడి ఉల్కల లాంటివాని విషయమై శాస్త్రజ్ఞులు ఎంతో పరిశోధించినను, వాటి విషయము ఇంకా ఏ నిశ్చయతకు రాలేదు. ఇది కూడ ఆకాశమందు సూచనగా యున్నది.

మనుష్యుడు అంతరిక్షములోనికి ప్రయాణించి పరిశోధన గావించుట కూడా ఒక సూచనగా యున్నది. 1969 జూలైలో మానవుడు మొదటిసారిగా చంద్రమండలముపై కాలిడెను.

డాక్టర్ తామస్ ఓ. పెయిన్ అనే అమెరికా అంతరిక్ష శాస్త్రజ్ఞుడు, మనము మనస్సులో ఏమి చెయ్యవలెనని ఊహించుకొన్న దానిని చేయుటకు

సమర్ధులముగా యున్నామని తెల్పెను. నిజముగానే నేటి మానవుడు తన విజ్ఞాన శాస్త్రము ద్వారా అనుకొన్న దానిని చేయుటకు వీలు కలుగచేసి కొన్నాడు।

1962 లో అమెరికా, మారినర్ II ను శుక్ర గ్రహము (Venus) మీదికి ప్రయోగించి, దాని ఉనికిని రేడియో ద్వార ప్రసారము చేసెను. 1965 లో మారినర్ IV ను 50 మిలియనుల మైళ్ళ దూరములో నున్న అంగారక గ్రహము (Mars) వైపుకు పంపగా, అది గ్రహము చుట్టు ప్రయాణించి తిరిగివచ్చెను. 1971 లో అమెరికా, రష్యా అంతరిక్ష నౌకలు అంగారక గ్రహము చుట్టు తిరిగి మరలివచ్చెను. 1976 వరకు అమెరికా, మనుష్యుని అవసరము లేకుండ అంతరిక్ష నౌకను అంగారక గ్రహము మీదికి పంపుటకును, 1981 లో మనుష్యుని సహాయముతో మరి రెండు అంతరిక్ష నౌకలను పంపి ఒక గ్రహము నుండి వేరొక గ్రహమునకు ప్రయాణములు జరుపుటకు ఆలోచించుచున్నది.

1972 ఫిబ్రవరిలో, పైనీర్ 10 ను భూమి నుండి 500 మిలియనుల మైళ్ళ దూరములో నున్న గురు గ్రహము (Jupiter) నకు రెండు సం॥ల ప్రయాణములో చేరుటకు ప్రయోగించబడెను. రేడియో ద్వారా ఈ నౌకా ప్రయాణ మంతయు ప్రసారము చేయబడును. ప్రయోగించబడిన యంత్రమునందు ఏదైన దోషమున్న కంప్యూటర్ ద్వారా సరిచేయుట వలన ప్రయాణము కొనసాగించబడును. 1978 వరకు శని గ్రహము (Saturn) నెప్ట్యూన్(Neptune), యురేనస్(Uranus) = సముద్రదేవత) యముడు (Pluto) మొదలగు గ్రహముల మీదికి అంతరిక్ష నౌకలను పంపి 1980 వరకు ఈ గ్రహములతో మానవుడు సంబంధము కల్గించుకొనుటకు ఆలోచించుచున్నాడు.

ఇండియా 1974 సం॥న శ్రీహరికోట నుండి అంతరిక్ష యాత్రకొరకు రోదసీ నౌకను పంపుటకు సన్నాహములు చేయుచున్నది.

ఈలాంటి పెక్కు సూచనల ద్వార మరియు ముందు ముందు అంతరిక్షములలోని మర్మములను తెలిసికొనుటకు చేయు ప్రయత్నముల వలన గొప్ప మార్పులు కలుగును. సూర్యుడు కాంతిహీనముగా అగును, చంద్రుడు రక్త వర్ణముగా మారును, నక్షత్రములు భూమిపై రాలిపోవు

నని బైబిలు ప్రవచించుచున్నది. ఈలాంటి ప్రయోగములు బైబిలు ప్రవచనముల నెరవేర్పు కొరకేనన్నట్లుగా యున్నవి. (మత్తయి 24:29, యోవేలు 2:31, ప్రకటన 6:12-13).

# ధనాపేక్ష, సుఖభోగములు మరియు భక్తిహీనత

> అపొ. పౌలు—"ఎలాగనగా మనుష్యులు స్వార్థ ప్రియులు, ధనాపేక్షులు... ... దేవునికంటె సుఖానుభవము నెక్కువగా ప్రేమించువారు... ...నై యుందురు." 2 తిమోతి 3:2-5.

ఈ రోజులలో పనివారు కొంచెము కాలమే పని చేసి అధిక వేతనము పొందుటకు సమ్మెలు చేయుచున్నారు. ఇదికాక, వారమంతటిలో 4 రోజులే అనగా వారములో 30 గం॥ మాత్రమే పని చేయుటకు తీర్మానించుచున్నారు. ఇట్లు మనుష్యులకు విరామ సమయము ఎక్కువగుట ద్వారా, సుఖభోగములు, నేరములు, అవినీతి జీవితములు అలవడుచున్నవి. యౌవ్వనులు సంపదతో వచ్చే సుఖానుభవమును, బాధ్యతారహితమైన జీవితములను కోరి, జీవితములో స్వేచ్ఛనే అధికముగా కోరుచున్నారు. ప్రపంచమందలి స్వతంత్ర దేశములేకాక, ఒక శాసనము క్రింద పరిపాలింపబడే కమ్యూనిష్టు దేశములు సహితము, ఈలాంటి యౌవ్వనుల ద్వార పెక్కు సమస్యలను ఎదుర్కొంటున్నవి.

డాక్టర్ ఫ్రాన్సిస్ షేఫర్ తన 'Escape from Reason' పుస్తకములో, "దేవుడు లేడు, మనుష్యుడు, ఏ ఉద్దేశము కొరకు జీవించుచున్నాడో తెలియక వ్యర్థుడగుచున్నాడు. కావున, మనుష్యుడు తన జీవితములో కల్గే నిరాశలను జయించుటకు గాను యుక్తాయుక్తములు కాని అనుభవములగు త్రాగుడు, బూతు బొమ్మలు, బూతుసాహిత్యము, మత్తుపదార్థములు ఉపయోగించుచున్నాడు. అయితే చివరకు వీని ద్వారా పిచ్చి పట్టే అవకాశము కలదని, ఈలాంటి అనుభవములకు దూరముగా యున్నవాడే జీవించ గల్గునని తెల్పెను.

అమెరికా దేశ ప్రజలు ప్రతి సం॥ 110 లక్షల కార్లను కొనెదరు. యవ్వనులు సాలుకు 840 కోట్ల రూపాయల విలువ చేసే గ్రామఫోను రికార్డులను కొనెదరు. అలాగే పెంపుడు జంతువులగు కుక్కలు, పిల్లులు మొ॥ వానిని పోషించుటకు, కొనుటకు రూ. 2,250 కోట్లు ఖర్చు చేయుదురు.

బ్రిటన్ దేశపు మెథడిస్టు వారు "ఈలాగున దిన దినము ఆరాధనకు వచ్చే వారి సభ్యత్వము తగ్గిపోవుచున్నట్లయిన మరో 4 సం॥లలో (చర్చికి) ఆరాధనకు వచ్చే వారు ఎవరు యుండరని తెలిపిరి. బ్రిటన్‌లో నున్న కాథలిక్, ప్రొటస్టెంటు సంఘములు, దేశములో నున్న జనాభాలో నూటికి ఇద్దరు మాత్రమే (చర్చికి) ఆరాధనకు వచ్చువారని తెల్పెను.

జపానువారు మనుష్యునికి సుఖానుభవము హెచ్చునట్లు, ఎన్నో క్రొత్త పరికరములను కనుగొనిరి. ఇప్పుడు వారే ఒక 'అద్భుతమైన మంచము'ను తయారు చేసిరి. ఇది గుండ్రముగా తిరుగునట్లు, దాని చుట్టు దినావసరములకు పనికివచ్చే టెలివిజన్ యంత్రము, రెఫ్రిజిరేటర్, సంగీతమునకు హైఫై, త్రాగుటకు మత్తు పదార్థములు మొదలగునవి అమర్చిరి. దీని ద్వార మనిషి లేచే అవసరము లేకుండనే మంచము పై కూర్చొని అన్ని అవసరములను తీర్చుకొనుటకు వీలగును.

గుజరాతు రాష్ట్ర గవర్నర్ శ్రీమాన్ నారాయణ్, "ఇండియా దేశము, సంపదయందే అభివృద్ధి గాంచుటకు ఉద్దేశించక, సమాజము, నీతి, సంస్కృతి, మొదలగు వాని అభివృద్ధియందును కృషి చేసిన, దేశ అభివృద్ధి శాశ్వతముగా యుండునని" నుడివెను.

పై విధముగానే బైబిలు బోధించుచున్నది—"మీరు ఆయన (దేవుని) రాజ్యమును నీతిని మొదట వెదుకుడి; అప్పుడవన్నియు (లోక సంబంధమైన అవసరములు) మీ కనుగ్రహింపబడును." మత్తయి 6:33.

# అవినీతి మరియు దౌర్జన్యము



యేసు ప్రభువు—"నోవహు ఓడలోనికి వెళ్ళిన దినమువరకు జనులు తినుచు త్రాగుచు పెండ్లాడుచు పెండ్లి కియ్య బడుచు నుండిరి...... లోతు దినములలో జరిగినట్టును జరుగును. జనులు తినుచు, త్రాగుచు, కొనుచు, అమ్ముచు, నారు నాటుచు, ఇండ్లు కట్టుచు నుండిరి... ఆ ప్రకారమే మనుష్య కుమారుడు (యేసు క్రీస్తు) ప్రత్యక్షమగు దినమున జరుగును. "లూకా 17:27-30.

"భూలోకము దేవుని సన్నిధిని చెడిపోయి యుండెను. భూలోకము బలాత్కారముతో నిండియుండెను. దేవుడు భూలోకమును చూచినప్పుడు అది చెడిపోయి యుండెను; భూమి మీద సమస్త శరీరులును తమ మార్గమును చెరిపి వేసుకొని యుండిరి." ఆదికాండము 6:11-12.

"ఎలాగనగా మనుష్యులు స్వార్థ ప్రియులు, ధనాపేక్షులు, బింకములాడువారు, అహంకారులు, దూషకులు, తల్లిదండ్రులకు అవిధేయులు, కృతజ్ఞతలేని వారు, అపవిత్రులు, అనురాగ రహితులు, అతిద్వేషులు, అపవాదకులు, అజితేంద్రియులు, కౄరులు, సజ్జనద్వేషులు .. నై యుందురు."
2 తిమోతి 3:2-5

ఇండియాలో సమాజమందు అవినీతి క్రొత్తేమి కాదు. జయప్రకాశ్ నారాయణ్, సర్వోదయ నాయకుడు, భారత దేశ రాజకీయ రంగమందు అవినీతి, స్వార్థాపేక్షము మామూలే నని తన వ్యాసములో వ్రాసెను. ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ, ఇండియాలో; హిందు, సిక్కు, మహమ్మదీయుల ఆరాధన స్థలములగు దేవాలయములలో, మసీదులలో ఎంతో అవినీతి పెరిగిపోయినదని దానిని తొలగించుట అసంభవమని తెలిపెను. అమెరికా పోలీసు అధికారియగు జే. ఎడ్గర్ హూవర్— "నేడు అమెరికాలో 'భయము' ప్రతివానికి ఏదో విషయము ద్వార కల్గుచున్నదని

ఈ భయము నేరములవలన కల్గుచున్నదని; భయము, దేశమందలి ఆంతరంగిక సమస్యలలో ప్రధానమైనదిగా అయినదని" తెల్పెను.

1972 జూలై లో అమెరికా సుప్రీమ్ కోర్టు మరణ శిక్ష (Death Penalty) తీర్పును రద్దుచేసినది. ఇట్లు చేయుట ద్వార నేరస్థులకు నేరము ద్వార వచ్చెడి శిక్షాభయమును తొలగించినట్లుగా అయ్యెను.

అమెరికా, వాషింగ్టన్ పట్టణములో పదకొండు సం॥లలో 500% నేరములు వృద్ధియై మిక్కిలి క్లిష్ట పరిస్థితి ఏర్పడినది. ఇచ్చట దినమునకు కనీసము 80 దొంగతనములు జరుగును. అమెరికాలో ప్రతి సం॥ 30% నేరములు అధికమగుచున్నట్లు తెలిసినది. ప్రతి 60 సెకనుల కాలములో ఒక నేరము జరుగుచున్నట్లుగా అంచనా వేయబడెను. అమెరికాలోని కొన్ని పట్టణములలో, పట్టణపు ఆదాయములో నుండి, నూటికి ఇరువై పాళ్ళు నేరములను అరికట్టుటకే ఖర్చగును. 1970 లో మానభంగముల (Rape) నేరములు 50% ఎక్కువగా అయినవి.

1969 జూన్‌లో ముగ్గురు అన్నదమ్ములు 14, 13, 12 సం॥ల వయస్సు వారు ఫిలదెల్ఫియా పట్టణపు ప్రాథమిక పాఠశాలలో చేర్చబడిరి. వారు బడినుండి వెడలి వచ్చేవరకు బడిని 95% పాడుచేసి మరి వచ్చిరట.

ప్రపంచ పట్టణములందు, ఆడవారైనను, మగవారైనను, రాత్రి సమయములో ప్రయాణించుటకు నేటి రోజులు క్షేమకరముగా లేవు.

ఇండియా ప్రధాన మంత్రి ఇందిరా గాంధి, "సమాజములో నున్న గొప్ప బీద అనే భేదము నిర్మూలించకున్న, త్వరలో సమాజమందు విప్లవము చెలరేగునని, దానిని ఎదుర్కోటం కష్టమగునని" తెల్పెను.

కలకత్తాలో దౌర్జన్యముల సంఖ్య హెచ్చుగా పెరిగెను. ఇప్పటి క్రొత్త ముఖ్యమంత్రి యగు సిద్ధార్థ శంకర్ రే, "శాంతి భద్రతలను నెలకొల్పుటయే, తమ రాష్ట్రములో ముఖ్య సమస్య అని, దౌర్జన్యముల ద్వార పాడుచేయబడిన కలకత్తాలోని కర్మాగారములు తిరిగి ఉత్పత్తి చేయునట్లుగా చేయుటకు 100 కోట్ల రూపాయల పెట్టుబడి అవసరమని" తెలిపెను.

1972 మే 30 తా॥న అరబ్ గొరిల్లా అనే టెర్రరిస్టు సంస్థకు ఏజంట్లుగా పని చేసిన ముగ్గురు జపాను యువకులు, టెల్ అవివ్ పట్టణపు విమానా

శ్రయములో మర తుపాకులతో 27 గురిని చంపి, 70 మందిని గాయ పర్చిరి. వీరు తమ ఉద్దేశములను నెరవేర్చుటకు విమానములను బల వంతముగా తప్పు త్రోవన పట్టించి, దౌర్జన్యకరమైన చర్యకు పూనుకొనిరి.

1972 ఆగస్టులో ఇద్దరు అరబ్ యువకులు (బ్రిటన్ దేశపు ఇద్దరు అమ్మాయిలతో స్నేహముచేసి 11 దినములు వారిని రాణులను సత్కరించి నట్లుగా సత్కరించి నేర్పుతో, స్నేహ రూపముగా ఇశ్రాయేలు దేశమును దర్శించుటకు తీసికొని వచ్చిరి. తిరుగ ప్రయాణమప్పుడు, వారు ఆ అమ్మాయిలతో "మేము ఇప్పుడు రావల్లపడదు, మీరు తిరిగి రావలెనని" చెప్పి, వారి స్నేహమునకు నిదర్శనముగా రికార్డు ప్లేయర్లను బహు కరించిరి. ఆ రికార్డు ప్లేయర్లలో టైమ్ బాంబులను అమర్చి, ఈ అమ్మాయిలు వెళ్ళే విమానము పైకెగిరిన తర్వాత 30 నిమిషముల పిమ్మట అవి ప్రేలునట్లుగా యుంచిరి. అయితే విమానము 20 నిమిషములు ఆలస్యముగా వచ్చుటచే, అది పది నిమిషములు గాలిలోనికి వెళ్ళేవరకు బాంబులు ప్రేలెను. విమానము కొద్ది ఎత్తులోనికి పోగా ప్రేలుడు అగుటచే, నిప్పంటుకొని రోమ్ పట్టణమునకు సురక్షితముగా చేరుకొనగలిగెను. ఒకవేళ విమానము ఆలస్యముగా రాకున్న, ఎత్తైన స్థల ములో అది ప్రయాణించుచు ప్రేలుడుద్వార పూర్తిగా ధ్వంసమయ్యేడిది.

1972లో ఒలింపిక్ ఆటల సందర్భముగా 8 మంది అరబ్ టెర్రరిస్టులు జర్మనీలో, మ్యూనిచ్ పట్టణమందు ఆటలకొరకు ఆయా దేశముల ఆట గాండ్రు చేరిన స్థలమునకు వెళ్ళి, నిరాయుధులగు పదకొండు ఇశ్రాయేలు ఆటగాండ్రను తుపాకులతో చంపిరి. ఈ వార్త ప్రపంచమంతటను భీతి, ఆశ్చర్యమును పొందునట్లుగా చేసెను. ఆటలవలన, సంతోషము చెందవలసియున్న స్థలమందు దౌర్జన్యముద్వార విచారమునకు హేతువ య్యెను. ప్రతి రాజ్యము అరబ్ టెర్రరిస్టుల చర్య పశుతుల్యమైనదని తీవ్రముగా ఖండించెను. నేడు ప్రపంచమందు దౌర్జన్యములద్వార, తాము కోరినది సాధించుటకు మనుష్యులు ప్రయత్నించుచున్నారు.

మ్యూనిచ్ నందు ఇశ్రాయేలు ఆటగాండ్రను అరబ్ టెర్రరిస్టులు చంపిన పిమ్మట, ఇశ్రాయేలు దేశము, సిరియా, లెబనన్ దేశముల మీదికి తన

సైన్యమును పంపి మరియు విమాన దాడులను జరిపి ప్రతీకారము తీర్చు కొనెను. ఈ మూడు రోజులలో జరిగిన యుద్ధమందు ఇశ్రాయేలు 60 మంది అరబ్ కమాండోలను చంపి, దాదాపు 200 మంది నగర వాసులను గాయపర్చి, 300 కు మించిన ఇండ్లను ధ్వంసము చేసెను. ఈ విధముగా ఈ సంఘటన ప్రపంచమందు భీతికొల్పు విషయముగా మారెను.

అరబ్బులు ప్రపంచమంతట నున్న ఇశ్రాయేలు రాయబారులకు, ప్రభుత్వ అధికారులకు, వ్యాపారస్థులకు బాంబు ఉత్తరములను (Letter Bombs) పోస్టు ద్వార పంపి దౌర్జన్యాత్మకమైన చర్యలకు పూనుకొనిరి. అయితే ఈ ఉత్తరములు చాలావరకు ఎలాటి నష్టము కల్గక పూర్వమే వీనిని కనుగొనిరి. కాని లండన్ నగరమందు ఒక ఇశ్రాయేలు రాయబారి, తనకు హాలండు నుండి పంపబడిన ఉత్తరమును తెలియక విప్పుటచే, ప్రేలుడు సంభవించి మరణించెను.

ఒక మాసము తర్వాత ఇదేరీతిగా అరబ్బు సంస్థలు, కర్మాగారములు విధ్వంసక చర్యలు జరిపెడి బాంబు ఉత్తరముల ద్వారా గొప్ప నష్టమును పొందెను. అల్జీరియానందు పాలస్తీన లిబరేషన్ ఆర్గనైజేషన్ యొక్క కార్యదర్శి ఈలాటి బాంబు ఉత్తరము ద్వారా గాయపర్చబడెను. ఈలాగే ట్రిపోలినందున్న ఈ సంస్థకు చెందిన అధికారి, ఉత్తరమును తెర చుటచే ప్రేలుడు సంభవించి గ్రుడ్డివాడయ్యెను.

1972 సెప్టంబర్ లో ఐక్యరాజ్య సమితినందు, భీతికొల్పెడి పై సంఘ టనలు ప్రధాన సమస్యగా ఎంచబడి, చర్చకు తేబడెను. ఐక్యరాజ్య సమితి సెక్రెటరీ జనరల్ వాల్డ్‌హైమ్ భీతిగొల్పెడి దౌర్జన్యాత్మకమైన చర్య లకు స్వస్తి చెప్పవలెనని, అమాయక ప్రాణులకు నష్టము కల్గించ రాదని తీర్మానము చేసెను.

మధ్యాసియా అలజడులకు, కలహములకు కేంద్రమైనదని చెప్పుటకు ఈ మధ్య జరిగిన మరికొన్ని సంఘటనలు క్రింద వివరించబడినవి.

1973 ఫిబ్రవరిలో ఇశ్రాయేలు దేశము అరబ్బు (లిబ్యా) దేశమునకు చెందిన ప్రయాణికులను చేరవేసెడి విమానమును సినాయి ప్రాంతమందు కూల్చివేయగా, దానిలోనున్న 105 గురు ప్రయాణికులు మరణించిరి. మార్చి నెలలో లిబ్యాకు చెందిన విమానములు, అమెరికా దేశపు నిరాయుధ మిలటరీ విమానముపై మధ్యధరాసముద్రముపై దాడి జరిపెను.

1973 మార్చి నెలలో "బ్లాక్ సెప్టంబర్" అనే పేరున పిలువబడే అరబ్బు గొరిల్లాలు ఖార్టూమ్‌లోని సౌదీ అరేబియన్ రాయబార కార్యాలయముపై దాడి జరిపి వివిధ దేశముల రాయబారులను, ప్రభుత్వాధికారులను చెరపట్టిరి. చివరకు వీరిలో ముగ్గురిని చంపిరి. వారిలో ఇద్దరు అమెరికా మరియు ఒకరు బెల్జియం దేశమునకు చెందినవారు.

ఏప్రెల్ మాసములో అరబ్బులు, సైప్రస్ లోని ఇశ్రాయేలు రాయబార కార్యాలయమును ధ్వంసముచేసి, ఇశ్రాయేలు జెట్ విమానమును తప్పుత్రోవన (Sky jack) నడుప ప్రయత్నించిరి. దీనికి ప్రతీకారముగా ఇశ్రాయేలు తమ కమాండోలను లెబనన్ మీదికి పంపి ముగ్గురు అరబ్బు గొరిల్లా నాయకులను చంపెను . ఈ విధముగా దౌర్జన్యాత్మకమైన చర్యలు తరుగక పెరుగుచునే యుండును. వీనికి అంతములేదు.

# దుర్నీతి

> నోవహు దినములలో జరిగినట్లు (అపవిత్ర కార్యములు) మనుష్య కుమారుని (యేసు క్రీస్తు) దినములలోను జరుగును. లూకా 17:26.
> పౌలు–"ఎలాగనగా మనుష్యులు... అపవిత్రులు... అజితేంద్రియులు... నైయుందురు." 2 తిమోతి 3:2-4.

ఆస్ట్రేలియా గవర్నర్ జనరల్, సర్ పాల్ హాస్‌లక్ సిడ్నీ పట్టణమందు, "నవయుగమందు పెరుగుచున్న కర్మాగారములు, వాహకముల వలన, వచ్చెడి పొగ మొ॥ వానిద్వార గాలి, నీరు కలుషితము చేయబడి, మను

ష్యుని ఆరోగ్యమునకు దెబ్బ తగులుననెడి భయము కలదు. కాని దీని కన్న దుర్నీతి ద్వార మన సమాజమునకు ఇంకా గొప్ప నష్టము కల్గునని. నీతిదాయకమైన సమాజమును నెలకొల్పకున్న, మనుష్యుల నైతిక స్థితి దెబ్బతినునని," తెల్పెను. నోవహు దినములలో దుర్నీతికరమైన కామసంబంధమగు నేరములను మనము చూడవచ్చును—"నరులు భూమి మీద విస్తరింప నారంభించిన తరువాత కుమార్తెలు వారికి పుట్టినపుడు దేవుని కుమారులు నరుల కుమార్తెలు చక్కనివారని చూచి వారందరిలో తమకు మనస్సు వచ్చిన స్త్రీలను వివాహము చేసికొనిరి." ఆది కాండము 6:1-2.

ఇచ్చట, దేవుని నిబంధనను మీరి, దేవుని బిడ్డలు, అన్యులతో వివాహ సంబంధములు చేసికొని, కామతప్తులై, నీతిని తప్పి ఆత్మీయముగా పడిపోయిరి.

దేవుడు స్త్రీ పురుషులకు సంబంధించిన కలయిక (Sex) ను, వివాహము ద్వార పరిశుద్ధపరచి, జత చేసెను. అయితే వివాహము కూడ ఆదినుండి దేవునితో సహవాసముగల దేవుని బిడ్డల మధ్యనే జరుగునట్లుగా ఏర్పాటు చేసెను. కాని మనుష్యులు దైవనిర్ణయమును ఉల్లంఘించి తమ ఇష్ట ప్రకారము ప్రవర్తింపజొచ్చిరి.

"నరుల చెడుతనము భూమిమీద గొప్పదనియు, వారి హృదయము యొక్క తలంపులలోని ఊహ అంతయు ఎల్లప్పుడు కేవలము చెడ్డదనియు యెహోవా చూచి, తాను భూమిమీద నరులను చేసినందుకు యెహోవా (దేవుడు) సంతాపమునొంది తన హృదయములో నొచ్చుకొనెను." ఆదికాండము 6:5-6

"దేవుడు భూలోకమును చూచినప్పుడు అది చెడిపోయియుండెను. భూలోకము బలాత్కారముతో నిండియుండెను. భూమి మీద సమస్త శరీరులు తమ మార్గమును చెరిపివేసికొని యుండిరి." ఆదికాండము 6:12.

అప్పుడు యెహోవా (దేవుడు) — "నా ఆత్మ నరులతో ఎల్లప్పుడు వాదించదు, నేను సృజించిన నరులను, నరులతో కూడ జంతువులను పురుగులను, ఆకాశ పక్ష్యాదులను భూమిమీద నుండకుండ తుడిచి వేయుదును. ఎందుకనగా నేను వారిని సృజించినందుకు సంతాపము నొంది యున్నా" ననెను ఆదికాండము 6:3,7.

## నేడును లోకము నోవహు దినముల మాదిరిగా యున్నది!

1972, మార్చి 20 తా॥ టైమ్ పత్రిక, "ఈ యుగపు యౌవ్వనులు, తమ తల్లిదండ్రులవలె కాక లైంగిక అనుభవమును (Premarital sex) పొందుటయందు ఇష్టము చూపుచు, ఇది చెడుగా భావించుటలేదని" తెల్పినది. 1970 లో ఈ విషయముపై యువతరమువారి మధ్య ఎన్నికలు జరుపగా, నలుగురిలో ప్రతి ముగ్గురు విద్యార్థులు వివాహమునకు ముందే లైంగికానుభవములు కలిగియున్నట్లుగా తెల్పికొనబడెను. పడమర దేశపు సముద్ర తీరములయందు, నగ్నముగా తిరుగుట పెరిగిపోయినదని, టైమ్ పత్రిక తెల్పినది. పశ్చిమ దేశములందు నూటికి నలువదిమంది పెండ్లికాకముందే కన్యత్వము (Virginity) కోల్పోయినవారని, నూటికి డెబ్బై మంది పెండ్లికి ముందే, లైంగికానుభవములు (Sexual intercourse) పొందినవారుగా యున్నారని తెలిసినది.

ఒక బ్రిటీషు గైనెకోలాజిస్టు, 1940, 1950 లో ముద్దు కొరకున్న ఉరవడి, 1960, 70 ల లో లైంగికానుభవముల కొరకు దారి తీసినదని వివరించెను.

జాన్ ట్రెవెల్యన్ అనే, బ్రిటీషు చలనచిత్ర సెన్సారు, "చలన చిత్రము లందు కామ సంబంధమైన విషయములను చూపుట ఎక్కువ అయినదని, ఇదే రాబోవు రోజులలో మరి హెచ్చగునని, మనుష్యులు సెక్సు విషయములలో పిచ్చివారు (Sex-mad) గా యున్నారని, చెప్పెను.

అమెరికాలో విడాకుల సమస్య ఎంతగా పెరిగినదంటే, పెండ్లి 3 సం॥ల కొరకే చేసికొని, తిరిగి ఇష్టమున్న క్రొత్తగా వివాహ సంబంధమును

కొనసాగించుటకు (Renew) అవకాశము యుండవలెనని కోరుచున్నారు. ఈ రోజులలో సమాజపు నైతిక స్థితి ఎంత దిగజారినదంటె, సెక్సు విషయమందు విచ్చలవిడిగా యుండుటకు కోరుచు, స్త్రీ పురుషులు కామ తప్తులై యున్నారు.

ముందు అమెరికాలో, 25 సం॥ల లోపువారు వ్యభిచార వృత్తి యందు జీవించుటకు మొదలిడెడివారు. అలాంటిది, ఇప్పుడు ఇదే వృత్తిని 18 సం॥ వారుకూడ స్వీకరించుచు, 200% ఈ వృత్తిని పెరుగునట్లుగా చేసియున్నారని అంతర్జాతీయ సుఖవ్యాధుల (Venereal diseases) సభ యందు తెల్పకొనబడినది.

వ్యభిచారము ఎక్కువగా అగుటవలన సుఖవ్యాధులు, ప్రపంచమందు బాగుచేయుటకు వీలులేనంతగా పెరిగినవి.

పరిపంచమందు స్వీడన్ దేశములో సెక్సు విషయములో సర్వ స్వతంత్ర ములు కలవు. పాఠశాలలలో విద్యార్థులకు సెక్సు పాఠములు నేర్పుట ద్వారా, ఆత్మహత్యలు 35%,మానభంగములు (Rape) 50% జరుగు చున్నట్లు; మరియు ప్రతి పదిమందిలో ఒకడు పెండ్లికానివారికే జన్మించి నట్లుగా, సుఖవ్యాధుల సంఖ్య అధికమైనట్లుగా, తెలిసినది.

సీనాయి పర్వతమందు దేవుడు వ్యభిచరించకూడదనెడి ఆజ్ఞను ఖండిత ముగా ఇచ్చెను. ఆలాగే యేసు ప్రభువు, హృదయములో స్త్రీని మోహపు చూపుతో చూచే ప్రతివాడు, ఆమెతో అప్పుడే వ్యభిచరించి యున్నాడని తెల్పెను (మత్తయి 5:28). అయితే ఈ రోజులలో కొందరు, క్రైస్తవ నాయకులు సహితము సెక్సుకు సంబంధమైన విషయములలో స్వతం త్రము యుండవలెనని వాదించుచున్నారు.

1971 నవంబర్‌లో యునైటెడ్ మెథడిస్టు చర్చ్‌వారు దుర్నీతి సంబంధ మైన పురుషగాముల (Homosexual) చర్యలను, క్షమించవలెననెడి తీర్మానము చేసిరి.

యునైటెడ్ చర్చి ఆఫ్ క్రైస్తువారు, పెండ్లి చేసికొనే వారిరువురు పెండ్లికి ముందుగానే లైంగిక సంబంధము కల్గియున్న నేరము కాదని బోధించుటకు మొదలిడిరి.

1969 లో డెన్మార్కులో అసభ్యకరమైన (బూతు) చిత్రముల ప్రదర్శనము ఏర్పాటు చెయ్యగా వందలకొలది ప్రజలు చూచుటకై రాగా, అలజడి కల్గుటవలన టికట్లు అమ్ముట అపుచేసిరి. చివరకు సెక్సు-69 ప్రదర్శనమును, ఒక లక్ష మంది తిలకించిరి.

ఇండియా, అమెరికా, బ్రిటన్, ఆస్ట్రేలియా ఇంకా మరే దేశమందైనను, పుస్తకములలో, సెక్సుకు సంబంధించిన పుస్తకములే ఎక్కువగా అమ్మబడుచున్నట్లుగా తెలిసినది. దీనివలన, ఈ విషయములో మనుష్యులు ఎంత ఆసక్తి కల్గియున్నారో తెలియుచున్నది.

# గర్భస్రావము

> పౌలు—"ఎలాగనగా మనుష్యులు...అనురాగ రహితులు (Without natural affection) నై యుందురు." 2 తిమోతి 3:2-5.

1968 లో బ్రిటన్ పార్లమెంటువారు, రిజిష్టరు చేసికొన్న ఏ వైద్యుని ద్వార నైనను, కొన్ని పరిస్థితులలో, గర్భస్రావము చేయించుకొనవచ్చునని బిల్లును ప్రవేశపెట్టిరి. ఈలాంటి చట్టము ద్వార వచ్చిన స్వతంత్రమువలన లండన్ పట్టణము గర్భస్రావము చేయుటకు ముఖ్య పట్టణముగా, పశ్చిమ యూరపు ఖండమందు పరిగణించబడెను. జపాను దేశమందు, గర్భస్రావము చేయించుకొనుట తేలికైన విషయముగా, మామూలై (common) పోయినది.

అమెరికాలో గర్భస్రావము, చట్ట సమ్మతముగా చేయబడిన ఆరు నెలలలో, ప్రైవేటు డాక్టర్ల ద్వార చేయబడినవి కాక, 60,000 గర్భ

స్రావములు న్యూయార్క్ పట్టణమందు చేయబడినట్లుగా 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక తెల్పెను.

న్యూయార్క్ పట్టణమునకు హెచ్చుగా, ఇతర ప్రదేశముల నుండి గర్భస్రావము చేయించుకొనే వారు వచ్చెదరని, వీరు తమకు పుట్టబోయే బిడ్డ మరణమును కోరుచు, ఆరు నెలల గర్భమును సహితము తీయించుటకు ఇష్టము చూపుచున్నారు. ఎందరో, గర్భస్రావము ద్వార తమ బిడ్డలను చంపుటకు ప్రయత్నించగా, ఈ ప్రయత్నము నుండి కాపాడబడిన బిడ్డలు ఎందరో బ్రతికిరి.

న్యూయార్క్‌లో 1970 సం॥కు ముందు గర్భస్రావము చట్ట సమ్మతిగా చేయబడక పూర్వము ప్రతి ఏట 1,000,000 వరకు గర్భస్రావములు డాక్టర్ల ద్వార జరిపింపబడినట్లుగా తెలిసినది. "గర్భస్రావము, గర్భిణీగా యున్న స్త్రీకి, ఆమె డాక్టరుకు సంబంధించిన అంతరంగిక సమస్య కావున దీనిని చట్టసమ్మతిగా చేయవలెనని" అమెరికా ప్రసిడెంటు పదవికి పోటీ చేసిన జార్జి మాక్ గవర్న తన అభిప్రాయమును తెల్పెను. 1972 ఏప్రెల్ లో ఇండియా దేశము కూడ గర్భస్రావమును చేయించుకొనునట్లుగా చట్టమును ప్రవేశపెట్టెను. ఈ రీతిగా దేశములు గర్భస్రావమును చట్టసమ్మతముగా చేయుటవలన, తమ తల్లులద్వారనే బిడలకు మరణము చేకూరునట్లుగా అయ్యెను.

ఈ విధముగానే మరి కొంతకాలములో, ముసలివారు, పనికిరాని వారు చంపబడునట్లు చట్టములు రావచ్చునేమో ?

అయితే 'నరహత్య చేయకూడదు' అని దేవుడు ఆజ్ఞ ఇచ్చెను. నిర్గమకాండము 20:13.

—— : ★ :——

# మత్తుమందు మరియు మాంత్రిక విద్య



"మరియు తాము చేయు ... మాయా మంత్రములను ... చేయకుండునట్లు వారు మారుమనస్సు పొందినవారు కారు." ప్రకటన 9:21.

మత్తుమందులకు మాంత్రిక విద్యయగు దయ్యముల సహవాసమునకు సమీప బాంధవ్యము కలదని చెప్పవచ్చును.

మత్తుమందులగు మారివాన (Marijuana), L. S. D. హేర్-ఒ-ఇన్ (Heroin)వలన అమెరికా, మరికొన్ని దేశములు, వీని అలవాటుకు బానిసలైన యౌవనుల ద్వార గొప్ప సమస్యను ఎదుర్కొంటున్నవి. యౌవ్వనులు వీని అలవాటువలన గాలమును మ్రింగిన చేపరీతిగా, వీని శక్తినుండి తప్పించుకోలేకుండ పట్టబడియున్నారు.

ఒక యౌవనురాలు, తాను మత్తుపదార్థముల అలవాటులోపడి, దీనినుండి తప్పించుకొనుటకై డాక్టర్లను సంప్రదించినను కారాగారములలో, హాస్పిటలులలోయున్నను దీని బారినుండి తప్పించుకొనలేక యుండెను. చివరకు ఒక డాక్టరు ఈమె పడెడి బాధనుచూచి, ఈ అలవాటు చేసినవానినే, తన హస్తముతో తుపాకితో తల పగులునట్లు కాల్చి చంపిన పుణ్యముచేసిన వాడగునని తెల్పెనట.

అమెరికాలో దాదాపు 5,60,000 మంది హేర్-ఒ-ఇన్ (Heroin) మత్తు మందుకు బానిసలైనవారు యున్నారని, వీని ప్రభావము ద్వార త్వరగా

లేక క్రమేణ చెడు పరిణామములు తప్పక కల్గునని తెలిసికొనిరి. లాస్ ఏంజల్స్ జనరల్ హాస్పటల్ లో 66% రోగులు L. S. D. ద్వార అస్వస్థులై బాగు చేయబడుటకై తేబడిరి. వీరిలో చాలామంది తీవ్ర రోగులుగా యుండి, మతి చలించుటద్వార పిచ్చాసుపత్రులకు బాగు చేయుటకై పంపబడిరి.

"హెర్-ఒ-ఇన్ (Heroin) ద్వార నేడు జరుగుచున్న విపరీత పరిస్థితి నేనెన్నడును ఊహించనిదని, హెర్-ఒ-ఇన్ సాన్‌ఫ్రాన్సిస్కోలో ఎచ్చట నైనను సులభముగా దొరుకుచున్నదని" క్రొత్త సమస్యలు పరిష్కరించుటకు ఏర్పాటైన డైరెక్టర్ డాక్టర్ బేకీ రేమర్ తెల్పెను.

1972 లో మాక్ గవర్న్ యొక్క అనుచరులు మారివానాను చట్టసమ్మతి చెయ్యవలెనని చెప్పిరి.

స్వీడన్ దేశములో 16 సం॥ లోపు బడి పిల్లలందరును మత్తు పదార్థముల అనుభవము కల్గియున్నారని తెలిసికొనబడెను.

నేరస్థులుగా యున్నవారిలో 55% మొగవారు 87% ఆడవారు మత్తు పదార్థములను సేవించువారిగా నున్నట్లు కనుగొనబడెను— వీరు 25-27 సం॥ వయస్సు గలవారు. హాంకాంగ్ నందు నల్లమందు వాడకము నుండి హెర్-ఒ-ఇన్ వాడకమునకు మార్పు చేయుటవలన ప్రజలు మానసికముగా, శారీరకముగా అస్వస్థులైరి. కెనడాలో ఈలాగుననే మత్తు పదార్థములకు బానిసలైనవారు 14,000 మంది, పశ్చిమ యూరపులో 1,00,000 మంది కలరు. యూరపు దేశముల నాయకులు 1970 సంవత్సరము తర్వాత వేరే ఏ క్రొత్త పరిణామములు వచ్చునో అని భయపడుచున్నారు. హెర్-ఒ-ఇన్ ప్రభావము దక్షిణ వియత్నామ్ నందును పని చేయుచున్నది. దీని అలవాటు టర్కీనందు కూడ కలదు. ఇరాక్‌లో 40,000 మంది నల్లమందును సేవించేవారును, ఢిల్లీలో ఈలాంటివారే 30,000 మంది కలరు. ప్యూన్ (Peon) పని చేసేవాడు, సిమ్లాలో నల్లమందును మత్తు పదార్థములను దొంగతనముగా వ్యాపారము చేయుటద్వారా నెలకు 2000 రూపాయలు సంపాదించుచున్నట్లు తెలిపెను.

కాలిఫోర్నియాలో ఒక స్త్రీ తాను L.S.D. ని ఎట్టి విపరీత పరిణామములు జరుగకుండ సేవించుచున్నానని గప్పాలుకొట్టి, చివరకు దాని ప్రభావము వలన తన స్వంతబిడ్డ కన్నులను కత్తితో పెరికివేసెను.

చైనా దేశము లక్షలకొలది ఎకరములందు నల్లమందు చెట్లను (Poppies) విరివిగా పెంచుచున్నది వీనిని వియత్నాములో నున్న అమెరికా సైనికులకు పంపి, వారిని చైనా దేశము దీనికి బానిసలనుగా చేసినది. దీని ద్వార వియత్నాములో దుర్నీతి పెరుగుటయే కాక 60,000 మంది అమెరికా దేశ సైనికులు నల్లమందు అలవాటుకు బానిసలై తమ దేశమునకు తిరిగివచ్చిరి. అమెరికా మిలిటరీ సర్వీసువారు, L. S. D. ప్రభావము చాలా తీవ్రమైనదని, దీనిని వాడేవారు మతి తప్పే ప్రమాదము కలదని, లక్షల మంది నాశనము కాగలరని తెలిపిరి.

మత్తు మందులను, దొంగతనముగా దిగుమతిచేయుట చాలా అపాయకరమైన సంగతి, కావున ఇవి దొరుకుట చాలా కష్టము. అందుకే వీని ధర ఒక్కసారి తీసికొనె మోతాదు (Dose) కు రు. 35/–ల ధర కలదు. అమెరికాలో నల్లమందు మొ॥ వాటిని వాడేవారు ఒక్కొక్కరు దాదాపు రు. 60,000 దీనికొరకు ఖర్చు చేయుదురు. యువతరమువారియందే ఈ అలవాటు హెచ్చుగా కలదు. దీని ప్రభావము ద్వార యౌవనులు చపలచిత్తులై ఒక చోట స్థిరముగా పనిచేయకుండ యున్నారు. ఈ అలవాటును పోషించుటకు కావలసిన డబ్బు సంపాదించుటకు దీనికి బానిసలైనవారు, దొంగతనములు, నేరములు, హత్యలు మొ॥ చేయుచున్నారు. కాలిఫోర్నియాలో 3,00,000 రూపాయల విలువగల మత్తు పదార్థములు ఖర్చగును. ఈ విధముగా మత్తుమందు సేవించుటవలన ప్రపంచము అలజడులకు దారి తీయుచున్నది. ఇదికూడ లోకాంతమును సూచించుచున్నది.

---

# పురుషగాములచర్య-సొదొమ పాపము

## (Homosexuality—The Sin of Sodom)

"లోతు దినములలో జరిగినట్లును జరుగును. ఆ ప్రకారమే మనుష్య కుమారుడు (యేసు క్రీస్తు) ప్రత్యక్షమగు దినములో జరుగును." లూకా 17:28-30.

పురుషగాములు లేక హోమో సెక్సియల్స్ అనగా—పురుషులు పురుషులతో వాంఛను తీర్చుకొనుచు, కామతప్తులగువారు.

దేవుడు లోతు నివసించిన సొదొమ విషయమై చెప్పుచు"....సొదొమ చేసిన దోషమేదనగా, దానికిని దాని కుమార్తెలకును కలిగిన గర్వమును ఆహార సమృద్ధియు నిర్విచారమైన సుఖస్థితియు ననునదియే. అది దీను లకు దరిద్రులకును సహాయము చేయకుండెను. వారు అహంకరించి నా దృష్టికి హేయక్రియలు చేసిరి. గనుక నేను దానిచూచి వారిని వెళ్ళగొట్టి తిని." యెహెజ్కేలు 16:49-50.

"ఆసా తన పితరుడైన దావీదువలె యెహోవా దృష్టికి యదార్థముగా నడుచుకొని పురుష గాములను (ఇంగ్లీషు బైబిలు వీరిని Sodomites (సొదొమవారు) అని వివరించెను). దేశములనుండి వెళ్ళగొట్టి తన పితరులు చేయించిన విగ్రహముల నన్నిటిని పడగొట్టెను" 1 రాజులు 15:11-12.

"వారు పండుకొనక ముందు ఆ పట్టణస్థులు, అనగా సొదొమ మనుష్యులు బాలురును వృద్ధులును ప్రజలందరును నలుదిక్కుల నుండి కూడివచ్చి ఆ యిల్లు చుట్టివేసి లోతును పిలిచి—ఈ రాత్రి నీ యొద్దకు వచ్చిన మను ష్యులు ఎక్కడ? మేము వారిని కూడునట్లు మా యొద్దకు వారిని వెలుప లికి తీసికొని రమ్మని అతనితో చెప్పగా...." ఆదికాండము 19:4-5.

పురుషగాముల పాపమే సొదొమ నాశనమునకు దారి తీసినది. "మరియు వారు దేవుని నెరిగియు ఆయనను దేవునిగా మహిమ పరచలేదు, కృతజ్ఞతా స్తుతులు చెల్లింపను లేదు గాని తమ వాదములయందు వ్యర్థులైరి.... ఈ హేతువు చేత వారు తమ హృదయముల దురాశలను అనుసరించి, తమ శరీరములను పరస్పరము అవమానపరచుకొనునట్లు దేవుడు వారిని అపవిత్రతకు అప్పగించెను. అట్టివారు దేవుని సత్యమును అసత్యమునకు మార్చి, సృష్టికర్తను ప్రతిగా సృష్టమును పూజించి సేవించిరి..........వారి స్త్రీలు సయితము స్వాభావికమైన ధర్మమును విడిచి స్వాభావిక విరుద్ధమైన ధర్మమును అనుసరించిరి. అటువలె పురుషులు కూడ స్త్రీ యొక్క స్వాభావికమైన ధర్మమును విడచి, పురుషులతో పురుషులు అవాచ్యమైనది చేయుచు, తమ తప్పిదమునకు తగిన ప్రతి ఫలమును పొందుచు ఒకరి యెడల ఒకరు కామతప్తులైరి." రోమా 1:21-32.

పై విషయము సొదొమ కార్యమును గూర్చి వివరింపబడినది. ఈ రోజులలో కూడ హోమోసెక్సియాలిటీ ఎక్కువగా యున్నది. ఇంతకుముందు ఈ కార్యములు చాటుగా జరిగెడివి. అయితే నేడు ఈ కార్యములు చేయువారు బాహాటముగా చెప్పి చేయుటకును వెనుకాడుటలేదు. దీనిని పాపముగా లేక నేరముగా పరిగణించక ఉల్లాసముతో చేయుచున్నారు.

కొన్ని సం॥ క్రితము బ్రిటన్, కెనడా దేశములు హోమోసెక్సియాలిటిని చట్టబద్ధమైన కార్యముగా చేసినవి. అయితే కొన్ని దేశములు హోమోసెక్సియాలిటిని నేరముగానే పరిగణించుచున్నవి.

కొన్ని తరముల క్రితము పురుషగాముల చర్య పరమ రహస్య కార్యముగ నెంచబడి, చర్చించుటకే సిగ్గుకరముగా యుండెడిది. అయితే నేడు, దీని ప్రచారమునకు కొన్ని పత్రికలు, నాటకములు, చలనచిత్రములు మొ॥ దోహదములు చేస్తు, దీనిని అమెరికాలో పెంపొందించుటకుగాను హోమోసెక్సియల్ సొసైటీని నిర్మించిరి.

అమెరికాలో 50 కన్న ఎక్కువ హోమోసెక్సియల్ సంస్థలు కలవు.

హోమోసెక్సియల్ ప్రయాణికుల సౌకర్యార్థమై కొన్ని దేశములలో గే (gay) సాలూనులను ఏర్పర్చిరి. వాటిని కనుగొనుటకు ఒక డైరెక్టరిని కూడ ఏర్పర్చిరి

"ఒకడు స్త్రీతో శయనించినట్లు పురుషునితో శయనించినయెడల వారిద్దరు హేయ క్రియలను చేసిరి గనుక మరణ శిక్ష విధింపవలెను; తమ శిక్షకు తామే కారకులు." లేవీయకాండము 30:13.

సాన్ ఫ్రాన్సిస్కో 'గే' ముఖ్యపట్టణముగా పరిగణింప బడుచున్నది. ఇచ్చట 'గే' బార్‌లును గలవు చికాగో పట్టణమందు రూ. 750/- చెల్లించుట ద్వార పురుషగాముల క్లబ్‌లో సభ్యత్వము పొందవచ్చును. కిన్సీ (Kinsey) రిపోర్టు ద్వార అమెరికాలో 40% పురుషులు, 13% స్త్రీలు హోమోసెక్సియల్‌లుగా కలరని తెలిపెను.

ఒక సర్వే లెక్క ప్రకారము 10-17% జనాభా హోమోసెక్సియల్‌లుగా యున్నట్లు కనుగొనిరి. అమెరికాలో 40 లక్షలు, బ్రిటన్‌లో 10 లక్షల కన్నా ఎక్కువ మంది హోమోసెక్సియల్‌లుగా యున్నట్లు అంచనా వేయబడినది.

ఆసియా ఖండమందు, ఇండియాలో వీని విషయమై వివరముగా తెలియదు, కాని ప్రపంచమంతట హోమోసెక్సియల్‌ల సంఖ్య అధికముగానే యున్నట్లు భావించబడుచున్నది.

1972 సెప్టెంబర్ 3 న ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ, ఈ విషయము తెల్పెను. ఆ వ్యాసము ద్వార ఇండియాలోను, పురుషగాముల సంఖ్య వేరే దేశములతో సరితూగుచున్నట్లుగా కనగొనబడినది. ఈ వ్యాసము — "ఇండియాలో హోమోసెక్సియల్‌ల సంఖ్య ప్రతి సం॥ అధికమగుచున్నదని; బొంబాయి పట్టణమందు మెరీన్ డ్రైవ్‌లో హోమోసెక్సియల్ క్లబ్బులు కలవని, అరబ్ దేశములో పురుష వేశ్యా (Male Prostitute Houses) గృహములను నడిపెడివాడు కొన్ని రోజులలో ఓడ తీర ప్రదేశములందు రూ 2,500/- వరకు సంపాదించుచున్నాడని, కొలబా ప్రదేశమందు స్త్రీ

వేశ్యలకన్న పురుషులు వేశ్యత్వమందు ఎక్కువగా డబ్బు సంపాదించు చున్నారని" తెల్పెను.

1972 జూన్‌లో అమెరికా ప్రసిడెంటు పదవికి పోటీచేసిన మాక్ గవర్న్ అనుచరులు హోమోసెక్స్‌యల్‌ల వివాహములను చట్టసమ్మతిగా చేయవలెనని మిన్నెసోటా పట్టణములో సూచించిరి.

కొన్ని సం॥ క్రితము ఇద్దరు పురుషగాములు నెథర్‌లాండులో రోమన్ కాథలిక్ ప్రీస్టు ద్వార వివాహము జరిపించుకొన్నట్లుగా "న్యూస్ వీక్" పత్రిక ప్రకటించినది. ఈ వివాహమునకు ఇరువురి తల్లులు హాజరవ్వగా ఇది ఒక బడి ఆరాధన స్థలములో జరిగెను.

అమెరికాలో ఇద్దరు పురుషగాములు 15 సం॥ వివాహ సంబంధమందు యుండగా, ఒక ఎపిస్కోపల్ ప్రీస్టును వారు తమ్ము ను ఆశీర్వదించమని మనవి చేయగా, ప్రీస్టు—వారిద్దరును సంతోషముతో, ఒకరినొకరు ప్రేమించుకొనుచుండు లాగున ఆశీర్వదించెను.

ఎపిస్కోపల్ మినిస్టర్, కానన్ రాబర్ట్ W. క్రోమె, హోమోసెక్స్‌యాలిటి విషయమై చెప్పుచు, 21 సం॥ వయస్సు వచ్చినవారు తమ ఇష్టము వచ్చినట్లు, అవసరమైన టీపముతో నైన కామ క్రియ జరుపుకోవచ్చునని, తెల్పెను.

రెవ. ట్రాయ్ పెర్రీ అనే కాలిఫోర్నియా గాడ్ ఆప్ ప్రాఫసీ (పెంతుకోస్తు) సంఘ పాస్టరు, భార్య పిల్లలను వదిలి, హోమోసెక్స్‌యల్‌ల కొరకు ఒక సంఘము (Church) ను హాలీవుడ్‌లో స్థాపించి, ప్రకటన చెయ్యగా, వెనువెంటనే 400 మంది ఈ చర్చిలోనికి సభ్యులుగా చేరిరి. తన మొదటి కార్యమునకే విజయము కల్గుట చూచి పెర్రి స్త్రీ పురుషుల కొరకు వేరు వేరుగా దేశమంతట ఈలాంటి సంఘము (Church) లను స్థాపించుటకు పూనుకొనెను. ఈ లాంటి సంఘములన్నింటికి, యూనివర్సల్ ఫెలోషిప్ ఆప్ మెట్రోపోలిటన్ కమ్యూనిటి చర్చ్‌స్ (Universal fellowship of Metropolitan Community Churches)

అనెడు నామధేయము నుడివెను. ఇచ్చట సభ్యుల తర్ఫీతు కొరకు సెమినెరి, మిషనెరి శాఖలు కూడ ప్రవేశపెట్టెను. సాన్‌ఫ్రాన్సిస్కో, సాన్‌డియాగో, లాస్ ఎంజల్స్ మొ॥ పట్టణములలో 1000 మంది కన్న ఎక్కువ సభ్యులు చేరిరి. వీరి సంఖ్య క్రమేణ పెరుగుచు హోమోసెక్సి యల్‌లకు ఈ సంఘములు (Churches) ప్రేమవిహారమునకు(Dating) కేంద్రములుగా ఉపయోగింపబడుచున్నవి.

మాజీ బాప్టిస్టు బోధకుడగు బిల్లీ హడ్‌సన్ అనేవాడు రెవరెండు అని పిలువబడుచు, తాను హోమోసెక్సియల్‌గా జీవించుచు, ఈ కార్యము చేయుటకు గర్వించుచున్నానని గొప్పతనముతో తెల్పెను. ఇతని ఆధ్వర్యములో 'గే' క్రూసేడ్ అనబడెడి హోమోసెక్సియల్‌లకు సంబంధించిన మాస పత్రిక కూడ నడుపబడుచున్నది.

# జీవ వినాశక ఆయుధములు
# ( Biological Weapons )

పౌలు—"ఎలాగనగా మనుష్యులు ...

అనురాగ రహితులు, అతి ద్వేషులు

అపవాదకులు......క్రూరులు...నై

యుందురు"

2 తిమోతి 3:2-6.



దాదాపు 16 దేశములు నేడు మారణ రసాయనిక ఆయుధములను తయారు చేసినవి. వీటిని ఉపయోగించిన, వీనినుండి వెలువడే విషము, విష

హాయువులు, క్రిములు, బాక్టిరియా మొ॥ నాశనము చేయు శక్తి గలవాటి ద్వార ఖండములన్నియు కొంతకాలములో నాశనము కావింప బడగలవు.

ఇప్పుడు ప్రపంచమందు భద్రము చేయబడి, ఉపయోగించుటకు సిద్ధముగా యున్న కొన్ని ఆయుధములు క్రింద ఉదహరింపబడినవి.

న్యుమోనిక్ ప్లేగ్ (**Pneumonic Plague**) — ఈ బాక్టిరియా దాడి ద్వార బాధితులైన మనుష్యులను 100% వరకు తిరిగి బాగుచెయ్యబడకుండ చనిపోవునట్లుగా ఇది కనుగొనబడినది.

పల్మోనరీ ఏన్త్రాక్సు (**Pulmonary Anthrax**)—దీని ప్రయోగము ద్వార వెలువడె విషవాయువు ఊపిరితిత్తులకు సోకగా, మనుష్యుడు 24 గం॥లలో చనిపోవును. ఏ రకమైన మందు, యాంటి బాయటిక్ (Anti biotic) కూడ దీనివలన వచ్చేడి జబ్బును నిరోధించలేదు.

టైఫస్ (**Typhus**)— దీనివలన వచ్చే జ్వరము ద్వార చనిపోయె సంఖ్య, మలేరియాతో చనిపోయే వారి సంఖ్యతో సరితూగును.

బొట్యులినస్ టాక్సిన్ (**Botulinus Toxin**)—ఇది నేటి మానవునికి, తెలిసిన విషములన్నింటిలో చాల ఘూరమైన విషము. సైనైడ్ కన్న ఇది 300 మిలియనుల రెట్లు హెచ్చుగా విషపు చర్యయందు తీవ్రత కల్గియున్నది. ఆరు ఔన్సుల టాక్సిన్‌ను తగు మోతాదు (Dose) లో ఉత్తర అమెరికాలో నున్న ప్రజలకు ఇచ్చిన, అందరును క్షణములో చనిపోయెదరు.

నర్వ్ గ్యాస్ (**Nerve gas**) — ఈ వాయువును వదులుట ద్వార, మనుష్యులకు, ప్రతి ప్రాణికిని హాని తీవ్రముగా జరుగును. మనుష్యులకు దీనివలన మూర్ఛ మాదిరిగా (convulsions) వచ్చుట, ఊపిరి ఆడక పోవుట మొ॥ జరిగి 30 సెకనులలో మరణించెదరు. కొన్ని వేల కొలది టన్నుల నర్వ్‌గ్యాసు ఉపయోగార్థమై నేడు ప్రపంచమందు దాచబడియున్నది. జర్మనీ దేశపు టాబన్ గ్యాస్ (Taban gas) ఫ్యాక్టరీ రష్యా ఆధీనములో యున్నది. రష్యా 50,000 టన్నుల టాబన్ గ్యాసు (వాయువు)ను తనకమ్యూనిష్టు సైన్యముకొరకు సిద్ధముచేసికొనియుంచినది.

చైనా దేశము కూడ ఒక విధమగు రసాయనిక ఆయుధములను తయారు చేసినది. వీనిని ఉపయోగించిన, తెగుళ్ళవలన చనిపోయేవారి కన్న, హెచ్చుగా మనుష్యులు వీనిద్వార చనిపోయెదరు.

అమెరికా ప్రెసిడెంటు నిక్సన్ ఈలాంటి మారణాయుధములను విసర్జించవలెనని అమెరికాలో ఉత్తరువుచేసి, వీని రూపుమాపుటకు ఆజ్ఞ ఇచ్చెను. కాని వీటిని తయారుచేసే శాస్త్రము, శాస్త్రజ్ఞులు ఇంకను జీవించుచునే యున్నారు. వేరే దేశములను ఈలాంటి ఆయుధములను దాచి యుంచుకొంటున్నారు. మనుష్యుడు చేయలేనిది ఏమి కలదు?

# గూఢవిద్య యొక్క అభివృద్ధి
# Resurgence of Occultism

పౌలు—"...కడవరి దినములలో కొందరు అబద్ధికుల వేషధారణ వలన మోసపరచు ఆత్మలయందును దయ్యముల బోధయందును లక్ష్యముంచి, విశ్వాస భ్రష్టులగుదురని ఆత్మ తేటగా చెప్పుచున్నాడు." 1 తిమోతి 4:1-2.



యెహోవా దేవుడు — "తన కుమారునైనను తన కుమార్తెనైనను అగ్నిగుండము దాటించువానినైనను శకునములను చెప్పు సోదెగానినైనను మేఘ శకునములను గాని సర్ప శకునములను గాని చెప్పువానినైనను, చిల్లంగి వానినైనను, మాంత్రికునైనను, ఇంద్రజాలకునైనను, కర్ణపిశాచి నడుగువానినైనను దయ్యములయొద్ద విచారణ చేయువానినైనను మీ మధ్యన ఉండ నియ్యకూడదు." ద్వితీయోపదేశ కాండము 18:10-12. కొన్ని సంవత్సరముల నుండి, దయ్యములకు సంబంధించిన, ఆచారములు, మతములు, చేతబడి (witch craft), జోతిష్య శాస్త్రము (Astrology) మొ॥నవి లోకమందు హెచ్చయ్యెను.

అమెరికాలో 20 లక్షల ఔజా (Ouija) బోర్డులు 1970లో అమ్మబడెను. దినపత్రికలలో 70% మనుష్యుల జాతకములను ప్రచురించునవిగా యున్నవి. ఎన్నో పాఠశాలలందు, కళాశాలలందు చేతబడి (witch craft), జోతిష్య శాస్త్రము మొ॥ గూఢ విద్యలు నేర్పబడుచున్నవి.

సిబిల్ లీక్ అనే ప్రఖ్యాతిగాంచిన మంత్రకత్తె (witch) తాను వ్రాసిన పుస్తకముల ద్వార లక్షలు గడించెను. ఆమె కొన్ని సంవత్సరముల క్రితము అమెరికాలో చాలమంది మంత్రకత్తెలు కలరని తెల్పెను.

ఇంగ్లాండులో చేతబడి (witch craft) ద్వార మనుష్యులు పీడింపబడుట చూచి, ఆంగ్లికన్, రోమన్ కాతోలిక్ వారు మనుష్యుల నుండి దయ్యములను వెడలగొట్టుటకు, భూత వైద్యులను (Exorcists) గవర్నమెంటు తరపు నియమించవలెనని సలహా నిచ్చిరి.

డాక్టర్ కర్ట్ కోచ్ అనే జర్మనీ క్రైస్తవుడును మరియు ఈలాంటి విషయములు బాగా నెగిరినవాడు, బ్రిటన్ దేశమందు నూటికి యాభై మందిగూఢ విద్యలందు శ్రద్ధ చూపువారని వివరించెను. అంతేకాక బ్రెజీల్ దేశములో గూఢ విద్యయందు ఆసక్తిగలవారు పెక్కుమంది కలరని, దాదాపు 150 పత్రికలు, గూఢ విద్యకు సంబంధించిన పత్రికలుగాయుండి, వీని ప్రచారముకొరకు వాడబడుచున్నట్లు తెలిపెను.

ఫ్రాన్సు దేశమందు, జోతిష్య శాస్త్రమునందు (Astrology) ప్రవీణతగల స్త్రీ, తనకు ఏ మాత్రము విరామము లేకుండ, ఎప్పుడు ప్రజలనుండి టెలిఫోను పిలుపులు—"ఏ సమయమందు పెండ్లి చేసికొనవలెను, ఎప్పుడు విడాకులు ఇవ్వవలెను, ప్రయాణము ఏ సమయములో చెయ్యవలెను, అనెడి పెక్కుసమస్యల విషయమై సంప్రదించుటకై, వచ్చునని ప్రతి నిమిషము ఈలాంటి విషయములో తాను నిమగ్నురాలై యుండునని" తెల్పెను.

ఇటలీ దేశములో 30,000 మంత్రికత్తెలు (witches), మంత్ర విద్యనే ఆధారము చేసికొని జీవించువారు కలరు. రోమ్ నగరమందు 3000 మంది చిల్లంగి వృత్తి (witch craft)చేయువారు కలరు. కెనడా దేశ ప్రభుత్వము సాతానుకు సంబంధించిన గూఢవిద్యను వృద్ధిచేయుటకు మరియు

సాతానును పూజించు కార్యములకుగాను 25,900 డాలర్లను మంజూరు చేసెను. జర్మనీలో సాతానుకు సంబంధించిన గూఢ విద్యయందు దాదాపు 30లక్షల మంది లక్ష్యముంచువారని, 70 లక్షలమంది దీనిని అనుకరించు వారని, అంచనా.

సాన్ ఫ్రాన్సిస్కో పట్టణమందు ఈ విద్యకు సంబంధించిన పుస్తకములు విపరీతముగా అమ్మడు పోవుచున్నవి. ఇంతకు పూర్వము మత సంబంధమైన పుస్తకముల కొరకు వినియోగించిన స్థలముకూడ నేడు ఈ పుస్తకములే ఆక్రమించినవి. సాన్ ఫ్రాన్సిస్కోలో ఈ పుస్తకములు వచ్చిన నెలలోనే 65% అమ్మగా, వీనిద్వారా 25,000 డాలర్ల డబ్బు వచ్చును.

సాతాను కార్యములు లేక దయ్యములను పూజించుట దినదినము హెచ్చుగు చున్నది. సాతాను సంఘము (Church of Satan) ద్వార సాన్ ఫ్రాన్సిస్కో పట్టణమందు, సాతానును పూజించుట దయ్యముల విద్యను అభివృద్ధిపర్చుట మొదలగునవి ఆసక్తితో జరుపుచున్నారు. ఆన్టన్ జాన్డర్ లావే అనేవాడు దీనికి నాయకుడై నడిపించుచున్నాడు. వీరు మనుష్య అస్థిపంజరములు, సమాధిరాళ్ళు, సాతానుకు సంబంధించిన బిరుదు దండలు, పూసలు మొ॥ వస్తువులతో రాత్రులందు జపములు చేయుదురు. దీనిని చూచుటకు వచ్చే దర్శకులకు దయ్యములకు సంబంధించిన చలన చిత్రములను (Films) చూపెదరు. దీనిలో నల్లనివస్త్రము లను ధరించిన మనుష్యులు, దిగంబర స్త్రీని వేదిక (altar) నొద్దకు తెచ్చి, సాతానుకు నైవేద్యము అర్పింతురు. ఈ సమాజపు సభ్యులను, సమాజపు గురువు ఆరాధన చివరన "మీ యౌవ్వన తలంపులు భోగములు ఫల వంతమగునుగాక । సాతానా నీకు శుభము।" అని ఆశీర్వదించును.

లావే అనేవాడు బైబిలుకు విరుద్ధముగా, సాతాను బైబిలును తయారు చేసెను. దీనిలో సువార్తకు విరుద్ధమైన మాటలు కలవు. వానిలో కొన్ని —"బలవంతులు ధన్యులు, వారు భూలోకమును స్వతంత్రించుకొందురు. నిన్ను ఒకడు ఒక చెంపకొట్టిన వాని రెండవ చెంప పగులగొట్టుము." ప్రకటనలో ప్రవచింపబడినట్లు, అంత్య కాలమందు మనుష్యులు సాతాను

కార్యములలో ఆసక్తికలిగి యుందురే కాని, తాము చేయుచున్న నరహత్య లను, మాయామంత్రములను జారత్వములు చేయకుండునట్లు మారు మనస్సు నొందరు. ప్రకటన 9:21.

# తెలివి అధికమగుట
# ( Knowledge Boom )

దానియేలు ప్రవక్త–"చాలా మంది నలుదిశల సంచరించినందున తెలివి అధికమగును..." దానియేలు 12:4



నేటి కాలములో మనుష్యుని తెలివి, ప్రతి పది సంవత్సరములకు రెట్టింపు అగుచున్నది. నేటి విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి దోహదముచేసిన శాస్త్రజ్ఞులలో నేకు నూటికి ఎనభై (80%) మంది జీవించుచునే యున్నారు.
మనుష్యుని తెలివి 150 సం॥లలో అనగా 1750_1900 సం॥ వరకు రెట్టింపు అయినది, తిరిగి దీనికి రెట్టింపుగా 1950 నుండి అణుశక్తి, జీవ శాస్త్రము, ఎలక్ట్రానిక్స్, వార్తాప్రసారము, కంప్యూటర్ మొ॥ రంగము లలో వృద్ధి అయినది.
పత్రికలద్వార తెలిసిన, చంద్రమండలముపై మానవుడు అడుగిడుట, అతివేగముగా వెళ్ళే విమానముల నిర్మాణము, మనుష్యునికి శస్త్ర చికిత్స ద్వారా వేరేవాని అంగములను అతికించి (organ Transplantation) వైద్యము చేయుట మొదలగునవి మనకు తెలిసిన విజ్ఞానాభివృద్ధులలో కొన్ని మాత్రమే. ఈ విధముగా నానా విధములగు విజ్ఞానాభివృద్ధులకు,

ఇంకా ఎన్నో క్రొత్త విషయములను కనుగొనుటకు, విజ్ఞానశాస్త్ర పత్రికలు, దోహదము చేయుచున్నవి.

ప్రపంచమందు చదువు దినదినము హెచ్చగుచున్నది. కొన్ని దేశములందు నిర్బంధ పాఠశాల ద్వార అక్షరాభ్యాసమును వృద్ధి చేయుచున్నారు. కళాశాలలు యూనివర్సిటీలు పెక్కుగా వెలువడుచున్నవి. 30 సం॥ల క్రితము యున్న కళాశాలల కన్న నేడు 5 రెట్లు ఎక్కువగా కళాశాలలు యున్నవి. అమెరికా విద్యాసంస్థ, ఒక కోటి విద్యార్థులు 1975 సం॥ వరకు యూనివర్సిటీలకు చదువుటకై వచ్చెదరని, ప్రతి ముగ్గురు విద్యార్థులలో ఒకడు 18-24 సం॥ వయస్సు గలవారని అంచనా వేసినది.

1980 సం॥ కాలేజీ చదువు 1970 సం॥పు హైస్కూలు చదువుకు సమానముగా యుండునని కనుగొనబడినది. ఇండియా దేశములో విద్యాభివృద్ధి చాలవరకు జరిగినది. 6000 కు పైగా ఉన్నత విద్య నభ్యసించు కళాశాలలు కలవు. 1962 లో కాలేజీలలో, యూనివర్సిటీలలో చదువుకునేవారి సంఖ్య 1,100,000. అలాంటిది 1972 లో వీరి సంఖ్య 300,000 వరకు పెరిగెను.

నేడు రెండుకోట్ల మంది యువతరమువారు, యూనివర్సిటీలలో లేక కళాశాలలలో, ప్రపంచమందు చదువుచున్నారు. ఈ సంఖ్య గత 10 సంవత్సరముల సంఖ్యకన్న రెట్టింపు అయినది.

డాక్టర్ ఎమిర్ గేవర్ లక్ అనే విజ్ఞానశాస్త్ర కళాశాల ఉపాధ్యాయుడు, "ఈనాడు, విజ్ఞానము ఎంతగా ఎదిగినదంటె, చదువును 5, 7 సం॥లలో పూర్తి చేయగల్గే అవకాశము కలదని" తెల్పెను.

నేడు అభివృద్ధి అగుచున్న విజ్ఞానము, మనుష్యుని మేలు కొరకన్న, కీడు కొరకే ఎక్కువ దోహదము చేస్తున్నది.

# ఆధునిక ప్రయాణములు
# Modern Travel

"అంత్యకాలమున ... చాలామంది నలుదిశల సంచరించినందున తెలివి అధికము అగును." దానియేలు 12:4.



ఒక శతాబ్దము క్రితము ప్రతిదేశములోను మనుష్యులు గుఱ్ఱపు బండి లోనే ప్రయాణము చేసెడివారు. ఇప్పటి ప్రజలు, తమ పితరులు జీవిత కాలమంతయు ప్రయాణముచేసినదూరమును ఒక్క వారపు చివరలో (weekend) చేయగలుగుచున్నారు.

మొదటి విమానము అట్లాంటిక్ మహాసముద్రమును దాటి 50 సం॥లు కూడ కాలేదు. అలాంటిది ఈ రోజులలో 30,000 ల కన్న ఎక్కువ ప్రయాణికులు అట్లాంటిక్ మహాసముద్రమును ప్రతిరోజు దాటుచున్నారు. ప్రతి సం॥రము ప్రయాణ వసతులు వృద్ధి యగుచున్నవి. ప్రయాణికు లకు కావలసిన వసతిని కల్పించుటకు అవసరమగు హోటళ్ళను పెక్కుగా వెలుపడుచున్నవి. చార్ల్స కెమ్మన్స విల్సన్ అను నాతడు హోటళ్ళ వ్యాపారమును వృద్ధిపరచుచు 209,000 గదులుగల 1400 సత్రములను, 20 దేశములలో కట్టించెను. ప్రతి క్రొత్త సత్రమును 3 రోజులలో నిర్మించెను. ఈ గ్రంథకర్త కొన్ని రోజుల క్రిత్రము 450 మంది ప్రయా ణికులను తీసుకొనిపొయ్యేది బోయింగు 747 జెట్ విమానములో ప్రయా ణించెను కొన్ని రోజులలో 1,000 మంది ప్రయాణికులను తీసుకొని పోయే విమానమును తయారు చేయబోవుచున్నారు.

ఆస్ట్రేలియా దేశపు కాంటస్ ఎయిర్‌లైన్స్ వారు ఆస్ట్రేలియా నుండి లండన్ నగరమునకు వినోద యాత్రలు ఏర్పాటు చేయగా ఒక్క నెలలోనే 45,500 మంది దీనిలో పాల్గొనిరి.

కన్‌కోర్డ్ సూపర్‌సోనిక్ విమానములు, ధ్వని వేగముకన్న రెట్టింపు వేగముతో గంటకు 1,450 మైళ్ళు ప్రయాణము చేయుచు ప్రపంచ మంతట తిరుగుచున్నవి. ఇవి నూరు మందికన్న ఎక్కువ ప్రయాణికులను తీసుకొని పోగలవు. ఇవి న్యూయార్క్ పట్టణమునుండి లండన్ నగరమునకు 3 1/2 గం॥లలో, ఢిల్లీనుండి లండన్ పట్టణమునకు దాదాపు నాలుగు గంటలలో, ఢిల్లీనుండి సిడ్నీ పట్టణమునకు 5 గం॥లలో ప్రయాణము చేయగలవు. ఈ విమాన నిర్మాణమునకు 3750 లక్షల రూపాయల ఖర్చు అగును.

మోటరు కార్ల వ్యాపారముకూడ చాలా వృద్ధి అగుచున్నది. ఇండియా, రష్యా, మొదలగు దేశములు కొనుగోలు దారులకు కావలసిన సంఖ్యలో మోటరు కారులను ఉత్పత్తి చేయలేక పోవుచున్నవి. ప్రతి సంవత్సరము అమెరికాలో 1,10,000 కారులు ఉత్పత్తి అగుచున్నవి.
ఇండియాలో ప్రతిరోజు 65 లక్షలమంది రైళ్ళలో ప్రయాణము చేయుచున్నారు. 11 వేల రైలు బండ్లు వివిధ ప్రాంతమందు ప్రపంచమును రెండు మారులు చుట్టితిరుగు నంత దూరమును ఒక్క దినములో ప్రయాణము చేయుచున్నవి.

ఆధునిక సౌకర్యములతో సుఖముగా ప్రయాణించుటకు ఓడలు నిర్మింపబడినవి S. S. ఫ్రాన్స్ అను ఓడ 1,150 మంది ప్రయాణికులు ప్రయాణము చేయ గల్గునట్లు పెద్దగా నిర్మింపబడి, అతివేగముగా ప్రయాణము చేయవీలుకల్గి యున్నది.

నేడు ప్రయాణసౌకర్యములు ఎంత వేగముగా, త్వరితముగా చేయుటకు వీలైనవంటే, ప్రపంచమందలి ఏ దేశమునకైనను కొన్ని గంటలలో చేరుటకు వీలగుచున్నది. రాబోవు దినములలో భూమినుండి వేరే గ్రహములకు కూడా ప్రయాణము చేయుటకు వీలగునని భావింపబడుచున్నది.

# చెడు వాయువు (Air Pollution)

మూడవదూత బూర ఊదినప్పుడు దివిటీవలె మండుచున్న ఒక పెద్ద నక్షత్రము ఆకాశమునుండి రాలి నదుల మూడవ భాగము మీదను, నీటి బుగ్గలమీదను పడెను. ఆ నక్షత్రమునకు మాచిపత్రియని పేరు. అందు వలన నీళ్ళలో మూడవ భాగము మాచిపత్రి యాయెను. నీళ్ళు చెడిపోయి నందు వలన మనుష్యులలో అనేకులు చచ్చిరి." (ప్రకటన 8:10-11.) "రెండవదూత తన పాత్రను సముద్రములో కుమ్మరింపగా సముద్రము పీనుగ రక్తము వంటిది ఆయెను. అందువలన సముద్రములో ఉన్న జీవ జంతువులు అన్నియు చచ్చెను." (ప్రకటన 16:3.)

పై ప్రవచనము శ్రమలకాలపు దినముల గూర్చి చెప్పబడినది. ఈలాంటి శ్రమలనుండి తప్పించుకొనుటకు మానవునికి సాధ్యము కాదు.
చెడు వాయువువలన ప్రపంచమందు తీవ్ర సమస్య ఏర్పడి, మానవుని భీతికి కారణము అయినది.

1970 సంII అంతమున పెక్కుదేశముల ప్రభుత్వ ఉద్యోగులు, ప్రజలు, అమెరికా సముద్రములో ప్రయోగించబోయే నర్వ్‌గ్యాస్ (Nerve Gas) అనెడి విషవాయువును ప్రయోగించరాదని అలజడి లేపిరి. దీనిద్వార జన సంచారముగల పట్టణములే కాక సముద్రము నందలి సమస్త ప్రాణులకు హాని సంభవించు ననెడి భయమును వెళ్ళబుచ్చిరి. ఒక ఓడ పూర్తిగ 418 విషవాయువుల నిధులను కలిగినది. ఫ్లోరిడా ఓడ రేవుకు 200 మైళ్ళ దూరములో పోయి, ఓడ విషవాయువుతో సహా సముద్రపు అడుగు భాగమునకు దిగిపోయెను. మరి ఈ విష వాయువులు బైటికి వెలువడెనో లేదో తెలియదు.

పై విధముగానే ఈలాంటి విష వాయువులను, ఇక రకములైన ప్రేలుడు సామగ్రి, యుద్ధపు పరికరములు మొదలగు వాటిని ఓడలో తీసుకొనివెళ్ళి

ఓడను సముద్రములో ముంచివేసిరి. ఈ విధముగా మరికొన్ని దేశము లును చేసినవి. కావున సముద్రపు అంతర్భాగము విషముతో కూడినదై యున్నది.

1969 లో రైన్ నదిలోనికి ఒక రసాయనిక విసర్జనను (waste) వదు లుట ద్వారా, నది నీరు విషమయమై దాదాపు 400 లక్షల చేపలు చనిపోయెను.

కొన్ని సం॥ల క్రితము ఆర్సెనిక్ (Arsenic) అనే రసాయన పదార్ధ మును కలిగియున్న మలినమును స్కాండినేవియన్ శాస్త్రజ్ఞులు సము ద్రము లోనికి వదులుటద్వారా అతి స్వల్పమైన ఆర్సెనిక్ రసాయనిక పదార్థము, మలినములో మిగిలియుండుట వలన సముద్రజలము విష మయమైనదని భావించుచున్నారు.

డాక్టర్ గోర్డన్ టేలర్, 1969లో D. D. T అనే రసాయన పదార్థము మరియు ఇతర విష పదార్థముల ద్వార సముద్రములు, నదులు, విష మయములై యున్నవని తెలిపెను.

ఒక దిన ప్రతికద్వార, లాస్ ఏంజిల్స్ పట్టణపు తూర్పుదిశన ఉన్న అడ వులలో చెట్లు, మోటరు కారులనుండి వచ్చేడి పొగ, విష వాయువులు సూర్యరశ్మితో కలియుటచే కల్గెడి రసాయన చర్యతో ఎండి పోవుచున్నట్లు తెలిసినది. ఇండియాలో బొంబాయి, కాన్పూరు, కలకత్తా పట్టణములలో మోటరు కారులనుండి కర్మాగారముల నుండి వెలువడే పొగ మరియు విషవాయువుల ద్వార చాలా విపత్తులు కలుగుచున్నట్లుగా తెలిసినది. డాక్టర్ D. రాజారాం, "పట్నములను తగు ప్లానుద్వారా నిర్మించకున్న కర్మాగారములనుండి వెలువడే పొగ, విష వాయువులు మొదలగు వాని వలన విషపు గదుల (Gas chambers) వలన కల్గెడి పరిణామమె కల్గు నని" తెలిపెను. బొంబాయి నగరములో పెరుగుచున్న కర్మాగారముల నుండి వెలువడే పొగ, విషవాయువుల వలన నగరప్రజల ఆరోగ్యమునకు తీవ్రసమస్య ఏర్పడుచున్నది. ఇండియాలోని నదులు, కర్మాగారముల నుండి వెలువడె విష పదార్థముల కలియికచే నీరు, ఎఱుపు, పచ్చని, నీలి మొదలగు రంగులతో ప్రవహించుచున్నది. వీనిద్వార నీటిలో రసాయన మార్పుచెంది నదులలోని చేపలు విషమయమైన వగుటచే జాలరులు తమ

వృత్తులను వదులుకొనవలసి వచ్చెను. గాలిలో విషవాయువులు పొగ మొదలగునవి కలిసి మలినము చేయబడుటచే కొన్ని ప్రాంతములలో మామిడి చెట్లు కాయకుండ నిలిచిపోయినవి. ఇప్పుడు ఇండియాలో, స్వచ్ఛమైన గాలిని, మలినము చేయుచున్న విషవాయువులు, పొగ మొదలగువానిని అదుపులోనికి తెచ్చుటకై ఒక చట్టమును ప్రవేశ పెట్టవలెనని భావించుచున్నారు. రెండవ ప్రపంచ యుద్ధము తరువాత జపాను దేశమునకు కలిగిన నష్టమును పూర్తి చేయుటకై కర్మాగారములను అభివృద్ధి జేసి త్వరలో ఆర్థికముగా వృద్ధినొందెను. అయితే ఈ కర్మాగారముల ద్వార వచ్చెడి విషవాయువుల వలన గాలి చెడి ప్రజల ఆరోగ్యములు తరచుగా దెబ్బతినుట సంభవించుచున్నది. క్షయ, ఉబ్బసము, మొదలగు వ్యాధులు హెచ్చుగా అయ్యెను. ఈ వ్యాధులు దేశములోని 75 వేల కర్మాగారపు గొట్టముల ద్వారా 24 గం॥లు పని చేయుటవలన వెలువడే పొగ ద్వార గాలి విషమయమగు చున్నట్లుగా తెలిసికొనబడినది. కర్మాగారముల ఉనికివలన గాలి చెడి మనుష్యుల ఆరోగ్యమునకు భంగము సంభవించుటయే కాక, వీనినుండి నదులలోనికి వెలువడె రసాయనిక పదార్థముల విసర్జనద్వార నీరు విషమయమై చేపలుకూడ చనిపోవుచున్నవి.

జపానులో గాలిలోని విషవాయువులను అరికట్టుటకై సంవత్సరమునకు రు. 2800 కోట్లు ఖర్చు అగుచున్నదని అంచనా వేయబడెను. టోక్యో నగరములో 7 నుంచి 9 గం॥ ఉదయకాలమున నడిచే మోటారు కారులను ఆపుచేసిరి సంవత్సరమునకు 830 వేల టన్నుల సల్ఫర్ డయాక్సైడు గాలిలోనికి కలియుటచే మనుష్యుల ఆరోగ్యమునకు విపత్తు కలుగుటయే కాక చుట్టుపట్లయున్న చెట్లు తెలియని జబ్బులతో ఎండిపోవుచున్నవి. టోక్యోలోని ట్రాఫిక్ పోలీసువారు ప్రతిరోజు ప్రాణవాయువును పీల్చుకొనుటకు ప్రాణవాయువు కేంద్రములకు వెళ్ళవలసి యుండును. జపానులో ప్రాణవాయువు (oxygen) రు. 1-75 పై॥లకు పనిచేయు స్థలములలో అమ్మబడును.

అమెరికా దాదాపు 16,00,000 టన్నుల కల్మష (Pollution) వాయువులను గాలిలోనికి విడుచుచున్నది. ఈలాగుననే ప్రపంచమంతట 8000 లక్షల టన్నుల పొగ మొదలగు కలుషితములు గాలిలోనికి వదల

బడుచున్నవి. మోటారు కారులు మొదలగు వాహనముల వలన గాలి 60% కలుషితమగుచున్నది. అమెరికా ప్రతి సం॥రము ఈలాంటి కలుషిత వాయువులను అరికట్టుటకై రు. 2470 కోట్లను ఖర్చు చేయుచున్నది.

అమెరికాలో 1975 వరకు తయారైయ్యేడి ప్రతి కారుపై దానివలన వచ్చే విషపు వాయువులను అరికట్టుటకు కారు ధరకాక రు. 5,500 అదనపు ఖర్చు అగునని అంచనా వేయబడినది.

ప్రతి సం॥రము జెట్ విమానముద్వార 10,000 టన్నుల కార్బన్ మోనాక్సైడ్ (Carbon monoxide) గాలిలోనికి విడువబడుచున్నది.

చాలా పట్టణములలో బొగ్గుపులుసు వాయువు (Carbon dioxide) మొదలగు వాయువులు గాలిలోనికి విడువబడుట ద్వార సూర్యకాంతి 20% తక్కువ అగుటయేకాక ప్రాణవాయువు (oxygen) దినదినము తగ్గిపోవుచున్నది. కావున శాస్త్రజ్ఞులు దీనివలన గొప్ప ఆపద మనుష్యులకు సంభవించునని భావించుచున్నారు.

ఈ విధముగా గాలి, నీరు, చెట్లు, మొక్కలు, మొదలగునవి విషవాయువులచే ఆవరించబడి ప్రవచన ఆదేశాను సారముగా గొప్ప విపత్తునకు దారి తీయుటయే కాక, మనము ప్రపంచపు అంతిమ రోజులలో యున్నామని గుర్తు చేయుచున్నది.

# యుద్ధమునకు సిద్ధపడుట

"అన్య జనులకు ఈ సమాచారము ప్రకటన చేయుడి యుద్ధము ప్రతిష్టించుడి బలాఢ్యులను రేపుడి యోధులందరు సిద్ధపడి రావలెను. మీ కఱ్ఱులు చెడగొట్టి ఖడ్గములు చేయుడి, మీ పోడకత్తులు చెడగొట్టి ఈటెలు చేయుడి. బలహీనుడు-నేను బలాఢ్యుడను అనుకొనవలెను."
యోవేలు 3:9-10.



నేడు ప్రపంచదేశములు మారణాయుధముల కొరకు ప్రతి నిమిషము నకు రు. 23 లక్షలు ఖర్చుచేయుచున్నారు నేటి కాలమందు ప్రపంచ మందు యున్న అణు ఆయుధములు, లోకమందు యున్న 3,600 మిలి యనుల ప్రజలను చంపుటకన్న 50 వేల రెట్లు ఎక్కువగా నాశనము చేసే శక్తి కల్గియున్నవని అంచనా వేసిరి.

17 దేశములు అణు మారణాయుధములను తయారుచేయుటకై ప్లాటినము ఖనిజమును, కావలసినంత ఉత్పత్తి చేయుచున్నవి.

చిన్న దేశముగా పరిగణించబడి, ముప్పది (30) లక్షల జనాభాకల్గియున్న ఇశ్రాయేలు దేశము, ఆయుధ విస్తరణము ద్వారా తాను బలమైన దేశ మని నేడు చెప్పుకొనుచున్నది. ఇశ్రాయేలు దేశము తన దేశరక్షణ కొరకు, స్వయముగానే ఆయుధములను తయారు చేసికొనుచున్నది. జెరికో అస్త్రము (Missile) అనే పేరుగల ఆయుధములను ఒక్కొక్కటి రు. 180 లక్షల విలువగల వాటిని స్వయముగానే తయారుచేయుచున్నది. ఇదేకాక MD-660 అనే క్రొత్త అస్త్రములను కూడ తన దేశమందే, ఇతర దేశముల సహాయములేకుండ తయారుచేసినది. ఇంతకు పూర్వము ఇశ్రాయేలు జెట్ విమానముల కొరకు అమెరికా దేశముపై ఆధారపడి యుండెడిది. కాని నేడు తన దేశమందే వీటినికూడ తయారు చేయు చున్నది. ఈ దేశము దాదాపు 4,000 టాంకులను, యుద్ధ సైనికులను చేరవేసే వాహనములను, 400 యుద్ధపు విమానములను కల్గియున్నది.

80 లక్షల జనాభను గల్గియున్న స్వీడన్ దేశము 7,50,000 యుద్ధ సైన్య మును, 650 యుద్ధ విమానములను, 110 యుద్ధ నౌకలను కల్గియున్నది. ఇతర దేశములగు ఫ్రాన్సు 500, పశ్చిమ జర్మని 504, బ్రిటన్ 500, యుగోస్లావియా 330, అమెరికా 8,500, రష్యా 4,800 యుద్ధ విమాన ములను కల్గియున్నవి.

రష్యా, అమెరికా ఒక్కొక్కటి, 1000 కన్న ఎక్కువైన ఇతర ఖండ ములపై ప్రయోగించే అస్త్రములను (Inter-continental missiles), 10 లక్షల సైనికులను. 350 కన్న ఎక్కువగు యుద్ధనౌకలను కలిగియున్నవి. దక్షిణ వియత్నామునకు అమెరికా యుద్ధ సామాగ్రియగు 1200 యుద్ధ విమానములను, 1600 యుద్ధ బోటులను మరియు ఓడలను, 640,000

తుపాకులను, 20,000 మరతుపాకులను, 34,000 ప్రేలుడు వస్తువులను విసరివేయు యంత్రములను, 870 ఫిరంగులలాంటివి, 220 టాంకులను 1000 సైనికులను చేరవేసే వాహనములను, 44,000 ట్రక్‌లను, 40,000 రేడియోలను సరఫరా చేసెను.

నేడు అమెరికా, రష్యా దేశములు ఇరువురి దగ్గరనున్న అస్త్రములను ప్రయోగించే కేంద్రములను (satellite stations) ఒకరికన్న మరొకరు ముందుగా ధ్వంసము చేయవలెననెడి ఉద్దేశము కల్గియున్నారు. ఈ విధ ముగా ఈ దేశములు, నీటినుండి, భూమినుండి, అంతరిక్షము నుండి అణు ఆయుధములను ప్రయోగించే కేంద్రములను స్థాపించి, వీనినుండి ఈ అస్త్రములను వేరే దేశములపై ఉపయోగించి ధ్వంసము చేయుటకు సిద్ధముగా యున్నవి.

అమెరికా 80 బిలియనుల (బిలియను = లక్ష కోట్లు) డాలర్లను ప్రతి సం॥ ఆయుధముల ఉత్పత్తికొరకు ఖర్చు చేయుచున్నది. ఈ విధముగా ఈ దేశము ప్రతి 15 సం॥లకు ఆయుధముల ఉత్పత్తిఖర్చును రెట్టింపు చేయుచున్నది.

రష్యా నేడు అమెరికాతో, అణు ఆయుధముల తయారీలో సరితూగు చున్నది. చైనాకూడ ఇప్పుడు అణు ఆయుధ నిర్మాణ రంగమందు చాలా కృషిచేయుచు వీనితో పోటీ పడుచున్నది.

ఇండియా దేశము, దేశ రక్షణకొరకై ఆయుధములపై దాదాపు ప్రతిరోజు మూడు కోట్ల రూపాయలను — సంవత్సరమునకు రు 1,100 కోట్ల రూపాయలను ఖర్చు చేయుచున్నది.

లార్డు రిచీ్చకాల్డర్, సర్ జాన్ కాక్‌క్రాఫ్ట్ అనే శాస్త్రజ్ఞులు తమ రేడియో సంభాషణలో, పప్రించము అణు శక్తిని, రసాయనిక బాంబు లను, మొదలగు మారణాయుధములను తయారు చేయుటద్వార కలిగే తీవ్ర పరిణామమును గూర్చి ఆందోళన వ్యక్తపర్చిరి.

లేసర్స్ (Lasers) ద్వార వెలువడె శక్తిగల కాంతి కిరణములను, వజ్ర ములను తొలియుట (Drilling)కు ఉపయోగించుచున్నారు. వీటి ఉప యోగము ద్వార దూరమున ఉన్న ఏదేని పెద్ద వస్తువులను (objects)

ధ్వంసము చేయ వీలగుచున్నది. బాంబులను ఏదేని ఉద్దేశింపబడిన స్థానమునకు కుడి, ఎడమ కాకుండ సరిగా అదే స్థలముపై ప్రయోగించబడుటకు లేసర్లను మార్గదర్శినులుగా (Guides)ఉపయోగింపబడును. లేసర్లు వజ్రములను తొలియుటకు, మానవుని శరీరముపై శస్త్రి చికిత్సచేయుటకు ఉపయోగింపబడుటయే కాక ఆయుధముల ప్రయోగమందు కూడ వినియోగించుచున్నారు. వీని ద్వార గొప్ప విధ్వంసక చర్య జరుగును. అమెరికా, వియత్నాం నందు వీటిని యుద్ధములో ఉపయోగించిరి. ఇవి శత్రు సైన్యములోనికి 5 మైళ్ళ మేరవరకు చొచ్చుకొని పోయి నెమ్మదిగా కాల్చివేయును.

అమెరికాలో తయారగు MIRV-మైన్యూట్ మెన్ III అను అస్త్రము ఒకే సారి మూడు పట్టణములను ధ్వంసము చేయు, 250,000 టన్నుల TNT శక్తిని కలిగియున్నది. రష్యా 50 మెగ టన్నుల బరువు కలిగిన బాంబులను,—500 లక్షల టన్నుల TNT, అంటే—1945 లో హిరోషిమాపై ప్రయోగింపబడిన 20 కిలో టన్నుల బాంబు కన్న 2,500 పర్యాయములు హెచ్చు వినాశక శక్తిని కలిగి యున్న బాంబులను తయారుచేసినది.

అంత్యకాలములో అణుశక్తి ప్రయోగము ద్వార ప్రజలకు కలిగెడి శ్రమయు, నాశనము అధికముగా యుండి ప్రవచన నెరవేర్పును కొనసాగించుచున్నది.

"మరియు యెహోవా తెగులు పుట్టించి యెరూషలేము మీద యుద్ధము చేసిన జనముల నందరిని ఈలాగు మొత్తును. వారు నిలిచి ఉన్న పాటుననే వారి దేహము కుళ్ళిపోవును. వారి కన్నులు కను తొఱ్ఱలలో ఉండియే కుళ్ళిపోవును. వారి నాలుకలు నోటిలో ఉండియే కుళ్ళిపోవును." జెకర్యా 14:12.

————

# స్వమత పరిత్యాగము (Apostasy)

"మొదట భ్రష్టత్వము సంభవించి నాశన పాత్రుడగు పాప పురుషుడు

బయలుపడితేనేగాని ఆ దినము రాదు" 2 వ థెస్సలోనీకయులకు 2:3

ఈ 50॥లలో జనులు దేవుని నుండి బైబిలు బోధనుండి, చివరకు తాము నమ్మిన మతము నుండి కూడ తొలిగిపోయినట్లు చూచుచున్నాము. మనము సత్యము ద్వార బయలు పరచబడిన అపొస్థులత్వము ఇంతకు పూర్వమే తెలుసుకొని యుంటిమి.

ఈ శతాబ్దములో నవ నాగరికతకు, స్వతంత్రమునకు, పూర్తి ఆచారములకు, అస్థిత్వమునకు సంబంధించిన దానినే పూజించునట్టి(Existentialism), క్రైస్తవ–నాస్తికత్వము, మొదలగు వానికి సంబందించిన విశ్వాసభ్రష్ఠత్వములు హెచ్చుగా వెలువడినవి. ఈలాంటి మతములు విశ్వాసులను కలవర పరచునవే కాక వారి విశ్వాసమునకు సవాలై నిలచు చున్నవి. పూర్వము యేసు ప్రభువు బోధల ద్వార కలిగిన ఉజ్జీవము ద్వార ఎందరో రక్షించబడిరి. అయితే నేడు తప్పు బోధలద్వార విశ్వాసులను తప్పు దారులలో నడిపించుచు క్రీస్తు నుండి దూరపరచుచున్నారు.

నేడు లోకమందున్న కొన్ని క్రైస్తవ మత శాఖలను గూర్చి విచారింతము. రెవ. బెన్ స్మిల్లీ అనే కెనడా యునైటెడ్ చర్చి పాదిరి, మంటితో చేయబడిన మనుష్యుడగు యేసును, చెప్పులు లేకుండ తిరిగిన యేసును, నీటిని ద్రాక్షారసముగా చేసి, కేప్ కెన్నడి నుండి అంతరిక్షములోకి దూసుకుపోయే రాకెట్ లాగా ఆరోహణమైనాడని ప్రఖ్యాతి గాంచిన యేసును, దైవ పురుషుడని, దేవుని కుమారుడని నమ్ముటకు తనకు వీలు కాపటము లేదని హేళన చేసెను.

1969 సం॥లో మత సంబంధమైన ఎన్నికలు జరుపగా 10 వేల మంది ప్రొటెస్టెంటు మత గురువులు ఈ క్రింది విధముగా తమ విశ్వాసమును బయలు పరచిరి:-

యేసు ప్రభువు తన శరీరముతో సమాధిలో నుండి ఆరోహణమైనట్లు నమ్ముదురా? అని ప్రశ్నించగా, 51% మెథడిస్టులు, 35% యునైటెడ్ ప్రెస్బిటేరియనులు, 33% బాప్టిస్టులు, 30% తక్కినవారు అలాగున "నమ్మమని" చెప్పిరి.

క్రీస్తు కన్య గర్భమందు జన్మించినట్లు నమ్ముదురా అని ప్రశ్నించగా 60% మెథడిస్టులు, 44% ఎపిస్కోపియనులు, 49% ప్రెస్బిటేరియనులు, 44% బాప్టిస్టువారు, 19% అమెరికన్ లూథరన్స్, నమ్మకట లేదని సమాధాన మిచ్చిరి.

బైబిలు దేవుని ద్వార యివ్వబడిన వాక్యమని నమ్ముదురా అని ప్రశ్నించగా 82% మెథడిస్టులు, 89% ఎపిస్కోపలియన్స్, 81% ప్రెస్బిటేరియనులు, 57% అమెరికన్ లూథరన్స్ "నమ్మమని" చెప్పిరి. 150 సం॥ క్రిత్రము ఈ మత శాఖపువారే నూటికి నూరుమంది నమ్మిన సత్యములు నేడు సంశయాస్పదములైనవి.

1971 డిశంబరు 12వ తేదిన లండన్ నగరమున సెయింట్ పాల్ కెథీడ్రల్‌లో హేర్ (Hair) అను మతస్థులు, తమ మూడవ మత స్థాపన వార్షిక సందర్భముగా సభను జరిపిరి. వీరు మత సంబంధమైన పాటలకు బదులుగా సినిమా పాటలను పాడుదురు. వీరు వ్యభిచారము చేయుట, మత్తు పదార్ధములను సేవించుట తప్పుకాదని బోధించుదురు. మారివానా (Marijuana) అనే మత్తు పదార్ధము దేవుని నుండి బహూకరించబడినదని చెప్పి దాని విషయము పాటలు పాడుకొందురు. దిగంబరత్వము (Nudity) తప్పు కాదందురు. ఈ విధముగా క్రైస్తవ గురువులే బైబిలునందు పాపముగా ఎంచబడిన విషయములను నాగరికత రూపములోనికి మార్చి వాటినే ఒప్పుగా చేయుచున్నారు.

బ్రిటన్ జనాభాలో 100కి ఇద్దరు మాత్రమే గుడికి వెళ్ళువారు కలరు. 1966లో బ్రిటిష్ కౌన్సిల్ ఆఫ్ చర్చ్ఛెస్ వారు నీతికి సంబంధించిన ఒక నివేదికను అర్పించిరి. దానిలో వ్యభిచారము బైబిలులో చెప్పబడినట్లు పాపముగా ఎంచవద్దని కొన్ని పరిస్థితులలో వ్యభిచారము చేసినను తప్పు లేదని, పెద్దల మధ్య ఇది సంభవమే నని తెలిపిరి.

ఈ విధముగా 1966 నుంచి క్రైస్తవ బోధకులుగా ఎంచబడువారు వ్యభిచారమును, పురుషగాముల చర్యలను, గర్భస్రావమును మొదలగు కార్యములను బలపరచుచు ప్రచారము చేయుచున్నారు.

ఈలాంటి బోధకులు వాటిని అవలంబించెడివారు మరియు, అక్రమ ప్రవర్తన కలవారు. శ్రమలపాలైనను మారుమనస్సు పొందక యుందురని, వారి కొరకు అగ్ని గుండము భద్రపరచబడి యుండి రెండవ మరణమును నొందుదురని చెప్పబడి యున్నది. అవిశ్వాసులకు ఈలాంటి తప్పు బోధలు చేసే బోధకులకును ఇదే గతి కలుగును. "పిరికి వారును, అవిశ్వాసులును, అసహ్యులును, నరహంతకులును, వ్యభిచారులును మాంత్రికులు, విగ్రహారాధకులు, అబద్ధికులందరును అగ్ని గంధకములతో మండు గుండములో పాలు పొందుదురు, ఇది రెండవ మరణము"—ప్రకటన 21:8.

# అబద్ధ ప్రవక్తలు

"అనేకులు నా పేరట వచ్చి నేనే క్రీస్తునని చెప్పి పలువురిని మోసపరచెదరు" "అబద్ధపు క్రీస్తులును అబద్ధపు ప్రవక్తలును వచ్చి సాధ్యమైతే ఏర్పరచబడిన వారిని సహితము మోసపరచుటకై గొప్ప సూచక క్రియలను మహాత్కార్యములను కనబరచెదరు" మత్తయి 24:5,24.

గత 50 సంవత్సరములలో నేనే క్రీస్తునని, మెస్సియానని, భగవానుడని వచ్చినవారు ప్రపంచమందు పదునొకండు వేల కంటే ఎక్కువగా కలరు.

ఎందరో అబద్ధ ప్రవక్తలు క్రీస్తు రాకడను గూర్చి, లోకాంతమును గూర్చి తమ అంచన ద్వార తప్పుగా ప్రవచించిన వారు కలరు. తాజాగా తెలిసిన వార్త ద్వార, హెచ్. ఫ్లేక్ బ్రౌస్‌వెల్ అనెడివాడు మరికొందరు తాము క్రీస్తు సంఘమునకు చెందిన వారమని తెలుపుచు లోకాంతము 1970 వ సం॥ముననే జరుగునని చెప్పిరి. ఈ చర్చికి సంబంధించిన సభ్యులు తమ పదవులను వదులుకొని స్నేహితులను, బంధువులను కలుసుకొని వీడ్కోలు పుచ్చుకొని లోకాంతము కొరకు కనిపెట్టుచు సిద్ధముగా యుండిరి. అయితే 1970 వ సం॥ గడచి పోగా తాము చేసిన లెక్కలు తప్పని 1972 లో అంత్య దినాలు వచ్చునని తిరిగి చెప్పిరి.

అయితే యేసు ప్రభువు తన రెండవ రాకడను గూర్చి చెప్పిన సంగతిని గమనించుదము—"అయితే ఆ దినమును గూర్చియు, ఆ గడియను గూర్చియు తండ్రి మాత్రమే ఎరుగును, గాని ఏ మనుష్యుడైనను, పర లోకమందలి దూతలైనను, కుమారుడైనను (యేసుక్రీస్తు) ఎరుగరు" మత్తయి 24:36.

ప్రభువైన యేసు అంత్య దినములను గుర్తించుటకు కొన్ని సంగతులను చెప్పెను. యేసుప్రభు —"ఇవి (అంత్య దినములగూర్చి చెప్పిన సంగతులు) జరుగనారంభించినప్పుడు మీరు (విశ్వాసులు) ధైర్యము తెచ్చుకొని మీ తలలెత్తికొనుడి, మీ విడుదల సమీపించుచున్నదనెను" లూకా 21:28.

1977 లో లోకమునకు అంతము వచ్చునని ఇండియాలో తమిళనాడు రాష్ట్రములోని తిరునెల్వేలి జిల్లాలో గుడారము వేసుకొని ఈ ప్రవచనము నకు కారకుడైన బ్రదర్ ఆర్. పౌలాసీర్ లారీ, మరియు అతని ఆధ్వర్యమున చాలమందిచేరి ప్రార్థనలు చేయుచున్నారు. ఇతని గుంపులో చాలామంది ఆస్ట్రేలియా, కెనడా, పశ్చిమ జర్మనీ, అమెరికా దేశములకు చెందిన వారు కలరు. వీరు బ్రదర్ లారీ, మానవుడు చంద్రమండలము పై కాలిడిన రోజున ఆత్మను పొందినాడని, ఇతను క్రస్తు సంఘమును ఎత్తబడుటకై విశ్వాసులను సమకూర్చుటకు దేవునిచేత ఏర్పరచబడిన

వాడని నమ్మి చాలామంది తమ ఆస్థులను అమ్మి ఆ ద్రవ్యమును తెచ్చి ఇతనికి అప్పగించి, క్రీస్తు ఆత్మ లారీపై కలదని నమ్ముచు, అచ్చట ప్రార్థనలు జరుపుచున్నారు. అబద్ధ ప్రవక్తల గురించి జాగ్రత్త సుమీ !

# ఇశ్రాయేలీయుల సమకూర్పు మరియు అభివృద్ధి

ప్రవక్త యెహెజ్కేలు ద్వార దేవుడు పలికిన మాటలు— "నేను అన్య జనులలో నుండి మిమ్మును తోడుకొని ఆయా దేశములలో నుండి సమకూర్చి మీ స్వదేశములోనికి మిమ్మును రప్పించెదను.

మీ దోషముల వలన మీకు కలిగిన అపవిత్రతను నేనుతీసివేసి మీపట్టణములలో మిమ్మును నివసింప జేయునాడు పాడైపోయిన స్థలములు మరల కట్టబడును. మార్గస్థుల దృష్టికి పాడుగాను నిర్జనముగాను అగుపడినభూమి సేద్యము చేయబడును." యెహెజ్కేలు 36:24, 33-34



యూదులు లేక ఇశ్రాయేలీయుల చరిత్ర ప్రవక్తల ద్వార ప్రవచింపబడినట్టుగానే నెరవేర్చబడెను. యేసు ప్రభువు, యెరూషలేము పట్టణము రాతిమీద రాయి నిలిచియుండకుండ నాశనము చేయబడునని, నిర్జనముగా వదిలివేయబడునని చెప్పినట్లు జరిగెను. (మత్తయి 23:37-38, 24:2)పై ప్రవచనము క్రీస్తు చనిపోయిన 70 సంవత్సరములకు రోమా ప్రభుత్వము ద్వార ఈ నగరము ధ్వంసము చేయబడి పట్టణపు గోడలు ఇండ్లు పడగొట్టబడెను. 10వేల మంది యూదులు ఈ సమయములో మరణించిరి. వేలకొలది ప్రజలు సిలువవేయబడిరి. పసిపిల్లలు ఎత్తైన స్థలము

నుండి వీధుల వైపు విసిరి వేయబడిరి. 97 వేలమంది యూదులు రోమా ప్రభుత్వమునకు బానిసలుగా కొనిపోబడిరి. హేరోదు-యూదుల దేవాలయము ధ్వంసము చేయబడెను, అది తిరిగి కట్టబడలేదు. ఈ విధముగా యెరూషలేముపై జరిగిన యుద్ధ దండయాత్రలలో యెరూషలేము పట్టణమే కాక ఇశ్రాయేలీయుల దేశమంతయు నాశనము కావింపబడెను.

క్రీ॥ శ॥ 135 సం॥ములో యూదులు రోమా ప్రభుత్వముపై తిరుగుబాటు చేయగా రోమా ప్రభుత్వము, ఆ తిరుగుబాటు అణిచివేసి ఏ యూదుడును యెరూషలేము పట్టణములోనికి అడుగిడరాదని నిషేధించెను. ఈ కారణమువలన మిగిలిన యూదులు ప్రపంచమందలి నానా దేశములకు చెదరి పోయిరి. యూదుల దేశమగు పాలస్తీన యుద్ధముల ద్వారను, ఒక దేశమును మరియొక దేశము జయించుట ద్వారాను ఒకరి తరువాత మరియొకరి పరిపాలనలోనికి మార్చబడెను. వారిలో అరబ్బులు, క్రూసేడర్స్, మమ్‌లక్స్, తురుష్కులు ఇంగ్లీషువారు ఒకరి తరువాత ఒకరు ఈ దేశమును పాలించిరి.

క్రీ. శ. 19వ శతాబ్దములో యూదులు 10వేల మంది మాత్రమే పాలస్తీనా దేశములో నివసించెడి వారు. వారును చాలా పేద స్థితియందు యున్నవారు. 1870 వ సం॥లో తురుష్క (Turks) ప్రభుత్వము వారు యూదులు భూములు కొనే అవకాశమును ఇచ్చెను. దాదాపు 1880 వ సం॥లో రష్యా దేశము యూదులను తమ దేశమునుండి వదలి వెళ్ళి పోవలెననెడి [illegible] తేగా వేలకొలది యూదులు పాలస్తీన దేశమునకు వచ్చిరి. క్రీ.శ. 1897 వ సం॥లో జోయనిస్టు (Zionist) = సీయోను) కాంగ్రెసు మొదట సభ నెలకొల్పబడి, ప్రపంచ జోయనిస్టు సంస్థ రూపొందింపబడెను. (జోయనిస్టు అనునది యెరూషలేమునకు మారు పేరు, జోయనిస్టు సంస్థ యూదుల రాజ్యమును తిరిగి స్థాపించుటకు ఏర్పరచబడెను)

1900 సం॥ వరకు 40 వేలు, 1914 సం॥ వరకు 80 వేల యూదులు పాలస్తీనాలోనికి, స్థిరనివాసము ఏర్పరచుకొనుటకు వచ్చిరి. ఆ తరువాత


ఇశ్రాయేలు దేశము
1967 సం." జూన్ నెల నుండి ఆక్రమించ బడిన ప్రాంతము
మధ్యధరా సముద్రము
లెబనాన్
సిరియా
గలిలయ
హైఫా
నజరేతు
టెల్ఎవివ్
అమన్
యెరూషలేము
మృత సముద్రము
గాజా
నెగెవ్
జోర్డాను
సూయజ్ కాలువ
కైరో
ఎలట్
సినాయి
సౌదీ అరేబియా
ఈజిప్టు
టైరన్ ప్రాంతము
ఎర్ర సముద్రము

మొదటి, రెండవ ప్రపంచ యుద్ధముల వలన ఏర్పడిన పరిణామముల ద్వార యూదులు చాలామంది పాలస్తీనాలోనికి వచ్చి నివాసములు ఏర్పరచుకొని స్థిరపడిరి. ఈ సంగతి ఇట్లుండగా అద్భుత రీతిగా 1948 లో ఇశ్రాయేలీయుల రాజ్యము నెలకొల్పబడెను. ఇశ్రాయేలీయుల రాజ్యము ఏర్పరచబడిన తరువాత ఏ దేశమందున్నను, ఇశ్రాయేలీయులు తమ దేశమునకు వచ్చి నివాసము ఏర్పరచుకొనవచ్చుననెడి ఉత్తరువు జారీ చేయబడెను.

నూతనముగా ఏర్పరచబడిన ఇశ్రాయేలీయుల దేశములోనికి మొదటి 18 నెలలలో 3 లక్షల 50వేల మంది యూదులు వివిధ దేశములనుండి స్థిర నివాసము ఏర్పరచుకొనుటకు వచ్చిరి. వీరిలో ఎమన్ దేశములో నుండి 45,000, ఇరాన్ నుండి 1,30,000, టర్కీనుండి 33,000 చెకోస్లో వేకియానుండి 20,000, బల్గేరియానుండి 36,000, యుగోస్లావియా నుండి 7,000, పోలాండు నుండి 28,000, ఉత్తర ఆఫ్రికా నుండి 35,000, చైనా నుండి 5,000, ఇండియా, ఇతర దేశములనుండి ఇంకా ఎందరో వచ్చిరి. ఇట్లు యూదులు తమ దేశము లోనికి వచ్చువారి సంఖ్య ప్రతి సం॥రము హెచ్చు అయినది. ఇప్పుడు ఇశ్రాయేలు దేశపు సంఖ్య 30 లక్షలు. దీనిలో 25 లక్షల కంటే యెక్కువమంది యూదులునై యున్నారు. 1970 లో దాదాపు 37,000 మంది యూదులు తమ దేశమునకు వచ్చిరని, 1971 సం॥లో ఇంకా హెచ్చుగా యూదులు రష్యానుండి వచ్చిరని, ఈ విధముగా తిరిగి వచ్చుచున్న యూదులకొరకు వసతులు ఏర్పరచుచున్నట్లు ఇశ్రాయేలు దేశపు, వసతులను కల్పించు మంత్రి తెలిపెను. రష్యా దేశము చాలా సంవత్సరములవరకు యూదులకు తమ దేశము నుండి వెళ్ళుటకు అనుమతి ఇవ్వకుండెను. గాని 1971లో తమ ఉద్దేశమును మార్చుకొని, రష్యాయూదులు వెళ్ళుటకు సెలవు యియ్యగా ప్రతి వారము రష్యానుండి యూదులు 600-700 వరకు ఇశ్రాయేలీయుల దేశమునకు తరలి వెళ్లుచున్నట్లుగా తెలియుచున్నది. 1972లో దాదాపు రష్యా నుండి 10 వేల మంది యూదులు ఇశ్రాయేలు దేశమునకు వచ్చిరని అంచనా వేయబడినది.

యూదులు 1900 సం॥ వరకు (లేక 2500 సం॥) వేరువేరు దేశములకు చెదర గొట్టబడి ఎన్నో హింసలకు, అవమానములకు, హత్యలకు గురి అయినను తిరిగి వారి దేశమైన పాలస్తీనను తిరిగి పొందుటయే కాక "మా దేశమని", చెప్పుకొనునట్లుగా ఇశ్రాయేలు దేశమువారికి లభించినది. ఇప్పుడు వివిధ దేశములనుండి వచ్చిన నల్లని, పసుపుపచ్చని, గోధుమ, తెల్లని వర్ణముల యూదులు అందరును కలసి సహోదరులుగా తమ దేశమున నివసించుచున్నారు.

ఇది యెహెజ్కేలు ప్రవక్త ద్వార ప్రవచింపబడిన ప్రవచనా దేశానుసారము పూర్తిగా నెరవేరబడినదని చెప్పలేము. కాని ఆ ప్రవచనమే ఇప్పుడు నెరవేర్పులో యున్నదని నమ్మవచ్చును. ఇప్పటికి ఇంకా 110 లక్షల యూదులు వేర్వేరు దేశములలో నివసించుచున్నారు. వీరందరును అంత్య కాలము వరకు తమ దేశమైన ఇశ్రాయేలుకు తిరిగి రావలసి ఉన్నది. అన్ని దేశములలో నున్న ఇశ్రాయేలీయులందరు (ఒక్కరును మిగుల కుండ) పాలస్తీన దేశమునకు వచ్చేవరకు ప్రవచనము నెరవేర్చబడినదని చెప్పబడదు. క్రొత్త దేశమగు ఇశ్రాయేలు 25 సంవత్సరములలో ఎంతగానో అభివృద్ధిగాంచెను ఈ దేశములో 1000 లక్షల చెట్లు నాటబడెను. ప్రతివారము ఇచ్చట చెట్లు నాటు ఉత్సవమును జరిపెదరు, ఇచ్చటికి వచ్చే యాత్రికులు దీనిలో పాల్గొనెదరు. చెట్టు ఒక్కంటికి రు. 22/- వరకు యాత్రికులు కొని తమ పేర చెట్లను నాటెదరు.

నూతన యెరూషలేము, టెల్అవివ్, హైఫా పట్టణములు నవీన రూపముగా నిర్మించబడి బహుగా అభివృద్ధినొందుచున్నవి. ఇవి కాక ఈ దేశమందు 40 ముఖ్యమైన పట్టణములు, వందలకొలది గ్రామాలు కలవు. ఇశ్రాయేలు ఖనిజ సంపదలయందు మిక్కిలి భాగ్యమైన దేశముగా యున్నది. మృత సముద్రము (Dead sea) లోని రసాయన పదార్థాల (Chemicals) సంపదను బయటికి తీసిన 270 బిలియనుల డాలర్ల ఆదాయము రాగలదని అంచనా వేయబడినది. ఈ రసాయన పదార్థములను నేడు ఇశ్రాయేలు బయటకు తీయుటకు ప్రయత్నించుచున్నది. ఇవియే కాక ఈ దేశము 34 పెట్రోలు బావులను కూడ కల్గియున్నది. ఇశ్రాయేలు,

అణుశక్తి బలమునుకూడ కలిగియుండుటయేకాక ఈ దేశము స్వంతగా, జెట్ విమానములను, యుద్ధ అస్త్రములను మొ॥ తయారు చేయుచున్నది. ప్రవచింపబడిన పెక్కు ప్రవచనములు నేటికాలపు ఇశ్రాయేలు దేశమందు సంభవించినవి. వానిలో ఉదాహరణకు :

"రాబోవు దినములలో యాకోబు (ఇశ్రాయేలు) వేరుపారును ఇశ్రాయేలు చిగిర్చి పూయును. వారు భూలోకమును ఫలభరితముగా చేయుదురు" యెషయా 27:6.

"అరణ్యమును ఎండిన భూమియు సంతోషించును అడవి ఉల్లసించి కస్తూరి పుష్పమువలె పూయును." యెషయా 35:1.

ఇశ్రాయేలు దేశమందు పెక్కు మంది వ్యవసాయ వృత్తిని అవలంబించిరి. నెగెవ్ అనబడే అరణ్య ప్రాంతములందు సహితము వ్యవసాయ అభివృద్ధి కావించబడి, పట్టణములు, గ్రామములు వ్యవసాయ రంగమందు వృద్ధి చెందుచు ముందుకు సాగుచున్నవి. సిట్రస్ (Citrus) పండ్లు ఈ దేశమందు హెచ్చుగా పండించబడి, వీటిని వేరే దేశములకు ఎగుమతి చేయుట ద్వారా ప్రతి సంవత్సరము 80 కోట్ల రూపాయల విలువ కల్గే విదేశ ద్రవ్యమును సంపాదించుచున్నది. ఈ పండ్లు యూరపు దేశములందు, అమెరికా మొదలగు దేశములందు విరివిగా అమ్ముడు పోవుచున్నవి.

యేసు ప్రభువు ఇశ్రాయేలును గూర్చి చెప్పిన ప్రవచనము ఈ రోజులలో సంపూర్తి అగుచు, మనము కడవరి రోజులలో యున్నామని గుర్తు చేయుచున్నది.

యేసు ప్రభువు — "అంజూరపు వృక్షమును సమస్త వృక్షములను చూడుడి. అవి చిగిరించుట చూచి వసంతకాలమప్పుడే సమీపమాయెనని మీరు తెలిసికొందురు గదా? అటువలె మీరు ఈ సంగతులు జరుగుట చూచినప్పుడు దేవుని రాజ్యము సమీపమాయెనని తెలిసికొనుడి." లూకా 21:29-31.

బైబిలు విద్యార్థికి, అంజూరపు వృక్షము విషయమైన ప్రవచనము, ఇశ్రాయేలు దేశపు పునః నిర్మాణమును గూర్చి తెల్పుచున్నదని తెలియును. మిగిలిన వృక్షముల ప్రవచనము, అన్యదేశములను గూర్చి తెల్పుచున్నది.

1948 లో ఇశ్రాయేలు దేశము క్రొత్తగా నిర్మించబడి క్రమముగా అభివృద్ధి గావించబడెను. ఈలాగే మరికొన్ని క్రొత్త దేశములు స్థాపింపబడి యునైటెడ్ నేషన్స్ (U. N.) అనే ఐక్యరాజ్య సమితిలో శక్తివంతమైన రాజ్యములతో సహా సభ్యత్వము నొందెను. యేసుప్రభువు చెప్పిన రీతిగా ఇశ్రాయేలు దేశము తిరిగి నిర్మించబడి, చెదరిపోయిన యూదా జనాంగములు సమకూర్చబడి, ప్రవచన నెరవేర్పు నొందెను. వీటి ద్వారా మనము అంత్య దినములందు యున్నామని, ఏడు సంవత్సరములు జరుగు ఘోర శ్రమల రోజులకు అతి సమీపముగా యున్నామని తెలియుచున్నది.

# రష్యాను గూర్చిన ప్రవచనము



"ప్రభువగు యెహోవా సెలవిచ్చునదేమనగా— రోషునకును, మెషెకునకును తుబాలునకును అధిపతి యగు–గోగూ, నేను నీకు విరోధినై యున్నాను. నేను నిన్ను వెనుకకు త్రిప్ప నీ దవుడలకు గాలములు తగిలించి, నిన్నును నీ సైన్యము నంతటిని గుఱ్ఱములను నానా విధములైన ఆయుధములు నీ రౌతుల నందరిని, కవచములును డాళ్ళను దరించి ఖడ్గములు చేత పట్టుకొను వారందరిని, మహా సైన్యముగా బయలుదేర దీసెదను నీతో కూడిన పారసీక దేశపు వారిని కూషీయులను పూతువారి నందరిని డాళ్ళను శిరస్త్రాణములను ధరించినవారినందరిని నేను బయలుదేర దీసెదను. గోమెరును అతని సైన్యమంతయు ఉత్తర దిక్కులో నుండు తోగర్మాయును అతని సైన్యమును జనములనేకములు నీతో కూడ వచ్చును, నీవు సిద్ధముగా యుండుము: నీవు సిద్ధపడి నీతో కలసిన సమూహమంతటిని సిద్ధపరచుము వారికి నీవు కావలివై యుండుమనెను. నా జనులగు ఇశ్రాయేలీయులు నిర్భయముగా నివసించుకాలమున నీవు తెలిసికొందువు కదా? ఉత్తర దిక్కున దూరమున ఉన్న నీ స్థలములో నుండి నీవును నీతోకూడ జనములు అనేకములు గుఱ్ఱములు ఎక్కి బహు విస్తారమైన సైన్యముగా కూడివచ్చి, మేఘము భూమిని కమ్మినట్లు ఇశ్రాయేలీయులగు నా జనులమీద పడుదురు." యెహెజ్కేలు 38:3-7, 14-16.

రోషు, మెషక్, తుబాలు అనునవి నేటికాలపు రష్యా, మాస్కో, ఆసియా యందలి రష్యా (Asiatic Russia) లుగా గుర్తించబడినవి. పర్షియా అనునది నేటి ఇరాను దేశము. కూషు, పూతు అనునవి ఇరానుకు చుట్టుప్రక్కల ఉన్న రాజ్యములు. గోమెరు, జర్మనీగా, తోగర్మా అదునది టర్కీ లేక ఆసియాయందలి వేరే దేశముగా భావించబడుచున్నది.

ప్రవచన ప్రకారము అంత్యరోజులలో రష్యా, ప్రపంచమందలి చాలా దేశములను సమకూర్చి వాటన్నింటికి నాయకత్వము వహించునని తెలియు చున్నది. గోగు, రష్యా నాయకుని సంబోధ నామముగ చెప్పబడినది. ప్రపంచ నాస్తిక కమ్యూనిజమునకు నేడు రష్యా తానే నాయకుడనని చెప్పుకొనుచున్నది. కావున గోగు అనునది దీనికి నాయకత్వము వహించువాని సంబోధక నామముగా చెప్పబడినదని తెలిసికొనవలెను.

నేడు రష్యా ఎన్నో దేశములతో మైత్రిని కలిగియున్నది. వానిలో — సోవియట్ భూమి, సైబీరియా, ఆసియా దేశములో టర్క్ మేనియా, ఆర్మీనియా, తూర్పు జర్మనీ మరికొన్ని దేశములు.

1972లో రష్యా, ఇరాక్ దేశముతో "బాగ్దాద్ ఒడంబడిక" (Baghdad pact) ను ఇరు దేశముల మైత్రి, సహకారమును సంపాదించుటకు చేసి నది. ఇప్పుడు రష్యా తన యుద్ధ ఆయుధములను ఇరాక్‌నకు సహాయ ముగా ఇచ్చి తన స్వాధీనములో ఉంచుకొనుటకు ప్రయత్నించుచున్నది. ప్రపంచ పటము (map)ను చూచిన ఇశ్రాయేలీయులకు రష్యా దేశమునకు మధ్యనున్న భూమి, ఇరాన్, టర్కీ దేశములచే ఆవరింపబడినవి. కావున ఈ ప్రాంతములతో రష్యా మైత్రి కలిగియున్న ఇశ్రాయేలీయులతో యుద్ధము తలపెట్టుకొనిన దాడిచేయుటకు సులభముగా యుండును.

ఇరాన్ అమెరికా ద్వారా సహాయము పొందుచున్న సెంట్రల్ ట్రీటీ ఆర్గ నైజేషన్ (cento) యొక్క సభ్య దేశముగా యున్నది. కాని ఈ వ్యవస్థ బలహీనముగా యుండుటను బట్టి ఇరాన్ నాయకులకు దీనియందు విశ్వా సము లేదు. ఇరాన్ దేశపు తూర్పు సరిహద్దులు రష్యా దేశమునకు కలసి యున్నవి. కావున దీనికి రష్యా దేశమునుండే యుద్ధ భయముండెను. నేడు ఇరాన్ దేశము 1970 నుండి నవీన ఆయుధములను, సైన్యములను,


తూర్పు జర్మని
పోలాండు
జెకోస్లోవేకియ
హంగేరి
యుగోస్లేవియ
రుమేనియ
మాస్కో
రష్యా
సోష్యలిస్టురష్యా
సైబీరియ
(ప్రవచనరీత్యా శ్రమలరోజులలో
సోవియటరష్యా మరియు దాని మైత్రిదేశ
ములు ఇశ్రాయేలుదేశముపై దాడిజరుపుట)
టర్కీ
సిరియ
ఇశ్రాయేలు
జోర్డాన్
టర్కీమేనియ
మంగోలియ
ఇరాన్
చైనా
సౌదీ
అరేబియ
ఇండియా

వాయునౌక మొదలగు యుద్ధసామాగ్రిని సమకూర్చుకొనుచు ఏ రాజ్యము పై ఆధారపడక స్వయముగా అన్ని రంగములందు పటిష్ఠమగుచున్నది. ఇప్పుడు ఇరాన్ చైనాతో మైత్రినెలకొల్పుకొనుట ద్వారా దేశమునుండి విమానములు ఇరాన్ గుండా అల్బేనియా, రుమేనియా, ఈజిప్టు, సుడాన్, పాకిస్థాన్ మొదలగు దేశములకు ప్రయాణము చేయుటకు వీలు కలిగినది. చైనాకు కూడ ఇశ్రాయేలును నాక్రమించుటకు ఆశయున్నను రష్యా చైనా ప్రయత్నము కొనసాగించకుండ అడ్డగించుటకు నిశ్చయించుకొని యున్నది. ఇరాన్ దేశములో నున్న పెట్రోలు బావులకొరకు రష్యా, చైనా ఆశ కలిగియున్నవి చివరకు రష్యానే వీటిని ఆక్రమించుటలో జయమొందును. ప్రవచనము దీని విషయము తేటగా కలదు. —ప్రవచనము నిరర్థకము కాదు.

టర్కీ దేశముకూడ రష్యా దేశముయొక్క సరిహద్దులతో కలిసియున్నది. ఇది కమ్యూనిజమును వ్యతిరేకించే సంస్థయగు నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్ (NATO) అనెడి అమెరికా సాయము పొందుచున్న సంస్థ సభ్యురాలిగా యున్నది. కాని టర్కీ NATO విధులకు లొంగి యుండునని చెప్ప వీలులేదు. ఎందుకనగా దీనికి లాభకరముగా యున్న అవసరమును బట్టి ఏదైన బలమైన రాజ్యము వైపుకువెళ్ళే అస్కారముకలదు.

1972 ఏప్రిల్ లో సోవియట్ ప్రెసిడెంటు పొడ్గోర్నీ టర్కీని దర్శించిన సందర్భములో, టర్కీ ప్రభుత్వము తమ వైఖరిని రష్యాకు అనుకూలముగా కనబరచెను. రష్యా టర్కీమార్పును గుర్తించి, దానితో స్నేహము చేయుచు టర్కీని NATO నుండి విడిపోవునట్లుగా ప్రయత్నము చేయుచున్నది.

రష్యా, టర్కీదేశము సోషలిస్టు రాజ్యవిధానమును ప్రవేశపెట్టిన, త్వరగా వృద్ధి పొందగలదని దీనికి రష్యా తగు ఆర్థిక సహాయము చేయగలదని టర్కీ దేశమందు ప్రచారము చేయుచు, కొందరు స్నేహితులను సంపాదించుకొనుచున్నది. రష్యా తన ఆధీనములో యున్న యూరోపియన్ ఎకనామిక్ ఆసోసియేషన్ (European Economic Association) లో టర్కీ సభ్యత్వము పొందునట్లుగా ప్రయత్నించుచు టర్కీని, యూరో

పియన్ కామన్ మార్కెట్ (EEC) నందు సభ్యులుగా నున్న దేశములతో సమాన అభివృద్ధి స్థితికి తెచ్చెదనని ఆశ చూపుచున్నది. ఈ విషయములో టర్కీ దేశములో కొందరు ఇష్టముగాను, మరికొందరు అయిష్టముగాను ఉన్నారు.

రష్యా యొక్క ముఖ్యోద్దేశము తూర్పు దేశమందున్న ప్రాంతము లన్నింటిని స్నేహముతో తన ఆధీనములోనికి తెచ్చుకొని దీనిద్వార ఈ క్రింది ఉద్దేశములను నెరవేర్చుకొనవలెనని ఉద్దేశించియున్నది:—

1. సూయజ్ కాలువను తెరచిన తూర్పు రష్యా దేశమునుండి ప్రయాణములు యూరపు, రష్యాకు తక్కువ దూరములో త్వరితముగా చేరుటకు వీలగును. అంతేకాక తన నావికా బలమును హిందూ మహా సముద్రములో పర్షియా భాగములో వృద్ధి చేయుటకు సులభమగును. నేటి రష్యా మార్గమైన, కేప్ ఆఫ్ గుడ్ హోప్ చుట్టు తిరిగి పోవుట రష్యాకు కష్ట తరముగా యున్నది.

2. నేటి కాలమునకు మిక్కిలి అవసరమగు, పెట్రోలు, ఖనిజములు, రసాయన పదార్థములు మొదలగు సంపదలు మధ్య ఆసియా (Middle East) ప్రాంతములలో అదికముగా యుండుటచే రష్యాకు ఈ ప్రాంత ములపై ఆశ ఉండుటకు ఇది మరి ఒక కారణము.

3. పై రెండు ఉద్దేశములు ఫలించిన ప్రపంచమందలి తక్కిన దేశములను బలహీనపరచుటలో రష్యా, త్వరగా జయమొందగలదు. ఈ విధముగా చేసి, ప్రపంచమంతట కమ్యూనిజమును వ్యాపింప చేయుటకు రష్యా సంకల్పించి యున్నది.

ఎన్నో సంవత్సరముల నుండి రష్యా, ఇశ్రాయేలీయులు అరబ్ దేశముల మధ్య జరిగిన యుద్ధములో పాల్గొనుచు చివరకు ఇశ్రాయేలీయులతో ముఖా ముఖిగా యుద్ధము చేయుటకు త్వరపడుచున్నది. దేవుడు లేడని చెప్పుచు దానికి విరోధి అయిన రష్యా, ఇస్లాం మతస్థులకు ఎంత మాత్రమును స్నేహితురాలు కాదు. అయినప్పటికి ఇది ఈజిప్టునందు ఎన్నో క్రొత్త ఉపాయములను వ యపరచెను. 1967లో అరబ్, ఇశ్రాయేలు మధ్య జరి

గిన ఆరు రోజుల యుద్ధములో రష్యా అరబ్ దేశములకు సహాయము చేసిన రు. 1400 కోట్ల విలువగల ఆయుధములు ఇశ్రాయేలీయుల ద్వార ధ్వంసము కావింపబడెను.

ఈజిప్టు 1967 సం॥యుద్ధానంతరము కోల్పోయిన యుద్ధసామాగ్రిని రష్యా సమకూర్చుటే కాక నవీన యుద్ధ పరికరములగు, మాచ్ 2.5, ట్విన్‌జెట్ ఇంటర్ సెప్టర్లను, మాచ్ 3 MIG-23 జెట్ ఫైటర్లను, 170 SAM అస్త్రముల కేంద్రములను సమకూర్చెను. అయితే రష్యాకు ఈ యుద్ధ సామాగ్రితో అరబ్బులు, ఇశ్రాయేలీయులను జయించగలరనే నమ్మకము లేదు. కావున ఈజిప్టుకు అపజయము కలుగకుండ స్వయముగా సహాయముచేయ చూచుచున్నది. అయితే రష్యా ఇశ్రాయేలీయులతో ముఖాముఖిగా యుద్ధమందు పోరాడే సమయము ఇంకా ఆసన్నము కాలేదు. ఇదిగాక రష్యా దేశము ఎన్నో సమస్యలను ఎదుర్కొనుచున్నది. వానిలో—స్వదేశ ప్రజలే ప్రభుత్వమునకు ఎదురు తిరుగుచు అంతరంగిక సమస్యగా యున్నారు.

తూర్పు యూరపు దేశములు బలవంతములగుట, తన తూర్పు సరిహద్దులందు చైనా కలహమునకు కారణమగుట, శక్తివంత దేశమగు అమెరికా ద్వార ఉన్న భయము, NATO సంస్థ లందు సభ్యత్వము కల దేశములతో విరోధము, ఇవియేకాక అరబ్ దేశములలో కొన్ని తన స్వాధీనమునుండి తప్పించుకొనుటకు ప్రయత్నించుట, వీటన్నిటికి పైగా రష్యా తన రాబడిలో హెచ్చుభాగము ఆయుధములకై ఖర్చుచేయుచు ఆర్థికముగా పెక్కు సమస్యలను ఎదుర్కొంటున్నది. ఈ విధముగా వివరించబడిన సమస్యలన్నియు రష్యా ఇశ్రాయేలీయులపై దండెత్తి వెళ్ళకుండ ఆటంకముగా యున్నవి.

1972 లో రష్యా సలహాదారులను ఈజిప్టు దేశము బహిష్కరించుటచే ఇప్పుడు రష్యా, ఇరాక్, దేశమును ఈ ప్రాంతములందు తన ముఖ్య కేంద్రముగా చేసుకొన్నది.

రష్యా చదరంగపు ఆటలో ప్రపంచమందు ప్రసిద్ధి నొందినది. అలాగే అంతర్జాతీయ రాజకీయ సమస్యలందు కూడ రష్యా తన చదరంగపు

తెలివిని చూపవలెనని వేగిరపడుచున్నది. కాని రష్యా సర్వశక్తి సంపన్నురాలు లేక సర్వజ్ఞురాలు కాదు. సర్వశక్తి సంపన్నుడై సర్వజ్ఞుడై తన ప్రజలగు ఇశ్రాయేలీయులను కాపాడుచున్న దేవుని శక్తికి రష్యా దేశపు యుద్ధ నిపుణత అణుశక్తి ఎంతమాత్రము పోల్చబడనేరవు కావున రష్యా, దేవుని చేతిలో పరాజయము నొందుటకే యాతన పడు చున్నట్లు తెలుసుకొనవచ్చును. యెహెజ్కేలు 38, 39 అధ్యాయములలో వివరించబడినట్లు రష్యాకు రాబోవు రోజులలో దేవుని ప్రజలగు ఇశ్రాయేలు చేతిలో పరాజయము తథ్యము. రష్యా నాయకులు యెహెజ్కేలు 38, 39 అధ్యాయములు చదివి గ్రహించిన ఇశ్రాయేలు దేశపు సమస్యలలో జోక్యము కలిగించుకొనకుందురు. నాస్తిక దేశము, నవీనయుద్ధ పరికరములలో శక్తివంతమయిన దేశము, ఆకాశములోనికి చొచ్చుకొని పోయే, యుద్ధాయుధములను కలిగియున్న దేశమైన రష్యా నేడు తన స్వనాశనము కొరకు సిద్ధపడుచున్నది.

# ఈజిప్టు మరియు అరబ్బు దేశములు

ఐగుప్తీయుల దండు నైలు నది వలె ప్రవహించుచున్నది. దాని జలములు తొణకునట్లుగా అది వచ్చుచున్నది. నేను ఎక్కి భూమిని కప్పెదను. పట్టణము దాని నివాసులను నాశనము చేసె దను. గుఱ్ఱములారా యెగురుడి: రథములారా, రేగుడి, బలాఢ్యులారా బయలుదేరుడి. డాళ్ళు పట్టు కొను కూషీయులును, పూతీయు ను విలుకాండ్రైన లూదీయులును బయలుదేరవలెను.



ఐగుప్తులో తెలియజేయుడి మిగ్దోలులో ప్రకటింపుడి. నోపులోను

తహపనేసులోను ప్రకటన చేయుడి ఏమనగా—ఖడ్గము నీ చుట్టునున్న ప్రదేశములను మ్రింగివేయుచున్నది. మీరు లేచి ధైర్యము తెచ్చుకొనుడి. నీలో బలవంతులైనవారేల తుడుపు పెట్టబడుచున్నారు? యెహోవా వారిని తోలి వేయుచున్నాడు. గనుకనే వారు నిలువకున్నారు. ఆయన అనేకులను తొట్రిల్ల చేయుచున్నాడు. వారొకని మీద ఒకడు కూలుచు—లెండి క్రూరమైన ఖడ్గ మును తప్పించుకొందము రండి. మన స్వజనుల యొద్దకు మన జన్మభూమికి వెళ్ళుదము రండి అని వారు చెప్పుకొందురు.'' యిర్మియా 46:8-9,14-16.

"అంత్యకాలమందు దక్షిణ దేశపు రాజు అతనితో యుద్ధముచేయును. మరియు ఉత్తరదేశపు రాజు రథములను, గుఱ్ఱపు రౌతులను అనేకమైన ఓడలను సమ కూర్చుకొని, తుఫానువలె అతనిమీద పడి దేశములమీదుగ ప్రవాహమువలె వెళ్ళును. అతడు ఆనందదేశమున ప్రవేశించుటవలన అనేకులు కూలుదురు. గాని ఎదోమీయులును, మోయాబీయులును, అమ్మోనీయులలో ముఖ్యులును అతని చేతిలోనుండి తప్పించుకొనెదరు. అతడు ఇతరదేశముల మీదికి తన సేన నంపించును ఐగుప్తు సహా తప్పించుకొననేరదు.'' దానియేలు 11:40-42

---

పై ప్రవచనములు, ఇశ్రాయేలు దేశము 1948 సం॥మున అవతరించిన నాటినుండి బెదిరించుచున్న ఈజిప్టు, అరబ్బు దేశములను గూర్చి చెప్ప బడినట్టుగా తెలుసుకొనగలము. ఈజిప్టు-అరబ్బు దేశములు మూడు పర్యాయములు (1948, 1956, 1967 సం॥లలో) ఇశ్రాయేలు దేశమును సమూల నాశనము గావించవలెనని ప్రయత్నము చేసి ఘోర నష్టమును, అపజయము పొందినవి.

1971 సం॥ చివరిపరకు ఈజిప్టు ప్రెసిడెంటు అన్వర్ సాదత్, "ఈ సంవత్సరము పాలస్తీనా దేశమును ఇశ్రాయేలీయుల నుండి విముక్తి కావించెదనని'' వాగ్దానము చేసెను. ఆ సంవత్సరము (1971) గడిచి పోయెను కాని తానన్న మాటను నెరవేర్చలేక పోయెను. అయినను ఇంకను బెదిరింపు మాటలను వల్లించుచునే యున్నాడు. కావున తిరిగి యుద్ధము త్వరలో సంభవింప వీలు కలదని భావించవచ్చును. (ఈ యుద్ధము మీరు బహుశ ఈ పుస్తకమును చదవకముందే జరుగ వచ్చును). 1971 లోను ఇప్పుడును ఇశ్రాయేలు యుద్ధమునకు సిద్ధపడి యున్నది. ఇశ్రాయేలు దేశము యుద్ధమందు ఎంత సిద్ధపాటుతో యున్న

దంటే నాలుగు రోజులలో కైరో పట్టణమును స్వాధీన పరచుకొనుటకు బలము కలిగియున్నది.

ఇశ్రాయేలు దేశమును ఒక్క ఈజిప్టు మాత్రమే కాక ఇంక పదమూడు (13) వేరే అరబ్బు దేశములు ద్వేషించుచున్నవి. అయితే ఈ రాజ్యములు ఇశ్రాయేలును హెచ్చు తగ్గులలో ద్వేషించునవిగ యుండినను అన్నియు ద్వేషించునవిగానే యున్నవి. వీనిలో—ఇరాక్, కువైట్, సౌదీ అరేబియా, సిరియా, లిబ్యా, తూర్పు ఏమన్, ఏమన్, అల్జీరియా, సుడాన్, జోర్డాన్, లెబనన్, ట్యునీసియా, మొరాకో అను దేశములు.

అరబ్బుదేశములలో తమలో తాము ఒక ఇశ్రాయేలు సమస్యయందు తప్ప తక్కిన సమస్యలన్నింటిలో విభేదములు కల్గియున్నవి.

సౌదీ అరేబియా దేశపు రాజు ఫైజల్, "మహమ్మదీయులమైన మనము యెరూషలేములో చేరి మన పుణ్య స్థలములను తిరిగి రాబట్టుకొనుటలో, విజయమో, వీరమరణమో లేక హతసాక్షుల మగుటయో జరుగవలెనని, తెల్పెను." లిబ్యా దేశపు నాయకుడు కర్నల్ గాడ్ ఫీ, "మేము ఇశ్రాయే లీయులతో, సమాధానముగా యుండుట, ఇశ్రాయేలీయుల దేశమును గుర్తించుట, ఇశ్రాయేలీయులలో రాయబారము జరుపుట అను విషయము లను పూర్తిగా వ్యతిరేకించుచున్నామని" చెప్పెను.

ఇశ్రాయేలీయులకు, అరబ్బులకు గల విభేదములు ఈ నాటివి కాక, ఇవి 4000 సం॥లకు పూర్వమునుండియే యున్నవి. అబ్రాహాముకు ఇద్దరు కుమారులు. వారు ఇస్సాకు. ఇష్మాయేలు అనువారు. పెద్దవాడైన ఇష్మా యేలు ఐగుప్తు దాసియైన హాగరునకు అబ్రాహాముద్వార జన్మించినవాడు. ఇస్సాకు, అబ్రహామునకు దేవునిద్వార వాగ్దాన పుత్రుడుగా తన భార్య యైన శారాకు జన్మించినవాడు. ఇష్మాయేలు ఇస్సాకును హేళన చేయుట వలన అబ్రాహాము తన ఇంటనుండి అతనిని అతని తల్లియైన హాగరును వెళ్లగొట్టవలసి వచ్చెను. తరువాత ఇష్మాయేలు ఐగుప్తీయురాలిని పెండ్లి చేసికొనెను. పిమ్మట ఇష్మాయేలు (వంశపు) కుమార్తెనే, ఏశావు (ఇస్సాకు కుమారుడు) వివాహము చేసికొనెను. ఈ విధముగా ఇష్మాయేలు


యూరపు
మొరాకో
అల్జెరియ
లిబ్యా
లెబానన్
సిరియ
ఇరాక్
జోర్డాన్
కువెయిట్
ఈజిప్టు
సౌదీ అరేబియ
యెమన్
సుడాన్
ఆఫ్రికా
అరబ్బు దేశములు

అరబ్బు దేశములకు మూల పురుషుడయ్యెను. అదే విధముగా, ఇస్సాకు, దేవుని వాగ్దానమువలన, అతని రెండవ కుమారుడైన యాకోబు (ఇశ్రాయేలు) ద్వార యూదులకు మూల పురుషుడయ్యెను.

ఇప్పటి వివాదము, పాలస్తీనా దేశము ఇశ్రాయేలీయులదా? అరబ్బులదా? అనెడి సమస్యపై జరుగుచు, యుద్ధములకు దారి తీయుచున్నది. దేవుడు దానిని, మొదట అబ్రహామునకు ఇచ్చుచున్నట్లుగా వాగ్దానము చేసెను. ఇశ్రాయేలీయులు (యూదులు) పాలస్తీనా దేశములో, ఐగుప్తు, అస్సిరియా, బాబిలోనియా దేశములద్వార పట్టుబడి దాస్యమునకు కొనిపోబడిన రోజులలో తప్ప 2000 సం॥ వరకు, నివసించుటద్వార, పాలస్తీనా దేశము ఇశ్రాయేలీయులదిగా వర్తించబడెను. క్రీ. శ. 70-135 ఇశ్రాయేలీయులు నానా దేశములలోనికి చెదర గొట్టబడిన రోజులలో, ఈ దేశము ఒకరి చేతినుండి మరియొకరి చేతిలోనికి మార్చబడుచు వచ్చెను. క్రీ. శ. 638 సం॥లో అరబ్బులద్వారా ఈ దేశము జయింపబడెను. ఆ కాలములో అరబ్బులు మహమ్మదీయ మతమును అవలంబించిరి. అరబ్బుల చేతిలో ఈ దేశము క్రీ. శ. 1077 వరకు యుండెను. తరువాత పాలస్తీనా దేశము సెల్ జక్స్ (seljucks), ఫాటిమిడ్స్ (Fatimids), క్రూసేడర్స్ (Crusaders) మొ॥ వారి చేతులలోనికి, ఒకరి తరువాత మరియొకరికి మారుచు వీరి ద్వార క్రీ. శ. 1187 సం॥ వరకు పరిపాలన కావింపబడెను. పిమ్మట సలాడిన్ అనే కుర్దీషు తెగకు చెందిన అరబ్బు వాని ద్వార ఈ దేశము జయింపబడి, ఒక శతాబ్దము వరకు పరిపాలించబడెను. తరువాత మమ్లుక్స్ (వీరును మహమ్మదీయులే కాని తురుష్కియ, సికాసియన్ (Cicassian) తెగకు చెందినవారు) వారి చేతిలోనికి వచ్చెను.

1518 సం॥లో టర్కీవారు ఇప్పుడున్న యెరూషలేము గోడలు కట్టి ఇంతకు పూర్వమున్న యూదుల దేవాలయపు స్థలము పైననే డోం ఆఫ్ ద రాక్ (Dome of the Rock) అనే మసీదును కట్టిరి. టర్కీవారు పాలస్తీన దేశము 1830 సం॥లో ఈజిప్టు అధికారములోనికి పోయినప్పుడు తప్ప దాదాపు 400 ల సం॥ వరకు పాలస్తీనాను పరిపాలించిరి. అయితే ఈ దేశము టర్కీవారి ఆధీనములో యున్నప్పుడు నిర్లక్ష్యముగా వదలివేయబడుట ద్వార ఇది ఆర్థికముగా వెనుకబడి పోయెను.

1917 లో బ్రిటీషు ప్రభుత్వపు జనరల్ అలెన్ బీ యెరూషలేములో ఒక తుపాకి కూడ కాల్చకుండ పాలస్తీనా దేశమును స్వాధీన పర్చుకొనెను. 1922 లో పాలస్తీనా దేశము బ్రిటన్ స్వాధీనములోనికి వచ్చి, 1948 లో ఐక్యరాజ్యసమితి ద్వార విభాగింపబడినప్పుడు ఈ దేశమును అరబ్బులకు యూదులకు పంచి యిచ్చిరి.

పాలస్తీనా దేశము క్రీ. శ. 638 నుండి 1917 వరకు మహమ్మదీయులగు వేరు వేరు తెగలకు చెందిన వారి చేతులలో యున్నను, ఇది అరబ్బుల దేశమని చెప్ప వీలు పడదు. కాని ఆ సమయములో ఈ దేశములో అరబ్బులు నివాసము చేసిరి. కావుననే ఇప్పుడు వారు పాలస్తీనులుగా పిలువబడుచున్నారు. ఇప్పుడు దాదాపు 30 లక్షలకన్నా ఎక్కువైన అరబ్బులు పాలస్తీనా దేశములో నివసించుచు, రెండవ తరగతి పౌరులుగా పరిగణించ బడుటచే అలజడులకు కారణమగుచున్నది.

1967 లో ఆరు రోజుల యుద్ధమందు ఇశ్రాయేలీయులు ఈజిప్టు స్వాధీనమందున్న సీనాయి అరణ్యమును ఆక్రమించుకొనిరి.

ఈజిప్టుకు చెందిన సీనాయి ఎడారిని ఇశ్రాయేలీయులు ఆక్రమించుకొని వదలకుండుట ద్వార ఇది, ఈజిప్టుకు దేహమందున్న ముల్లువలె యున్నది. ఈ ఎడారి యందు వారికి ఇంత ఆసక్తి కలుగుటకు గల కారణమేమనగా ఒకటి, ఈజిప్టు దేశపు 80% పెట్రోలు బావులు ఇచ్చటనే యున్నవి. రెండవది. అవి ఇప్పుడు ఇశ్రాయేలు దేశము ద్వార వినియోగించబడుచున్నవి. సూయజు కాలువను ఇశ్రాయేలు దేశము 1967 లో ఆక్రమించుకొని, అచ్చటినుండి నౌకా ప్రయాణములు నిలిపి వేయుట ద్వార తనకు (ఈజిప్టుకు) కాలువద్వార దినమునకు రు. 75 లక్షల వరకు వచ్చెడి ఆదాయమును కోల్పోయెను. ఈ ఆదాయము చాలావరకు అరబ్బు దేశముల నుండి వచ్చుచుండెను.

ప్రస్తుతము ప్రెసిడెంటు సాదత్ ఇశ్రాయేలీచేయుల ఆక్రమించబడిన ప్రదేశములను తిరిగి జయించుదునని వాగ్దానము చేసెను. ఈజిప్టుకు సలహాదారులుగా నున్న రష్యావారు ఈజిప్టు బలమును ఇశ్రాయేలు యుద్ధ నైపుణ్యతను గ్రహించిన వారగుటచే ఈ ప్రయత్నము నుండి సాదత్‌ను

అపజయ మొందుదురని భయముచే వెనుకకు లాగుచున్నారు. కావున కైరోలో ఈ సమస్యపై తీవ్ర ఆందోళన చెలరేగుచున్నది.

ఈజిప్టు దేశమందు, రష్యా దేశపు ప్రభావము రోజు రోజుకు ఎక్కువగుచున్నదనెడి ఆందోళన హెచ్చెను. ఒకవేళ ఇశ్రాయేలీయులను అరబ్బులు రష్యా సహాయముచే జయించినను, రష్యా తరువాత పాలస్తీనాను ఆక్రమించుకొని ఈ ప్రాంతములో అరబ్బుల మధ్య బలమైన దేశముగా యుండి, చివరకు అరబ్బులను తమ రాజ్యమును సహా కోల్పోయే సూచన కలదని గుర్తించిరి.

రష్యా సహాయము లేకుండ అరబ్బులు ఇశ్రాయేలీయులను జయించుటకు వీలు కాదని ప్రెసిడెంటు సాదత్‌కు తెలిసినను వారిద్వార రాబోవు దినములలో గొప్ప విపత్తును ఎదుర్కొనవలసి యుండుననెడి సత్యమును కూడ గ్రహించెను.

1972 లో రష్యా సలహాదారులను, యుద్ధనేర్పరి తనము గలవారిని దాదాపు 15-20,000 వరకు ఈజిప్టులో నుండి వెడలిపొమ్మని సాదత్ ఆజ్ఞ యిచ్చెను. వీరిలో చాలామంది యుద్ధాయుధములు, 170 SAM కేంద్రములను (ఒకొక్క కేంద్రము 8 అస్త్రములను ప్రయోగించ వీలు కలిగినది) నడుపువారునై యుండిరి. ఈ ఆయుధ కేంద్రములు కైరో పట్టణము చుట్టు, సూయజు కాలువకు అభిముఖముగా నిర్మించబడినవి. జూలై 1972 లో సాదత్ తన దేశము స్వయముగా నిలబడుటకు తీర్మానించుకొనినదని, రష్యా ఆధీనములో నుండి పని చేయుటకు ఇష్టము లేదని చెప్పి, వెంటనే తమ సైనికాధికారులకు, రష్యావారు తాము ఆక్రమించుకొన్న పనులను ఒప్పజెప్పి దేశమును వదలి వెళ్ళిపోవలసినదిగా ఆజ్ఞ యిచ్చెను. వెంటనే ఈజిప్టు సైనికాధికారులు రష్యావారిచే నడుపబడుచున్న ఒక వేయి రెండువందల కోట్ల విలువగల యుద్ధ సామాగ్రిని స్వాధీన పర్చుకొనిరి. రష్యావారు వారి దేశమునకు వెళ్ళిపోవుచు, వారి యుద్ధాయుధములు కొన్ని వారి వెంట తీసుకొని పోయిరి. ఇశ్రాయేలు ప్రధాని గోల్డామేర్ ఈజిప్టుతో శాంతి నెలకొల్పుటకు రాయబారిని పంపెను. కాని సాదత్, "తన భూమిని ఒకరు ఆక్రమించుకొన్న తరు

వాత రాయబారములు, శాంతిమాటలు ఏలాగు జరుపగలరని చెప్పి తిరస్కరించి, అవసరమున్న ఈజిప్టు దేశము ఒంటిగా యుద్ధము చేయుటకు సిద్ధముగా యున్నదని" తెలిపెను.

ఈజిప్టు, రాయబారము ద్వార శాంతి చర్చల ద్వార తాను కోల్పోయిన కొన్ని పెట్రోలు బావులను సూయజ్ కాలువను తిరిగి రాబట్టుకొన వచ్చును— ఈలాగు చేయుట ఈజిప్టునకు లాభము. కాని ఈజిప్టు ఇట్లు చేయుటకు ఇష్టపడుటలేదు. కావున ఈజిప్టు ఇశ్రాయేలును జయించుటకు ఎన్నో ప్రయత్నములు స్వయముగా చేయును. చివరకు రష్యా సహాయమును కోరి ఇశ్రాయేలీయులతో యుద్ధము చేయుటచే, స్వనాశనమునకు దారి తీయును. రష్యా, ఈజిప్టునందు తన ధనమును యుద్ధ పరికరములను ఎంతగానో వ్యయపరచి ఆ స్థలమును తేలికగా విడువనేరదు. లేక ఇశ్రాయేలీయుల చేతులలోనికి పోవుట చూడలేదు, కావున తన బలమంతటితో ఇశ్రాయేలుతో ముఖాముఖిగా యుద్ధము చేయును.

# యూరపు వ్యాపార సంస మరియు పది రాజ్యముల ఆధిపత్యము యొక్క అవతరణ

"రాజా, తాము చూచుచుండగా బ్రహ్మాండమగు ఒక ప్రతిమ కనబడెను గదా... ఆ ప్రతిమ యొక్క శిరస్సు మేలిమి బంగారు మయమైనదియు దాని రొమ్మును, భుజములును వెండి పియును, దాని ఉదరమును, తొడలును ఇత్తడివియు, దాని మోకాళ్ళు ఇనుపవియును, దాని పాదములలో ఒక భాగము మట్టివియునై యుండెను. మరియు చేతి సహాయములేక తీయబడిన



ఒక రాయి, ఇనుమును మట్టియు కలిసిన ఆ ప్రతిమ యొక్క పాదముల మీద పడి దాని పాదములను తుత్తునియలుగా విరుగకొట్టినట్లు తమకు కనబడెను...పాదములును, వ్రేళ్ళును కొంతమట్టునకు కుమ్మరి మట్టిది గాను, కొంతమట్టునకు ఇనుపదిగా నున్నట్టు తమరికి కనబడెను. కనుక ఆ రాజ్యములో భేదము ఉండును.. పాదముల వ్రేళ్ళు కొంతమట్టునకు ఇనుపవిగాను కొంతమట్టునకు మట్టివిగాను ఉన్నట్లు ఆ రాజ్యము ఒక విషయములో బలముగాను ఒక విషయములో నీరసముగాను ఉండును... ఆ రాజుల కాలములలో పరలోకమందున్న దేవుడు ఒక రాజ్యమును స్థాపించును. దాని కెన్నటికిని నాశనము కలుగదు ఆ రాజ్యము దాని పొందినవారికి కాక మరి ఎవ్వరికి చెందదు. అది ముందు చెప్పిన రాజ్యములన్నిటిని పగుల గొట్టి నిర్మూలముచేయును. గాని అది యుగ ముల వరకు నిలుచును" దానియేలు 2:31-44.

---

---

"పిమ్మట రాత్రియందు నాకు దర్శనములు కలిగినప్పుడు నేను చూచు చుండగా ఘోరమును, భయంకరమునగు నాలుగవ జంతువు కనబడెను. అది తనకుముందుగా ఉండిన ఇతరజంతువులకు భిన్నమైనది. అది మహా బలమహాత్మ్యముకలది. దానికి పెద్ద ఇనుపదంతములును పదికొమ్ములు నుండెను. అది సమస్తమును భక్షించుచు తుత్తునియలుగా చేయుచు మిగిలినదానిని కాళ్ళక్రింద అణగ ద్రొక్కుచుండెను. నేను ఈ కొమ్ము లను కనిపెట్టగా ఒక చిన్న కొమ్ము వాటిమధ్యన లేచెను. దానికి స్థలము ఇచ్చుటకై ఆ కొమ్ములలో మూడు పెరికివేయబడినవి. ఈ కొమ్ము నకు మానవుల కన్నులవంటి కన్నులును, గర్వముగా మాట్లాడు నోరును ఉండెను. ఇంకసింహాసనములను వేయుటచూచితిని; మహావృద్ధుడు ఒకడు కూర్చుండెను ఆయన వస్త్రము హిమమువలె ధవళముగాను, ఆయన తల వెండ్రుకలు శుద్ధమైన గొఱ్ఱె బొచ్చువలె తెల్లగాను ఉండెను. ఆయన సింహాసనము అగ్నిజ్వాలలవలె మండుచుండెను. దాని చక్రములు అగ్ని వలె నుండెను. అగ్నివంటి ప్రవాహము ఆయనయొద్దనుండి ప్రవహించు చుండెను వేవేల కొలది ఆయనకు పరిచారకులు ఉండిరి కోట్లకొలది

మనుష్యులు ఆయనయెదుట నిలిచిరి. తీర్పుతీర్చుటకై గ్రంథములు తెరువబడెను. అప్పుడు నేను చూచుచుండగా ఆ కొమ్ము పలుకుచున్న మహాగర్వపు మాటల నిమిత్తము వారు ఆ జంతువును చంపినట్లు కనబడెను. తరువాత దాని కళేబరము మండుచున్న అగ్నిలో వేయబడెను. మిగిలిన ఆ జంతువుల ప్రభుత్వము తొలగిపోయెను, సమయము వచ్చువరకు అవి సజీవుల మధ్యను ఉండవలెనని యొక సమయము, ఒక కాలము వాటికి ఏర్పాటాయెను. ...... ఆ పది కొమ్ములు ఆ రాజ్యము నుండి పుట్టబోవు పదిమంది రాజులను సూచించుచున్నవి. కడపట ముందుగా నున్న రాజులకు భిన్నమగు మరియొక రాజు పుట్టి ఆ ముగ్గురి రాజులను పడద్రోయును. ఆ రాజు మహోన్నతునికి విరోధముగా మాట్లాడుచు మహోన్నతుని భక్తులను నలుగగొట్టును''. దానియేలు 7వ అధ్యాయము.

---

''మరియు పదికొమ్ములును, ఏడుతలలును కల క్రూరమృగము సముద్రము నుండి పైకి వచ్చుట చూచితిని. దాని కొమ్ములమీద పది కిరీటములును, దాని తలమీద దేవదూషణములగు పేర్లు ఉండెను. ... ఆ మృగమునకు (సాతాను) అధికారము ఇచ్చినందున వారు ఘటసర్పమునకు నమస్కారము చేసిరి. మరియు వారు ఈ మృగముతో సాటి ఎవడు? దానితో యుద్ధము చేయగలవాడు ఎవడు? అని చెప్పుకొనుచు ఆ మృగమునకు నమస్కారము చేసిరి. డంబపు మాటలను, దేవదూషణములు పలుకు ఒక నోరు దానికి ఇయ్యబడెను. మరియు నలుబది రెండు నెలలు తన కార్యము జరుప నధికారము దానికి ఏర్పాటైనది''. ప్రకటన 13వ అధ్యాయము.

---

'' ... ఏడు తలలును పది కొమ్ములును కలిగి దాని మోయుచున్న క్రూర మృగమును గూర్చిన మర్మమును నేను నీకు తెలిపెదను. నీవు చూచిన ఆ మృగము ఉండెను కాని ఇప్పుడు లేదు అయితే అది అగాధ జలములో నుండి పైకి వచ్చుటకును, నాశనమునకు పోవుటకు సిద్ధముగానున్నది. ఉండినదియు ఇప్పుడులేనిదియునైన ఈ క్రూరమృగము ఆ ఏడుగురితో పాటు ఒకడునై యుండి తానే ఎనిమిదవ రాజగుచు నాశనమునకు పోవును. నీవు చూచిన ఆ పది కొమ్ములు పదిమంది రాజులు. వారు ఇదివరకు రాజ్యము పొందలేదు కాని ఒక గడియ క్రూర మృగముతోకూడ రాజులవలె అధికారము పొందుదురు. వీరు ఏకాభిప్రాయము కలవారై తమ బలమును. అధికారమును ఆ మృగమునకు అప్పగింతురు'' ప్రకటన 17:7-14.

పై నాలుగు బైబిలు ప్రవచనములు యూరోపు ఖండమందు ఒక బలమైన ఐక్య పాలనా వ్యవస్థ అవతరణను గూర్చి తెలుపబడి యున్నది.

నెబుకద్నెజరు రాజు తాను కలలో చూచిన ప్రతిమ, నాలుగు గొప్ప రాజ్యముల అవతరణములను సూచించెను. అవి—అత్యున్నత స్థితిలో యున్న బబులోనియా రాజ్యము బంగారముతో పోల్చబడినదిగా, దాని తరువాత మీదో పర్షియన్ రాజ్యము వెండితో పోల్చబడినదిగా, గ్రీకు రాజ్యము ఇత్తడితో పోల్చబడినదిగా, చివరిగా రోమా సామ్రాజ్యము ఇనుముతో పోల్చబడినదిగా యుండి, నాలుగు వివిధ రాజ్యములను గూర్చి తెలుపుచున్నవి. రెండు కాళ్ళు రోమా రాజ్యము క్రీ. శ. 364లో రెండు భాగములుగా చీలిన భావమును తెలుపుచున్నది.

ప్రవచనములోని పది వ్రేళ్ళు మరి పది కొమ్ములు, పది దేశములు ఒకటియై ఒక ధ్వజము క్రింద, ఒక్క మాట మీద నడుచు సంస్థగా ఏకాభిప్రాయముతో యుండి, అంత్య దినములయందు అవతరించుననెడి భావమును తెలుపుచున్నది. రోమా సామ్రాజ్యము 5 వ శతాబ్దములో పడిపోయెను. అదే తిరిగి అంత్యకాలములో పునరుద్ధరింపబడును.

చేతి సహాయము లేకుండ తీయబడిన రాయి రాబోవు మెస్సీయా రారాజు, ప్రభువులకు ప్రభువైన యేసు క్రీస్తును సూచించుచున్నది. క్రీస్తు రాజ్యము పై వివరించిన అన్ని రాజ్యములను నిర్మూలనము చేసి తన నీతి రాజ్యమును లోకమందు స్థాపించును. ఈ రాజ్యము ఆదినుండి యున్నదని తెలుపుచు, ఆయన (యేసు క్రీస్తు) నిత్యత్వమును సూచించుచున్నది.

దానియేలు 7 వ అధ్యాయములో నాలుగు రాజ్యముల విషయము గూర్చి వివరించబడి యున్నది. అవి—బాబులోనియా, మీదో పర్షియా, గ్రీక్, రోమా సామ్రాజ్యములు, నాలుగవ మృగము రోమా సామ్రాజ్యమును సూచించుచున్నది. దాని నుండి ఒకడు మిక్కిలి బలిష్ఠుడు (చిన్నకొమ్ము) అవతరించి దేవదూషణ చేయుచు తన్ను తాను ప్రపంచమందు హెచ్చించుకొనును. వీడు దేవునికి విరోధియై క్రీస్తుకు విరోధిగా యుండును. వీని అవతరణ వివరములు ప్రకటన 13_17 అధ్యాయములో వివరించబడినవి. వీడు ప్రపంచ నియంతగా 3 1/2 సం॥లు మహా అధికారముతో ఏలును. అంత్య దినమున చేతి సహాయము లేకుండ తీయబడిన రాయి

అగు యేసు క్రీస్తు వీనిని జయించి తన నీతి రాజ్యమును భూమిపై స్థాపించును.
మృగము యొక్క ఏడు తలలు రోమాలోని ఏడు కొండలుగా గుర్తించనైనది. రోమా పట్టణము, పూర్వము రోమా సామ్రాజ్యమునకు ముఖ్య పట్టణముగా యుండెను. తిరిగి అంత్యకాలమందు 10 రాజ్యములు ఉద్ధరింపబడిన వాని ఆదిపత్యమునకు రోమా ముఖ్య పట్టణముగా చేయబడి అచ్చట నుండే ప్రపంచము పరిపాలింపబడునని ప్రవచనముద్వార తెలియనగును.

ప్రస్తుత కాలమందున్న మనము యూరపులో యూరోపియన్ కామన్ మార్కెట్ (European Common Market) పేరుతో పది రాజ్యముల సంస్థ అవతరించుట చూచుచున్నాము. 1957 మార్చిలో ఆరు దేశముల నుండి వచ్చిన యూరపు రాజ నీతిజ్ఞులు యూరొపు దేశముల ఎకానమి కమిటీ (అర్థిక వ్యవస్థ) అను పేరుతో (European Common Market) నిర్మించి చారిత్రాత్మకముగా ఒక సంస్థను నెలకొల్పిరి. ఈ సంస్థా పత్రములను రోమా ఒడంబడిక (The treaty of Rome) అనెడి పేరుతో పిలిచిరి. కామన్ మార్కెట్ 1958 జనవరి మొదటి తేదీన అవతరించెను. అప్పటి నుండి దీనియందు సభ్యత్వము ఉన్న యూరప్ దేశముల వ్యాపార మరి ఇతర సంబంధమైన హెచ్చు తగ్గులను, భేదములను, రూపు మాపుటకు చాలా వరకు తోడ్పడెను. 1960లో ఫ్రాన్స్ దేశపు ప్రెసిడెంటు చార్లెస్ డిగాల్ బ్రిటన్ దేశమును ఈ సంస్థలోనికి చేరకుండ రెండు పర్యాయములు వీటో (VETO) చేసెను. డిగాల్ చనిపోయిన పిమ్మట బ్రిటన్ దేశము EEC లోనికి చేరగల్గెను.

ముందుగా ఈ సంస్థలో సభ్యత్వమున్నవారు—ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, ఇటలీ, హాలాండు, లక్సెంబర్గ బెల్జియం మొదలగు దేశములు: తరువాత బ్రిటన్, ఐర్లాండు డెన్మార్క్, నార్వే అను నాలుగు దేశములు EEC సభ్యత్వము నాశించి, ఈ సంస్థల నిబంధనలు తమ పార్లమెంటు ద్వార అంగీకరించునట్లుగా చూచి సభ్యత్వమును కోరిరి ఇప్పుడు 1973 జనవరి ఒకటి నుండి మనము యూరోపు కామన్ మార్కెట్ సంస్థ కార్యములను చూడవచ్చును.

EEC కి వేరుగా పరిపాలన నిమిత్తమై ఎన్నుకొనబడిన మంత్రులు, యూరోపు పార్లమెంటు, న్యాయశాఖ మొదలగునవి కూడ కలవు. దీనియందు సభ్యత్వము నొందిన ఏ దేశము తిరిగి ఉపసంహరించు కొనుటకు వీలులేదు. ఈ సంస్థయొక్క అవతరణ యూరపు దేశముల వ్యాపార అభివృద్ధిని కావించుటయే కాక, వాణిజ్య రాజకీయ రంగము లందు కృషి సల్పుచు, యూరపు దేశములన్నియు ఏకాభిప్రాయముతో ఒక గొప్ప శక్తిగా ప్రపంచమందు రూపొందించవలెననెడి కాంక్ష కలి యున్నది. ప్రస్తుతమందు ఈ సంస్థ పరిపాలనా ముఖ్యశాఖ బ్రస్సెల్సు (Brussels) నందు కలదు. 1970 లో ఒక ఇటలీ దేశపువాడు ప్రెసి డెంటుగా ఈ సంస్థకు ఎన్నికయ్యెను.

ఈ సంస్థ సభ్యత్వము నొందిన పై దేశముల జనసంఖ్య 25 కోట్లు. వీని వాణిజ్య రాజకీయ రంగముల పెట్టుబడి వరుసగా 660 బిలియనుల డాలర్లు (దాదాపు 4950 కరాబులు) మరియు ఒక బిలియను (లక్షకోట్లు) డాలర్లుగా యున్నది.

EEC సంస్థయొక్క ముఖ్యోద్దేశములు—(1) దీని సభ్యదేశములను వాణిజ్య రంగములందు అభివృద్ధి చేయుట. (2) 1970లో దీనియందు సభ్యత్వము యున్న దేశములన్నింటికి ఒకే రకపు నాణెముల చెలామణి కలిగియుండు టకు కృషి చేయుట. (3) ప్రపంచ రాజకీయ రంగములందు ఏకాభి ప్రాయము కలిగియుండుట. (4) సైన్య సహకార ఐక్యత, సైనిక సిబ్బంది, అణుశక్తి మొదలగునవన్నియు ఏకాభిప్రాయముతో పెంచుట, మొదలగునవి.

ఫ్రాన్సు దేశపు ప్రెసిడెంటు జార్జెస్ పాంపిడూ ఈ సంస్థకు ఫ్రాన్సు ప్రధానపాత్ర పొందునట్లుగా రాజకీయముగా కృషి సల్పుచున్నాడు. మరి కొన్ని దినములలో వేరె దేశములు EEC సంస్థలోనికి సహకార సభ్యత్వ మును పొందబోవుచున్నట్లు కనిపించుచున్నది. వీనిలో—పోర్చుగల్, స్వీడన్, స్పెయిన్, స్విట్జర్లాండు, ఇస్రాయేలు మొదలగు దేశములు సభ్యత్వము కోరనై యున్నవి. 1970 జూలై 19 వ తారీఖున ఇస్రాయేలు EEC లో సహకార సంఘములో సభ్యత్వము నొందుటకు ఒప్పుదల నొందెను.

ప్రకటన 17వ అధ్యాయములో ప్రవచనము చెప్పిన రీతిగా, వేశ్యగా వివరించిన "స్త్రీ" రోమాలో నున్న క్రైస్తవ మతశాఖ (Roman Catholic) గా గుర్తించనైనది. ఇది (రోమన్ క్యాథలిక్ శాఖ) అంత్య కాలమందు EEC సంస్థ అవతరణ, నిర్వర్తనములో చాలావరకు తోడ్పడును నేడు EEC లో సభ్యత్వము కలిగిన తొమ్మిది రాజ్యములు 70% రోమన్ కాథలిక్ జనాబా కలిగిన రాజ్యములుగా యున్నవి. వీని వర్ల్డ్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్ (World Council of Churches) నివాస స్థానము మరియు దాని కార్యాలయములు యూరోపుకు నట్టనడుమ నున్న జెనీవా పట్టణమందు కలవు

EEC సభ్యత్వము నొందిన ఈ తొమ్మిది దేశములే స్థిరముగా యుండు నని చెప్పలేము. కాని ప్రవచన నెరవేర్పుకొరకు రాజకీయ, వాణిజ్య, మతరంగములందు ఏకాభిప్రాయము కలిగి ఈ భావమునే ప్రపంచమం దంతట వర్తింపచేయుటకు పూనుకొనుటలో EEC అవతరణ ప్రధాన స్థానము వహించుచున్నట్లుగా గుర్తించగలము. అయితే ఇంతకన్న శక్తివంతమైన సంస్థ ప్రవచన నెరవేర్పుకొరకు త్వరలో ఏర్పడబోవు చున్నదని తెలిసికొనవలెను.

రాబోవు దినములలో యూరోపునుండి ఒక మహా బలమైన నియంత (dictator) రాబోవుచున్నాడు అతని మాటకు ప్రపంచమందలి ఏరాజ్య మైనను ఎదురు చెప్పలేనంత బలిష్ఠుడుగా నుండును. ఇతను మొదట శాంతిని కోరువాడుగా నుండి వాణిజ్య రాజకీయ రంగములలో గొప్ప మార్పులను సంపాదించి పేరు తెచ్చుకొనునని ప్రవచనము వివరించు చున్నది. ఇతడే తిరిగి అకస్మాత్తుగా సాతాను చేత ఆవరింపబడినవాడుగా మారి, దౌర్జన్య రూపముల ద్వార తన ఉద్దేశములను నెరవేర్చుకొనును. ఇతనికి బైబిలులో మృగమని, క్రీస్తు విరోధని, పాప పురుషుడని ఇంకా మరికొన్ని పేర్లుకలవు. ఇతడు ప్రపంచమును 3 1/2 సం॥ తన శక్తి ద్వార పూర్తిగా స్వాధీనపరచుకొని పరిపాలించును. కాని క్రీస్తు రాక డతో ఇతని రాజ్యము అంతమొందును.

# యెరూషలేము—ఒక బరువైన రాయి

> "నేను యెరూషలేము చుట్టునున్న జనులకందరికి మత్తు పుట్టించు పాత్రగా చేయబోవుచున్నాను; శత్రువులు యెరూషలేమునకు ముట్టడివేయగా అది యూదామీదికి వచ్చును. ఆ దినమందు నేను యెరూషలేమును సమస్తమైన జనులకు బరువైన రాయిగా చేతును. దానిని ఎత్తి మోయువారందరు మిక్కిలి గాయపడుదురు. భూజనులందరును దానికి విరోధులై కూడుదురు." జెకర్యా 12:2-3.

యెరూషలేమంటే, శాంతికి నిలయము అనియు శాంతి కాస్పదమైన పట్టణమని అర్థమిచ్చును. ఈ పట్టణము 3500 సం॥ చరిత్రలో 46 సార్లు ఇతరులచే పట్టబడి నాశనము కావింపబడి 25 వేర్వేరు రాజుల చేతిలోనికి మార్చబడినది. ఈ యెరూషలేము పరిశుద్ధ పట్టణముగా పిలువబడెను. చాలాకాలము క్రితము మోషేద్వార దేవుడు ఈ పట్టణమందు తన సన్నిధిని ఉంచుదునని వాగ్దానము చేసెను.

"....మీ దహన బలులను మీ బలులను మీ దశమ భాగములను ప్రతిష్ఠితములుగా మీరు చేయు నైవేద్యములను మీరు యెహోవాకు మ్రొక్కుకొను మీ శ్రేష్ఠమైన మ్రొక్కుబళ్ళను మీ దేవుడైన యెహోవా తన నామమునకు నివాస స్థానముగా ఏర్పరచుకొను స్థలమునకే మీరు తీసికొని రావలెను.

యెహోవా నీ గోత్రములలో ఒక దానియందు ఏర్పరచుకొను స్థలముననే నీ దహన బలులను అర్పించి నేను మీ కాజ్ఞాపించుచున్న సమస్తమును అక్కడనే జరిగింపవలెను" ద్వితీయోపదేశ కాండము 12:11, 14.

పై విధముగా మోషే ఇశ్రాయేలీయులకు దేవుని పట్టణ విషయమై ఆయన సన్నిధి గూర్చి తెలిపిన 400 సం॥ తరువాత దావీదు రాజు యెరూషలేము పట్టణమును స్వాధీనపరచుకొని తన ముఖ్య పట్టణముగా చేసుకొనెను.

దావీదు రాజు కుమారుడైన సొలొమోను రాజు యెరూషలేము పట్టణము నందు మోరియా కొండపై ఒక దేవాలయమును కట్టించెను. అబ్రహాము తన కుమారుడైన ఇస్సాకును బలి అర్పించుటకు ఈ కొండమీదికే 850 సం॥లకు పూర్వము తెచ్చెను. దేవుడు అబ్రహాము విశ్వాసమును పరీక్షించుటకు తన కుమారుని అర్పణగా అర్పించుమని కోరగా అబ్రహాము దేవుని మాటకు లోబడి ఈ కొండపైకి తన కుమారుడైన ఇస్సాకును తెచ్చి, బలిపీఠమును నిర్మించి ఇస్సాకును దానిపై బంధించిపెట్టి ఇస్సాకును బలిగా అర్పించుటకు తన కత్తిని పైకెత్తెను. అప్పుడు దేవుడు, "అబ్రహామా .... ఆ చిన్నవాని మీద చేయి వేయకుము. అతని నేమియు చేయకుము. నీకు ఒక్కడై యున్న నీ కుమారుని నా కియ్య వెనుతీయలేదు కనుక నీవు దేవునికి భయపడువాడవని ఇందువలన నాకు కనబడుచున్నదనెను". ఆదికాండము 22 అధ్యాయము.

సొలొమోను రాజు మోరియా కొండపైన నిర్మించిన దేవాలయము దేవునికి ప్రతిష్టించగా అది దేవుని మహిమతో నిండెను.

ఆ రోజు దేవుడు సొలొమోను రాజుకు ప్రత్యక్షమై, ఈలాగు సెలవిచ్చెను. "నేను నీ విన్నపమును అంగీకరించి ఈ స్థలమును నాకు బలులు అర్పించు మందిరముగా కోరుకుంటిని" 2 దిన వృత్తాంతములు 7:12.

క్రీ. పూ. 587 లో నెబుకద్నెజరు రాజుచేత యూదులు పట్టబడి దాస్యమునకు కొనిపోబడిన రోజులలో సొలొమోను దేవాలయము నాశనము చేయబడెను. 72 సం॥ల తరువాత దావీదు రాజు సంతతి వాడగు జెరుబ్బాబెలు రెండవసారి దేవాలయమును నిర్మింపవలసినదిగా ఆజ్ఞ యిచ్చెను. ఈ దేవాలయమునే ప్రస్తుతకాలమందు హేరోదురాజు తిరిగి నిర్మించుటచే దీనికి హేరోదు దేవాలయము అని పేరువచ్చెను. క్రీ శ 66 నుండి 70 సం॥లలో యూదులు రోమా రాజ్యముపై తిరుగుబాటు చేసిరి. అప్పుడు యెరూషలేము పట్టణము పూర్తిగా రోమా రాజ్యముచే ధ్వంసము గావించబడెను. అప్పుడే దేవాలయపు ఒక వెలుపలి గోడ తప్ప తక్కినదంతయు సమూల నాశనము కావించబడెను. ధ్వంసము చేయగా మిగిలిన పడమర గోడనే, నేడు ఏడ్పుగోడ (Wailing wall) అని పిలువబడుచున్నది.

క్రీ. శ. 638 లో అరబ్_మహమ్మదీయుడగు కలీఫా ఉమర్ అనే వానిచే యెరూషలేము పట్టణము పట్టబడెను. తిరిగి క్రీ. శ. 691 సం॥లో ఐదవ ఖలీఫాయగు అబ్దుల్ మాలిక్ అనువానిచే ఈ పట్టణము పట్టబడి సొలొమోను రాజుచే కట్టబడిన దేవాలయపు స్థానమందు, దేవాలయపు అతి పరిశుద్ధ స్థలమందు అనగా, అబ్రాహాము తన కుమారుడైన ఇస్సాకును ఏ రాతిపైన బలియర్పించుటకు ఏర్పాటు చేసెనో, ఆ రాతి మీదనే మసీదును నిర్మించెను. అందుకొరకే ఈ మసీదునకు డోమ్ ఆఫ్ ద రాక్ (Dome of the Rock) అనే పేరు వచ్చెను. ఇస్లాము మతస్థులు, ఈ స్థలము నుండే తమ ప్రవక్తయగు మహమ్మద్ పరలోకమునకు ఆరోహణమైనాడని నమ్మెదురు. ఈ కారణము చేతనే, ముస్లిము మతస్థులు మక్కా, మదీనా స్థలముల తర్వాత యెరూషలేమును తమ మూడవ పుణ్యక్షేత్రముగా భావింతురు.

యూదులు యెరూషలేము పట్టణమును తమ దేవుని పట్టణముగా విశ్వసించెదరు. క్రైస్తవులకు యెరూషలేము పట్టణము ప్రత్యేక ఆకర్షణముగా యుండుటకు గల కారణము, తమ ప్రభువగు యేసు క్రీస్తు పిలాతురాజు ద్వారా తీర్పు నొంది సిలువ శ్రమలను పొంది, మరణించి పాతిపెట్టబడి, మూడవ రోజున ఇచ్చటనే తిరిగిలేచెను. యేసు ప్రభువు శరీరము యుంచబడిన సమాధి, సమాధి యున్న తోట మొ॥ చారిత్రాత్మకమైన స్థలములు యెరూషలేమునందు యున్నవి. మృత్యుంజయుడైన యేసు ప్రభువు, సమాధినుండి మూడవనాడు లేచి, సజీవునిగా తన శిష్యులకు కనపర్చుకొనుటయే కాక, 500 మందికి తన్ను తాను సజీవునిగా కనపర్చుకొనెను. యెరూషలేమునకు అభిముఖముగా యున్న ఒలీవకొండ మీదినుండి యేసు ప్రభువు పరలోకమునకు తాను సమాధినుండి లేచిన 40 రోజుల తరువాత ఆరోహణమయ్యెను (అపొస్తలుల కార్యములు 1:9_11) యేసు ప్రభువు తిరిగి రెండవ పర్యాయము ఈ లోకమునకు వచ్చునని, యెరూషలేమును తన ముఖ్యపట్టణముగా చేసికొని ప్రపంచమంతట తన నీతి రాజ్యము స్థాపించుననెడి వాగ్దానము కలదు.

క్రీ. శ. 1917 వరకు యెరూషలేము పట్టణము టర్కీవారి అధీనములో నుండెను. ఈ దినములలోనే, ఈ దేశము బ్రిటీషువారిచే గెల్వబడి

వారి స్వాధీనములోనికి వచ్చెను 1947 లో పాలస్తీనా దేశము అరబ్బులకు, యూదులకు పంచి ఇవ్వబడెను. 1948 మే నెలలో, బ్రిటీషువారి పరిపాలన అంతమొంది, ఇశ్రాయేలీయులకు స్వతంత్రము లభించెను. అప్పటినుండే ఇశ్రాయేలీయుల దేశము అవతరించెను. వెంటనే చుట్టునున్న అరబ్బు దేశములు ఇశ్రాయేలును ధ్వంసము చేయవలెనను సంకల్పముతో దానిపై దాడి జరిపిరి. కాని ఇశ్రాయేలీయుల చేతిలో వారు పూర్తిగా ఓడిపోయి నష్టపోయిరి. ఈ సమయమందు పాత యెరూషలేము పట్టణము జోర్డాన్ దేశపు స్వాధీనములో యుండెను.

ఇప్పటి నూతన యెరూషలేము (New Jerusalem) పట్టణము, పాత పట్టణమునకు పడమరివైపునకు కట్టబడి ఇశ్రాయేలీయుల చేతిలో యున్నది ఈ విధముగా మనుష్యుని సహాయము లేకుండ ఈ రెండు పట్టణములు వేరు చేయబడినవి. ఇశ్రాయేలీయులు ఏ ప్రాంతమయినను వదులవచ్చునేమో కాని యెరూషలేము ప్రాంతమును మాత్రము వదల కూడదని తీర్మానించుకొన్నారు. 1967 లో ఆరు రోజుల యుద్ధము జరిగి నప్పుడు ఇశ్రాయేలీయులు, పాత యెరూషలేము పట్టణము సహా జోర్డాన్ నుండి స్వాధీనపరచుకొనిరి. వెంటనే కొన్ని వారములలో ఈ ప్రాంతము ఇశ్రాయేలీయుల పరిపాలన క్రిందికి వచ్చెను. ఐక్యరాజ్య సమితి ద్వారా తీర్మానించబడినట్లు ఆరు రోజుల యుద్ధములో ఆక్రమించుకొన్న ప్రాంతములను ఇశ్రాయేలు అరబ్బులకు తిరిగి యిచ్చివేయవలసి యుండెను. కాని వారు యెరూషలేమును మాత్రము వదలదలచుకొనలేదు.

ఈ విధముగా యెరూషలేము ప్రపంచ రాజకీయ రంగమందు బరువైరాయి (a burdensome stone) గా తీరని సమస్యగా అరబ్బులకు, ఇశ్రాయేలుకు, రష్యా, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, ఇంక ఐక్యరాజ్య సమితి దేశములకు యున్నది.

యెరూషలేము, క్రైస్తవులకు, మహమ్మదీయులకు, యూదులకు మత సంబంధమైన ప్రాంతముగా పరిగణించబడుటచే, అందరికి దీనియందు ఆసక్తి కలదు. మత సంబంధమైన కారణములను బట్టి, ఇశ్రాయేలు దేశము ఈ ప్రాంతములను ఏ మతస్థులైన దర్శించుటకు వీలును కల్పించుటయే కాక, మత సంబంధమైన స్థలములను, మసీదులను, కట్టడము

లను భద్రపర్చి యుంచునట్లుగా, ప్రత్యేకముగా మహమ్మదీయులకు ముఖ్యమైన డోమ్ ఆఫ్ ద రాక్ అనే మసీదును కూడ కాపాడుదునని అభయమిచ్చెను. డోమ్ ఆఫ్ ద రాక్ (Dome of the Rock) మసీదు, పూర్వపు యూదుల దేవాలయపు స్థానముననే కట్టబడినది. యూదులు తిరిగి తమ దేవాలయమును కట్టుకొనిన, ఇప్పుడున్న డోమ్ ఆఫ్ ద రాక్ మసీదు స్థానముననే కట్టవలెనని, ఈ ప్రయత్నము వీరు 1900 సం॥ల నుండి చేయుచున్నారు.

రాబోవు దినములలో, ఇశ్రాయేలీయులకు అరబ్బులకు జరుగు యుద్ధమందు తాము ఇరువురిపై ప్రయోగించే యుద్ధ అస్త్రములవలన డోమ్ ఆఫ్ ద రాక్ మసీదు, ధ్వంసము కావింపబడునని కొందరు తలంతురు.

బైబిలు ప్రవచనము ప్రకారము భూలోకములోనికి వచ్చెడి 7 సం॥ల శ్రమల కాలములో యెరూషలేములో పాతనిబంధన ఆచారముల ననుసరించి యూదులు తాము దేవాలయమును కలిగియుందురని, దానిలో లేవీ యాజకత్వము చొప్పున బలియర్పణలు జరుగునని తెల్పబడినది. ఈ ప్రవచన నెరవేర్పుకొరకే అన్నట్లు, నేడు ఇశ్రాయేలు దేశమందు, యూదులు లేవీ సంతతివారికి యాజకత్వమందు తర్ఫీతు ఇచ్చుచున్నారు.

శ్రమల రోజులలో ప్రవక్తయైన జెకర్యా ద్వార ప్రవచింపబడిన రీతిగా యెరూషలేము చివరి పర్యాయముగా పెక్కు దేశముల ద్వార పట్టబడి నాశనము కావింపబడునని యున్నది.

---

"ఇదిగో యెహోవా దినము వచ్చుచున్నది. అందు మీయొద్ద దోచబడిన సొమ్ము పట్టణములోనే విభాగింపబడును. ఏలయనగా యెరూషలేము మీద యుద్ధము చేయుటకు నేను అన్యజనుల నందరిని (All Nations) సమకూర్చబోవుచున్నాను. పట్టణము పట్టబడును. ఇండ్లు కొల్లగొట్టబడును, స్త్రీలు చెరుపబడుదురు. పట్టణములో సగముమంది చెరపట్టబడి పోవుదురు. అయితే శేషించువారు నిర్మూలము కాకుండ పట్టణములో నిలుతురు. అప్పుడు యెహోవా బయలుదేరి తాను యుద్ధకాలమున యుద్ధము చేయు రీతిగా ఆ అన్యజనులతో యుద్ధము చేయును." జెకర్యా 14:1-3.

---

"సీయోను నివాసులారా ఉత్సాహధ్వని చేయుడి, ఇశ్రాయేలీయులారా, జయ ధ్వని చేయుడి, యెరూషలేము నివాసులారా, పూర్ణహృదయముతో సంతోషించి గంతులు వేయుడి, తాను మీకు విధించిన శిక్షను యెహోవా కొట్టివేసియున్నాడు. ఇశ్రాయేలుకు రాజైన యెహోవా మీ మధ్య ఉన్నాడు, ఇక మీదట మీకు అపాయము సంభవించదు." జెఫన్యా 3:14-15.

# ప్రపంచ ఏక (క్రైస్తవ) మత స్థాపనము



"...నీవిక్కడికి రమ్ము విస్తార జలముల మీద కూర్చున్న మహావేశ్యకు చేయబడు తీర్పు నీకు కనపరచెదను. ...దేవదూషణ నామములతో నిండుకొని ఏడు తలలు పది కొమ్ములు గల ఎఱ్ఱని మృగము మీద కూర్చుండిన యొక స్త్రీని చూచితిని. ఆ స్త్రీ ధూమ్రరక్తవర్ణముగల వస్త్రము ధరించుకొని, బంగారముతోను, రత్నములతోను, ముత్యములతోను అలంకరింపబడినదై, ఏహ్యమైన కార్యములతోను తాను చేయుచున్న వ్యభిచార సంబంధమైన అపవిత్రత కార్యములతోను నిండిన యొక సువర్ణ పాత్రను తనచేత పట్టుకొనియుండెను దాని నొసట దాని పేరు ఈలాగు వ్రాయబడియుండెను—మర్మము, వేశ్యలకును భూమిలోని ఏహ్యమైన వాటికిని తల్లియైన మహా బబులోను: మరియు ఆ స్త్రీ పరిశుద్ధుల రక్తము చేతను, యేసుయొక్క హతసాక్షుల రక్తముచేతను మత్తిల్లియుండుట చూచితిని....అ ఏడు తలలు ఆ స్త్రీ కూర్చున్న ఏడు కొండలు మరియు...నీవు చూచిన జనములు ప్రజలను, జనసమూహములను, జనములను ఆయా భాషలు మాటలాడువారిని సూచించును. నీవు ఆ పది కొమ్ములు గల ఆ మృగమును చూచితివే, వారు ఆ వేశ్యను ద్వేషించి, దానిని దిక్కులేని దానిగాను చేసి, దాని మాంసము భక్షించి అగ్నిచేత దానిని బొత్తిగా కాల్చివేతురు. దేవుని

మాటలు నెరవేరువరకు వారు ఏకాభిప్రాయము గలవారై తమ రాజ్యమును ఆ మృగమునకు అప్పగించుటవలన తన సంకల్పము కొనసాగించునట్లు దేవుడు వారికి బుద్ధి పుట్టించెను. మరియు నీవు చూచిన ఆ స్త్రీ భూరాజుల నేలు ఆ మహా పట్టణమే.'' (ప్రకటన 17 వ అధ్యాయము)

---

పై ప్రవచనము రాబోవు అపోస్టేట్ మత సంబంధమైన విధానమును గూర్చియు మరియు దానికి ప్రపంచరాజ్యములపై యుండు అధికారమును గూర్చియు ప్రవచింపబడినది. క్రీస్తును, వాక్య ప్రకారము అనుసరించుచు, ఆయనకు నమ్మకముగా జీవించు విశ్వాసులను, ఈ మత విధాన శాఖలు ఎందరినో హతమార్చును. ఈ మత విధానమునకు 'వేశ్య' అనే పేరు ఎందుకు కలిగినదంటే మత సంబంధముగా యుండియు, ఆత్మీయముగా దీని క్రియలు యుండక, లోకముతో స్నేహముచేసి లోకానుసారముగా నడిచినందుకు. ఈ మతవిధానము, లోకమందలి ధనమును కూర్చుకొనుటకు వేగిరపడుచు తానే క్రీస్తు సంఘమని చెప్పుకొనును. అయితే అంతిమమున యేసు క్రీస్తు దీనిని నాశనము చేయును .... తాను ప్రవక్తినని చెప్పుకొనుచున్న యెజెబెలను స్త్రీని నీవు ఉండనిచ్చుచున్నావు. జారత్వము చేయుటకును, విగ్రహములకు బలి యిచ్చినవాటిని తినుటకును, అది నా దాసులకు బోధించుచు వారిని మోస పరచుచున్నది. మారు మనస్సు పొందుటకు నేను దానికి సమయమిచ్చితిని గాని అది తన జారత్వము విడిచిపెట్టి మారుమనస్సు పొందనొల్లదు. ఇదిగో నేను దానిని మంచము పట్టించి దానితోకూడ వ్యభిచరించువారు దాని క్రియల విషయమై మారు మనస్సు పొందితేనే గాని వారిని బహు శ్రమల పాలుచేతును.'' ప్రకటన 2:21_22.

ఈ విధమైన మతము, దాని నివాసస్థానము కార్యాలయములును రోమా పట్టణమందు స్థాపించబడును. మరియు దీనికి అధిపత్యము వహించే వానిని, మృగపు రాజ్యాధిపతే నియమించును.

ఇది (రోమా పట్టణము) మర్మములకు నిలయమై వేశ్యలకు తల్లియైన మహా బబులోను పట్టణమని పిలువబడుటకు; ఇది క్రీ. పూ. 2000 సం॥ లప్పుడు నిమ్రోదు ఆధీనమున బాబెలు గోపురమును కట్టి, ఇచ్చటనే విగ్ర

హారాధన చేయుటకు ముఖ్య స్థానముగా చేయబడుటయే కారణము. ఇచ్చటి నుండే విగ్రహారాధనలకు మూలమైన ఆచారములు మొదలగునవి ప్రపంచములోనికి వ్యాప్తి కావింపబడెను. వాటిలో "ఆకాశ రాణి" ఆమె బిడ్డకు సంబంధించినదయ్యముల పూజలు ఇచ్చటనుండే ప్రపంచ వ్యాప్తి గావింపబడెను. ఇదేకాక కానాను దేశమందు అష్టోరెత్, బాల్ అనే దేవతలు; ఇస్సిస్, హోరస్ అనే దేవతలు ఐగుప్తు నందు; గ్రీసు దేశమందు అఫ్రోడైట్, ఈరోస్ అనే దేవతలు, ఇటలీ దేశమందు వీనస్, క్యూపిడ్ అనే దేవతలు బాబిలోనియా ప్రాంతమునుండే వ్యాప్తి గావింపబడెను.

ఈలాగున, రోమా పట్టణము, బాబిలోనియాకు సంబంధించిన విగ్రహారాధన, తప్పు బోధలకు, మతములకు నివాసస్థానమయ్యెను. బాబిలోనియాలో క్రొత్తగా నెలకొల్పబడిన "చేప దేవుడు" మొదలగు పూజలు, ఆచారములు ఇచటి నుండే క్రమముగా, ఫిలిస్తీనా ప్రాంతమునకు ప్రాకి చివరకు రోమాలో అవలంబింపబడెను. దీని ఆచారము నుండియే రోమాలో ప్రధాన మతాచార్యునకు (High priest) పోంటిఫెక్సు మాక్సిమస్ (Pontifex Maximus) అనే బిరుదు వచ్చెను. ఈ బిరుదునే తరువాత జూలియస్ సీజర్‌కు ఇవ్వబడి క్రమముగా రోమా చక్రవర్తులందరికిని ఈ బిరుదు వచ్చెను. కాన్‌స్టెన్‌టైన్ చివరగా ఈ బిరుదును పొందెను. కాన్‌స్టెన్‌టైన్ కాలములో, క్రైస్తవ మతము ప్రభుత్వము ద్వార దేశములో ఒక మతముగా గుర్తించబడుట వలన క్రైస్తవులకు కలుగు హింసలు నిలిపి వేయబడెను. కాని, క్రైస్తవ మతములో, బాబిలోనియాకు సంబంధించిన ఆచారములు కలియుటవలన, వాక్యానుసారముగా నుండక క్రైస్తవ మతము తప్పు బోధల మిశితమై యుండెను.

ఈ రోజులలో క్రైస్తవులుగా పరిగణింపబడే వారిలో ప్రపంచమందు రెండు విధములగు క్రైస్తవ మతములు కలవు. వానిలో ఒకటి రోమన్ కాథలిక్, రెండవది ప్రపంచ సంఘముల సమాఖ్య (World Council of Churches) గా యున్నది.

## రోమన్ కాథలిక్ సంఘములు

రోమన్ కాథలిక్ సంఘము (Church) క్రీ. శ. 4-6 శతాబ్దములలో స్థాపింపబడి అభివృద్ధి కావించబడెను. లియో 1 ఈ రోజులలోనే 'పోపు'

అనే బిరుదును పొందెను. తరువాత 'వేటికన్' రోమానగరములో నిర్మింపబడి నేటికిని, అచ్చటనే దాని ముఖ్య కార్యాలయములు కలిగియున్నది.

వేటికన్ పట్టణము విస్తరణ 108.7 ఎకరముల వైశాల్యముతో 530 నివాసులను మాత్రమే కలిగియున్నది. అయితే అది ప్రపంచమందున్న వివిధ దేశములలోని 66 కోట్ల ప్రజలను పాలించునదిగా యున్నది.

వేటికన్ పట్టణపు ఆర్థిక సంపద ఎంతకలదో, సరిగా చెప్పుటకు వీలు లేదు. కాని లండన్‌లోని ఒక ఆర్థికావేత్త ద్వార 1964 సం॥ చివరన వేయబడిన అంచనా వలన, 8.8 బిలియనుల (లక్ష కోట్లు) డాలర్లుగా తెలియబడినది. అయితే ఇది, వేటికన్‌కు సంబంధించిన కట్టడములు దానికి వచ్చేడి బహుమతులు మొదలగు వాని విలువలు కాకనే ఈ అంచనా వేయబడినది. వీటన్నిటిని చేర్చిన దీని సంపద మిక్కిలి గొప్పదిగా యుండును.

వేటికన్ పట్టణము రాజకీయమైన వ్యవహారములందు బలమైన సంస్థగా పరిగణింపబడుచు, ఇది ఈ రంగమందు అన్ని విషయముల సేకరణ యందు, ప్రచారమందు ప్రజ్ఞత కలిగియున్నది. వేటికన్ తరపున ప్రపంచ దేశములందంతటను, రాయబారులు, బిషప్పులు కలరు. వీరి ద్వార వేటికన్‌కు, దేశములందలి రాజకీయ ఆర్థిక వ్యాపార సంగతులు, ఎప్పటికప్పుడే తెలియపర్చబడును. 1945 నుండి ఇటలీని పాలించుచున్న, క్రిష్టియన్ డెమోక్రాటిక్ పార్టీ, వేటికన్ ద్వార ఆర్థిక సహాయమునొందుచు దీని ఆజ్ఞానుసారముగా నడుచునదై యున్నది. రోమన్ కాథలిక్ చర్చ్, పది దేశములను కూర్చి, 'కామన్ మార్కెట్'ను స్థాపించుటకు చాలా కృషి సల్పుచున్నది. ఇది యూరపు రాజకీయ రంగమందు కీలక స్థానమును ఆక్రమించును వేటికన్ జర్మనీలో CDU, ఫ్రాన్సులో MRP, బెల్జియమ్‌లో 'క్రిష్టియన్ డెమోక్రాటిక్' నెథర్‌లాండ్సులో పీపుల్సు కాథలిక్ పార్టీలను బలపర్చుచున్నది. EEC సభ్యులగు తొమ్మిది దేశములందు, రోమా స్థిరమైన మెజారిటీని కలియున్నది. ఆంగ్లికన్ చర్చికి సంబంధించిన బ్రిటన్‌కూడ, వీటితో తిరిగి కలియును.

నేడు, పోపు పాల్ VI, రోమన్ కాథలిక్ సంఘమునకు పెద్దగా, వేటికన్ పట్టణమునకు అధిపతిగా యున్నాడు. ఇతనికి ఎన్నో బిరుదులు

కలవు. వీనిలో_ప్రపంచ సంఘమునకు ప్రతినిధి అని, పరిశుద్ధ తండ్రి అని, ప్రైమెట్ ఆఫ్ ఇటలీ అని, రోమా ఆధిపత్యము క్రిందనున్న ప్రాంతములకు ఆర్చి బిషప్ అని, పాంటిఫిక్స్ మాక్సిమస్ అని మొదలగు బిరుదులు కలవు. ఇతను ధరించే కిరీటము త్రిభుజాకారముగా నుండి దానిపై వికారివ్స్ ఫిలై డై (Vicarivs Fileii Dei) అనెడి మాటలు వ్రాయ బడియుండును. వికారివ్స్ ఫిలై డై అనగా దేవుని కుమారునికి ప్రతిగా నియమించబడిన (Substitute for the Son of God) వాడని అర్థము. రోమన్ కాథలిక్ సంఘము, బాబిలోనియా ఆచారములను, మర్మములను, అవలంబించుచున్నదని తెల్పుటకు, ఇది తనకు సంబంధించు ప్రతి దేవా లయములో కార్యాలయములలో ప్రతిష్ఠించుచున్న 'మేరీ' విగ్రహమును బట్టి గ్రహింపనగును. రోమన్ కాథలిక్ వారు, మేరీ, దేవుని తల్లి అని, సంఘమునకు తల్లి అని పరలోకమునకు రాణి అని, లోకమునకు రాణి అని మొదలగు బిరుదులతో పూజింతురు. అయితే యేసుప్రభువు తల్లియగు మేరికి వీరు ఆచరించుచున్నట్లుగా బైబిలులో ఈలాంటి బిరుదులు ఎచ్చ టను ఇవ్వబడలేదు.

## ప్రపంచ సంఘముల సమాఖ్య

## (The World Council of Churches)

కాథలికేతర (వివిధ శాఖా) క్రైస్తవ సంఘములు 'వరల్డ్స్ కౌన్సిల్ ఆఫ్ చర్చస్' (WCC) అనే నామధేయము క్రింద 1948 లో ఆమ్‌స్టర్ డామ్‌లో ఏర్పర్చబడి, కాథలికేతర సంఘముల ఐక్యతకొరకు కృషి సల్పుటకై ఉద్దేశించబడినది. ప్రొటెస్టంట్ సంఘముల వివిధ డినామినేషన్‌లు దీనిలో సభ్యత్వము కలిగియున్నవి. మొదటి WCC సమావేశమునకు, 44 దేశములనుండి, 147 డినామినేషన్‌ల తరపున రాయబారులు హాజరైరి. అప్పటి నుండి ఈ కౌన్సిల్‌లో సభ్యత్వముల సంఖ్య క్రమముగా అధిక మగుచు వచ్చుచున్నది. ఇప్పుడు 83 దేశములనుండి, 400,000,000 క్రైస్తవులకు సంబంధించిన 252 డినామినేషన్‌లు దీనిలో సభ్యత్వము కలియున్నవి.

1961 నవంబర్‌లో ఈ కౌన్సిల్ జనరల్ అసెంబ్లీ ఢిల్లీలో జరిగినది. అప్పుడు సోవియట్ రష్యా, రుమేనియా, బల్గేరియా, పోలిష్ అర్థడాక్స్

సంఘముల (Churches) కు సంబంధించినవి దీనిలో సభ్యత్వము నొందినవి.

WCC నివాస స్థానము, కార్యాలయము జెనివాలో యున్నవి. 1972 వరకు డాక్టర్ యూజీన్ బ్లేక్ దీనికి సెక్రిటరీ జనరల్‌గా యుండెను. ఇతను కమ్యూనిస్టు విధానములపై WCC ని నడుపుటకు ప్రయత్నించెను. ఇతని ఆధ్వర్యములో WCC లోనికి కొందరు కమ్యూనిష్టులు కూడ సభ్యత్వము నొందినట్లుగా తెలిసినది. అప్పుడే, WCC 1966లో, "క్రైస్తవం ద్వార విప్లవాత్మక చర్యలు, ప్రోత్సహింపబడి బలపర్చబడునని, నేడున్న రాజకీయములను, దౌర్జన్యముల ద్వార, అలజడుల ద్వార పడద్రోయవలెనని," వివరించెను. అంతేకాక విప్లవాత్మక చర్యలకు కూడ WCC ద్వార ఆర్థిక సహాయము చేయబడెను. ఈ సమయముననే యూజీన్ బ్లేక్‌ను తొలగించి ప్రస్తుతపు సెక్రటరీ జనరల్ అగు ఫిలిప్ ఆల్‌ఫోర్డ్ పాటర్ అనే పశ్చిమ ఇండియా దీవుల ప్రాంతమైన దోమినికా (Dominica) కు చెందిన మెథడిస్టువానిని WCC కి ఎన్నిక చేసిరి.

ఫిలిప్ పాటర్, క్రొత్తమార్పులు, క్రిమాభివృద్ధి ద్వారకాక, పరిపాలనా విధానములో సమూల సంస్కరణము చేయుట అవసరమని తెల్పెను.

WCC ఒక అద్భుతమైన కౌన్సిల్ అని లేక దీనిద్వారా క్రైస్తవ ఐక్యతకు దోహదము చెయ్యవచ్చునని తలచెడివారికి, వాస్తవము తెలియకనే పొరపడుచున్నట్లు గ్రహింపనగును. దీని స్వమత పరిత్యాగమునకు (Apostasy), క్రైస్తవాద్యన్య మతారాధన (Paganism) నకు నిదర్శనముగా, 1968లో నాలుగవ కౌన్సిల్ సమావేశము, యుప్సాలలో జరిగినప్పుడు, ఒక కమ్యూనిష్టువాడు, దీనికి అధ్యక్షునిగా ఎన్నికయ్యెను. ఇతను యుగోస్లావియాకు చెందిన సెర్బియల్ (Serbial) ఆర్థడాక్స్ చర్చికి సంబంధించిన జర్మనీవాడు. 1963 సం॥లో ఇతని ఎన్నికను ఎదిరించిన వారందరు మరియు బిషప్పులు, ఎన్నో హింసలకు, కారాగార శిక్షలకు, గురి అయ్యిరి. ఇదే విధముగా రష్యాలోను జరిగెను.

WCC దక్షిణ ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో గొరిల్లా దాడులను నడుపు వారికి అవసరమైన ఆర్థిక సహాయము చేసెను. వీటిలో WCC ఆఫ్రికా

లోని 19 గొరిల్లా, 14 టెర్రరిస్టు విప్లవకారులకు సహాయము చేసెను. ఇందు నాలుగు విప్లవకారుల గుంపులు పూర్తిగా కమ్యూనిష్టు సిద్ధాంతములను అవలంబించెడివారు—వీరు రక్తపాతము ద్వారనే తమ ఉద్దేశములను నెరవేర్చుకొనువారుగా కలరు.

1971 లో WCC తరపున ఆర్థిక సహాయము నెలకొల్పుటకు వియత్నామ్, లావోస్, కాంబోడియాలో శాఖలను ఏర్పాటుచేసి, దీనికి ఒక బుద్ధ మతస్థుని కార్యదర్శిగా నియమించిరి.

WCC కి సంబంధించిన లేక అనుబంధము కలిగిన సంస్థలు ప్రతిదేశములోను కలవు. ఇవి, అన్ని డినామినేషన్‌ల ఐక్యతకొరకు పాటు పడునట్లుగా చూచుటయే ప్రధాన ఉద్దేశము కలిగియున్నవి.

మతభేదములు లేని ప్రభుత్వములతో, మత సంబంధము కలిగిన సంస్థలు స్నేహ సంబంధములు కల్పించుకొనుట ద్వార క్రొత్త పరిణామములను గాంచగలము. ఈ సంస్థలకు సంబంధించిన శాఖలు అమెరికాలోని న్యూయార్క్, వాషింగ్టన్ మొదలగు పట్టణములలో పెక్కు ద్రవ్యముతో స్థాపింపబడి, వాని ప్రభావము ప్రభుత్వముపై పడునట్లు కృషిచేయుచున్నవి. అమెరికాలో జరిగిన ఎనిమిదవ NCC సమావేశములో, దీని సభ్యత్వమొందుటకు NCC కి సంబంధించని రోమన్ కాథలిక్, బాప్టిస్టు, పెంతుకోస్తు మొదలగు సంఘములు ఆహ్వానించబడెను. ఇట్లు, ఇంతకు పూర్వమున్న విధముగా కాక, దీనిలోని విధులను సడలించి, ప్రపంచములోని అన్ని డినామినేషన్‌లవారు చేరి ఐక్యతతో, ఒకే సంఘము ఏర్పరచవలెననెడి ఉద్దేశముతో కృషి 'సల్పుచున్నారు.

అమెరికాలో కొన్ని సంఘ సంస్థలు తమ స్వంత కౌన్సిళ్ళనుండి సంబంధమును తెంచుకొని కాన్ఫరెన్సెస్ అఫ్ చర్చెస్ (Conferences of Churches) అను నెలకొల్పి, వీనిలోనికి రోమన్ కాథలిక్, గ్రీక్ ఆర్థడాక్సు సంఘములను కూడ చేర్చుకుంటున్నవి.

1972 సం॥ ఆరంభములో, బ్రిటన్ ఆంగ్లికన్ ఆర్చిబిషప్, మైకల్ రామ్‌సే, మాన్‌హట్టన్ యొక్క రోమన్ కాథలిక్ సెయింట్ పాట్రిక్స్

కెథీడ్రల్‌లో ప్రసంగించి చరిత్రాత్మిక ఘట్టమును సృజించెను. ఈ సమయములో కాథలిక్ వాడైన పెరెగ్రిన్స్ కార్డినల్ కుక్, గ్రీకు ఆర్థడాక్సు చర్చి ఆర్చి బిషప్పు లాకోవాస్‌కూడ యుండిరి. చివరన ఆర్చి బిషప్పు, అందరు క్రైస్తవులు, ప్రపంచ సంఘములన్నింటికి పోపును ప్రధాన బిషప్పుగా త్వరలో అంగీకరించగలరని విశ్వసించుచున్నా ననెడి ఆశాభావమును వ్యక్తపర్చెను.

ఆర్చ్ బిషప్ రామ్‌సే, WCC ప్రెసిడెంటుగా యుండి, 1968 లో పోపును దర్శించి, రోముతో ఇతర సంఘములకు సంబంధము కల్గించుటకు కృషి సల్పెను. రామ్‌సేకు ముందున్న జెఫ్రి ఫిషర్ తప్ప, 1397 నుండి ఏ కాన్‌టర్‌బరీ ఆర్చ్ బిషపు కూడ పోపును దర్శించలేదు. చాల కాలము పిమ్మట హెన్రీ VIII రోమాతో సంబంధము తెంచుకొనెను. కాన్‌టర్‌బరీ పోపును, యువర్ హోలీనెస్ అని, క్రీస్తునందు ప్రియ సహోదరుడా అని సంబోధించి, రోముకు ఇతర సంఘములతో శాంతి సమాధానములు జరుగవలెనని కోరుచున్నట్లుగా తెల్పెను. ఈ సందర్భములో పోపు పాల్, కొన్ని శతాబ్దముల క్రింద తెగిపోయిన సంబంధము ఈలాగు తిరిగి కలియుట ద్వార, రోమాలో కాన్‌టర్‌బరీల సంబంధము నెలకొల్పుచు, సమాధానము పొందుచున్నదని తెల్పి, ఈ కూడికను "కిస్ ఆఫ్ పీస్" (Kiss of peace) అనే కౌగిలి ద్వార సమాధానము పొందినట్లుగా తీర్మానమునకు ముద్ర వేసిరి. ఆంగ్లికన్ బిషప్పులు, కాంటర్‌బర్రీ మతాచార్యులు పోపు చేతి ఉంగరమును ముద్దిడుటకు వంగిరి.

1969 జూన్‌లో పోపు పాల్ VI జెనీవాలోని WCC నివాసమును దర్శించెను. దీనికి 10 సం॥లకు ముందు ఒక రోమను కాథలిక్ ప్రీస్టు WCC సభకు హాజరైనాడని తెలిసి, అతనిమీద తీవ్రమైన చర్య తీసికొనబడినది. పోపు WCC కేంద్రమును దర్శించిన సందర్భములో, డాక్టర్ యూజీన్ బ్లేక్ పోపును ఆహ్వానించుచు, పోపు WCC ని దర్శించుట, క్రైస్తవ సంఘములన్నియు ఐక్యతతో కూడుటకు ప్రోత్సాహమిచ్చుటయే కాక క్రీస్తు సంఘములన్నియు ఒకే సంఘములోనికి చేర్చబడుటకు అవకాశము కల్గించుచున్నదని తెల్పెను. పోపు కౌన్సిల్‌ను పొగడుచు, "కౌన్సిల్ లో నున్న సంఘములన్నియు, లోకమందు చెదరిపోయిన దేవుని బిడ్డల సమావేశమని" నుడివెను.

ఇప్పుడు WCC వేటికన్ మధ్య సహకార భావము దిన దినము అభివృద్ధి అగుచున్నది. రోమ్, జెనీవా రెండును కలిసి శాంతిని నెలకొల్పుటకు ఒక కమిటీని స్థాపించినవి. ఇదియే కాక, ఇరువురి సంఘ సమస్యలను తీర్చుటకు, మిశ్రమ వివాహములను, ఆరాధన విషయము లను, ఇతర మతములతో పని చేసే విషయములను, వాక్యము ఇరువురికి ఒకే రకముగా ఏర్పడు విషయములను, తీర్చుటకు ఇరువురి కొరకు ఒకే కమిటీని తయారు చేసిరి. ఇవేకాక, ఇంకా ఇరువురికిని ఒకే రకపు బైబి ళ్ళను 100 భాషలలో తర్జుమా చేయించుటకు ప్రపంచమందలి వివిధ దేశ ములలో సన్నాహములు జరుగుచున్నవి. కాథలిక్ మత గురువులు WCC లో విశ్వాస విషయమైన సంగతులను అంగీకరించుచున్నారు.

ఈ విధముగా, నేడు రెండు గొప్ప క్రైస్తవ సంఘములు ఐక్యతకొరకు కృషి చేయుచున్నట్లు చూచుచున్నాము. మరి కొన్ని రోజులలో ఈ రెండు సంఘములు లీనమై ఒకే సంఘముగా ఏర్పడును. ఈ సంఘము పోప్ ఆధీనమునకు వచ్చుటకు కొన్ని రోజులే పట్టవచ్చును. ఇట్లు ప్రపంచ మంతటికిని ఏక (క్రైస్తవ) మత సంఘము ఏర్పర్చబడి ప్రవచనములో యున్నట్లుగా, మర్మములకు, వేశ్యలకు, భూలోకమందలి పాపములకు తల్లి యైన మహా బబులోను వివరణ నెరవేర్పు త్వరలో జరుగనై యున్నది.

రోమన్ కాథలిక్ సంఘములు, WCC సంఘములు కాక వేరే నిజ విశ్వాసుల కూర్పు ద్వార ఏర్పరచబడిన క్రీస్తు సంఘములును కలవు. క్రీస్తు ప్రభువు తెల్పినట్లుగా ఇవి క్రీస్తు సంఘములోని భాగములని, వీరు క్రీస్తే తమ శిరస్సుగా భావించువారని, వీరు ఏ డినామినేషన్‌కు చెందక, క్రీస్తును తమ ప్రభువుగా అంగీకరించి, ఆయన వాక్యమునకు లోబడి, విశ్వాసము ద్వార జీవించెదరు. కమ్యూనిష్టు దేశములందు ఈలాంటి విశ్వాసులు తరచుగా తమ విశ్వాసమును బట్టి నా నా హింసలు నొందుచు కారాగారముల యందు శ్రమల నొందుచున్నారు. ఈలాంటి విశ్వాసులు అన్ని దేశములందు కలరు. వీరు యేసు ప్రభువు మాటచొప్పున, ఆయన సువార్తను ప్రకటించుటకు, సర్వ సృష్టికి సువార్తను అందించుటకు కృషి సల్పుచు పోపు క్రిందకు రాబోయే ప్రపంచ ఏక మత సంఘమును ఎదిరించువారుగా యుందురు. అయితే రోమా సంఘము (Church), రాజకీయముగా, మత సంబంధముగా ప్రపంచమందు అధికారమును సంపా

దించును కావున, నిజ విశ్వాసులైన వీరికి టీనివలన పెక్కు హింసలు కలుగును. అయితే ఈ హింసలను సహితము విశ్వాసులు ఓర్చుకొందురు, కాని తమ విశ్వాసమునుండి మార్పొంది రోమా సంఘపు ఆధిపత్యము క్రిందికి వచ్చుటకు యిష్టపడరు,

ఈ పుస్తకమును చదువుచున్న ప్రియచదువరీ! నీవు రోమా సంఘమునకు చెందినవానివైన లేక సర్వసంఘముల ఐక్యతకొరకు పాటుపడుచున్న WCC లాంటి సంస్థకు చెందినవానివైనను, దేవుని వాక్యమునకు విరుద్ధమైన కార్యములకు దూరముగా యుండుటకు వెంటనే వానినుండి వెలుపలికి రమ్మని, నీ ఆత్మ రక్షణ నుద్దేశించి వేడుకొనుచున్నాను. ఈ విషయములో యేసుప్రభువు కూడ ఈలాగు మిమ్ము హెచ్చరించుచున్నాడు.

"నా ప్రజలారా, మీరు దాని (రోమా సంఘము) పాపములలో పాలివారు కాకుండునట్లు దానిని విడిచి రండి" (ప్రకటన 18:4-5).

మత సంబంధమైన బాబిలోనియా నాశనము తేటగా వివరించబడి, సంభవింపనై యున్నది. ఇది క్రమములలోనికి తేబడి, ఏ మృగ రాజ్యపు అవతరణకు తోడ్పడునో, దాని ద్వారనే ఇది నాశనము కావింపబడును.

# ప్రపంచ ఏకాధిపత్యము

''మరియు పరిశుద్ధులతో యుద్ధము చేయను, వారిని (విశ్వాసులను) జయింపను, దానికి (మృగమునకు) అధికార మియ్యబడెను. ప్రతి వంశము మీదను ప్రతి ప్రజమీదను ఆయా భాషలు మాటలాడు వారి మీదను ప్రతి జనము మీదను అధికారము దాని కియ్యబడెను ... ... కాగా కొద్దివారుగాని, గొప్పవారుగాని, ధనికులుగాని, దరిద్రులుగాని, స్వతంత్రులుగాని, దాసులుగాని అందరును తమ కుడిచేతిమీద నైనను తమ నొసటియందైనను ముద్రవేయించుకొనునట్లును, ఆ ముద్ర, అనగా ఆ మృగము పేరైనను దానిపేరిట సంఖ్యయైనను గలవాడు తప్ప, క్రయ విక్రయములు చేయుటకు మరి యెవనికిని అధికారము లేకుండునట్లును అది (మృగము) వారిని బలవంతము చేయుచున్నది. బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము; అది యొక మనుష్యుని సంఖ్యయే; ఆ సంఖ్య ఆరు వందల అరువది యారు (666) ఇందులో జ్ఞానము కలదు'' (ప్రకటన 13:7, 16:18).

ఇచ్చట ప్రవచింపబడినట్లు, మృగమని చెప్పబడే, రోమా రాజ్యము పున రుద్ధరించబడి దాని పాలకుడు లోకమంతటిని ఏలును. యూరపు పది రాజ్యముల నుండి, వచ్చెడి నియంత (Dictator) క్రింద, లోకమంతటి పాలన ఒకటిగా చేయబడును. ఈ నియంత అవతరణకు పూర్వమే, దీనికి (ప్రవచన నెరవేర్పుకు) అనుకూలముగా నేడు జరుగుచున్నట్లు, యూరపు దేశముల ఐక్యతవలన EEC నిర్మించబడెను. ఈ రాజ్యములె ఏకాభి ప్రాయముతో తమలోనుండి ఒకరిని పరిపాలించుటకు అన్నిరాజ్యములపై ఆధిపత్యము వహించుటకు అధికారమిచ్చెదరు. ఈలాగు వీరివలన ఎన్నుకొనబడిన వాడు నియంతగా పరిపాలించును.

1960 మే 16 తా॥న బ్రిటన్ పార్లమెంటు, ప్రపంచ ఏకాధిపత్యము నకు తమ రాజ్యమును అప్పగింతుమని ప్రకటించెను. ఆ రోజే అమె రికా. ఇటలీ కూడ తాము ఈ విషయములో అదే అభిప్రాయము కలి యున్నామని తెల్పిరి. అప్పటినుండి దాదాపు తొమ్మిది వేరే రాజ్యములును, తమ రాజ్యములను ఏకాధిపత్యమునకు అప్పగించుటకు సిద్ధముగా యున్న ట్లుగా తెల్పిరి.

R. R. దివాకర్, గాంధీ శాంతి సమాజపు అధ్యక్షుడు, ఇండియా ప్రపంచ ఏకాధిపత్యము వహించుటకు సరియైన దేశమని, యుద్ధములు లేకుండ ఈలాంటి పరిపాలనను చేయుటకు ఇండియా సరిపోవునని తెల్పెను ... ఈ విధముగా నేడు ప్రపంచమందలి అన్ని దేశములు ఐక్యతను కోరు చున్నవి. ఈలాంటి ప్రపంచ ఐక్యతనే ఏకాధిపత్యమునకు దారితీయును.

ప్రస్తుత మానవుని విజ్ఞానము, ప్రపంచమందలి ప్రతి మానవుని పై సూటిగా (Direct) ఆధిపత్యము వహించుటకు, ఆజ్ఞాపించుటకు వీలు కలి యున్నది. కంప్యూటర్ (Computer) యంత్రముల ద్వారా ఈలాంటి పద్ధతి త్వరలో అమలులోనికి రానై యున్నది. కొన్ని రోజులలో ప్రపంచ మందున్న ప్రతి మానవునికి ఒక సంఖ్యను ఇచ్చి దానిని ప్రపంచ కంప్యూటర్‌లో ఆ సంఖ్యను రిజిష్టరు చేయుదురు. అవసరమైనప్పుడు, ఆ సంఖ్య ద్వార ఆ మనుష్యుని తమ ఉద్దేశములను నెరవేర్చుటకు ఉప యోగించవచ్చును. ఈ సంఖ్య మనుష్యుని చేతి వ్రేలుపై ముద్రింపబడు నని తలంతురు.

కెనడా దేశము ప్రతి వానికి ఒక సంఖ్యను నియమించి ఈలాటి పద్ధతిని ఉపయోగమునకు తెచ్చినది. ఈలాగే పశ్చిమ జర్మనీ, హాలాండు, అమెరికా కూడ సంఖ్యల పద్ధతిని అమలులోనికి తెచ్చుటకు ఉద్దేశించుచున్నవి. కావున ఈలాంటి పద్ధతి, మృగపు రాజ్యము వచ్చునప్పుడు; మృగము ప్రపంచమందలి ఏ మానవుని నైనను, తన అధికారము లేకుండ, అమ్ముట నైనను కొనుట నైనను, సాంఘిక వ్యవహారములలో పాల్గొనుట నైనను, వైద్య సదుపాయములు పొందుటకైనను, లేక మరే విషయములో నైనను సాధ్యము కాకుండ చేయుట సులభముగా యుండుట అప్పుడు ఏలాగు వీలగునో గ్రహించవచ్చును. 1963 జూలై లో 500 న్యాయవాదులు ఏథెన్సులో వివిధ దేశములనుండి వచ్చి సమావేశమై; న్యాయవాదులందరును, ప్రపంచమంతటికిని ఒకే విధమైన చట్టములు ఏర్పర్చు సంస్థ స్థాపనకై కృషి చేయవలెనని ఉద్దేశించిరి. ఇప్పుడు ఐక్య రాజ్య సమితి ఆధిపత్యములో నడిపింపబడుచున్న ప్రపంచ న్యాయ స్థానము (World Court) కలదు. ఈలాగున ప్రపంచమంతటికి ఒకే న్యాయస్థానము (Court), చట్టము (law) రాబోవు చున్నట్లుగా చూడగలము.

మాజీ ఐక్య రాజ్య సమితి సెక్రెటరీ జనరల్ యూథాంట్ మరియు మరి కొందరు ప్రపంచ రాజకీయ నాయకులు "నేడు మానవునిని, మారణాయుధముల భయమునుండి, ప్రపంచ వినాశనమునుండి తప్పించవలెనంటే, దేశములలో యున్న అన్ని రకములైన యుద్ధ పరికరములను, సైన్యములను, అస్త్రములను ఒకే ప్రపంచ సైన్యము క్రింద భద్రపర్చుటవలన, యుద్ధముల భయము తొలగగలదని" సూచించిరి.

ప్రపంచమందలి ఎన్నో సమస్యలను తీర్చుటకు గాను ఐక్య రాజ్య సమితి (U. N.) ద్వార పెక్కు అంతర్జాతీయ శాఖలను స్థాపించిరి. వానిలో— ది ఇంటర్ నేషనల్ లేబర్ (పనివారల) ఆర్గనైజేషన్, ది ఇంటర్ నేషనల్ టెలి కమ్యూనికేషన్ (తంతి ప్రసార) యూనియన్, వరల్డ్ హెల్త్ (ఆరోగ్యము) ఆరనైజేషన్, వరల్ మెట్రొలాజికల్ (వాతావరణ

శాస్త్రపు) ఆర్గనైజేషన్, జనరల్ అగ్రిమెంటు ఆన్ టారిఫ్స్ అండ్ ట్రేడ్ (సుంకము వ్యాపార సంబంధమైన), యు. యన్. చిల్డ్రిన్స్ ఫండ్ (UNICEF), యునైటెడ్ నేషన్స్ కమిషన్ ఫర్ రెఫ్యూజీస్, ఇంటర్ నేషనల్ బ్యూరో ఫర్ డిక్లరేషన్ ఆఫ్ డెత్, యు. యన్. కాన్ఫరెన్సు ఆన్ ట్రేడ్ అండ్ డెవలప్మెంటు (దీనిలో 142 దేశములు సభ్యత్వము కలిగియున్నవి), డివిజన్ ఆఫ్ నార్కొటిక్ డ్రగ్స్, యు. యన్. సెక్రేటేరియట్ ఆఫ్ ఇంటర్ నేషనల్ నార్కొటిక్స్ కంట్రోల్ బోర్డు, యు. యన్. ఫండ్ ఫర్ డ్రగ్ అబ్యూజ్ కంట్రోల్, ఇవే కాక, వరల్డ్ ఫుడ్ (ఆహార) బ్యాంకు, వరల్డ్ మనీ (డబ్బు) బ్యాంకు మొ॥ కలవు. వరల్డు ట్రిబ్యూనల్ (న్యాయసభ) ఐక్యరాజ్య సమితిద్వారా ప్రవేశ పెట్టబడునని, దీనిద్వారా అన్ని దేశములందున్న డబ్బు, ఆస్తులను దీని పెత్తనముక్రిందికి తీసికొనబడి సోషలిస్టిక్ పద్ధతిని ప్రవేశపెట్టవలె ననెడి ఉద్దేశము కలిగియున్నట్లు తెలిసినది.

ప్రపంచ ఏకాధిపత్యమునకు దారితీయుటకు వీలు కలిగించునట్లుగ, ప్రపంచ ప్రజా సేవ కొరకు ఒక సంస్థను స్థాపింపవలెననెడి ఉద్దేశము కలదని, ఒక అమెరికా పత్రిక వెల్లడించెను. దీని ద్వారా యువతరములో నవీన పద్ధతులను, సోషలిజమును, నాస్తికత్వమును, పాత పద్ధతుల నుండి మరలు్చ విధానములను మొదలగునవి ప్రవేశ పెట్టబడునని తెలిసినది. నిజ క్రైస్తవులు, దేశభక్తి గలవారు మొదలగు వారు ఎవరైతే ఈ ప్రపంచ ఏకాధిపత్యపు పద్ధతులకు లొంగరో, వారు అనేకమైన శ్రమలకు గురి కావలసి వచ్చును.

అమెరికా, రష్యా దేశముల పతనములు జరిగిన పిమ్మటనే ప్రపంచ ఏకాధిపత్యము గల మృగపు నియంత పరిపాలన వచ్చును. ప్రపంచ ప్రజలందరును ప్రపంచ ఏకాధిపత్యము వహించే వానిని (నియంతను) కోరుదురు మరియు వాని పాలనను సమ్మతించెదరు. కాని అయ్యో ! వాని పాలనలో ప్రజలు పొందే శ్రమలను వర్ణించ నలవికాదు.

# అమెరికా దేశ పతనము

"రెండవ దూత బూర ఊదినప్పుడు అగ్నిచేత మండుచున్న పెద్ద కొండవంటిది ఒక్కటి సముద్రములో పడవేయబడెను. అందువలన సముద్రములో మూడవ భాగము రక్తమాయెను" ప్రకటన 8:8.



ఈ ప్రవచనము స్పష్టముగా లేకున్నను, ఇది అమెరికా దేశపు పతనమును గూర్చియే తెల్పబడినదని మనము నమ్మవచ్చును. బాబిలోనియాను గూర్చి యిర్మీయా 51:25 లో 'నాశన పర్వతమా' అని చెప్పబడియున్నది. అలాగే, దానియేలు 2:35 లో చేతి సహాయము లేకుండ తీయబడిన రాయి ప్రతిమ పాదముల మీద పడి దాని పాదములను తుత్తునియలుగా విరుగగొట్టినట్లుగా, చివరకు ఆ రాయి సర్వభూతల మంత మహా పర్వతమాయెనని వివరించబడి యున్నది. పర్వతముగా మారిన ఈ రాయి క్రీస్తురాజ్యమును సూచించుచున్నది. అలాగే పర్వతము ఒక గొప్ప దేశమును (రాజ్యమును) గూర్చి తెల్పబడి యున్నట్లుగా మనము చూడగలము. ప్రకటనలో ప్రవచింపబడిన పర్వతము ఒక గొప్ప దేశమును గూర్చి చెప్పబడి యున్నది. అయితే ఇది రష్యా లేక అరబ్బు దేశములను గూర్చి చెప్పబడినది కాదు. ఎందుకనగా వీనిని గూర్చి వేరే దగ్గర చెప్పబడెను. అలాగే ఈ పర్వతము యూరపు పది రాజ్యములను గూర్చిగాని, ఇశ్రాయేలు దేశమును గూర్చిగాని, వివరింపబడినది కాదు. కావున ఈ పర్వతము నేడు గొప్ప దేశముగా పరిగణింపబడుచున్న అమెరికానే ఉద్దేశింపబడినదని భావించుటకు, వీలుకలదు. యూరపునందు అవతరించెడి మృగపు రాజ్యము రాకపూర్వమే, శ్రమలరోజులు రాక

పూర్వమే, అమెరికా దేశము బలమైన దేశముగా మిగల్చబడక పతన మొందునని తెలియబడుచున్నది.

డాక్టర్ B. J. హారిస్, 'క్రిస్టియన్ క్రూసేడ్'లో వ్రాస్తూ —"అమెరికా తన ద్వితీయ శతవార్షికోత్సవమును 1977 సం॥లో జరుపుకొనుటకు యుండునా?" అనెడి సంశయము చాలామందికి కలదని తెల్పెను.

రష్యా దేశము ఆయుధములను త్యజించకున్నను, అమెరికా వివక్షణ లేకుండ తన ఆయుధములన్నింటిని త్యజించుటకు పూనుకొనియున్నది ఈ విషయమునుగూర్చి జనరల్ కర్టిస్ లీ మే, "ఈ విధముగా అమెరికా తన ఆయుధములను త్యజించుటకు పూనుకొనిన, 1973 వరకు పతన మొందుననెను. ఎందుకనగా — కొన్ని రోజులలో రష్యా అమెరికాకన్న విజ్ఞానమందు, సైన్య బలమందు ఎంతగా శక్తి నొందునంటే, అది అమెరికాను భూమిమీద నుండి సమూల నాశనము చేయ గలదని హెచ్చరించెను. జనరల్ లీ మే అనినట్లుగా, అమెరికా అంత త్వరగా పతనమొందక పోయినను, అతను చెప్పినదానిలో కొంత సత్యము కలదు. మరికొందరు వెంటనే కాకున్నను, అమెరికాకు 1976 లో నాశనము సంభ వించునని భావించుచున్నారు. ఏలాగున్నను, అమెరికాలో నున్న అవినీతి, అపవిత్రతను బట్టి త్వరలో తీర్పు రాబోవుచున్నదని, నాశనము త్వరలో కల్గునని చెప్పుకొనవచ్చును.

అమెరికా సువార్తికుడగు బిల్లీగ్రెహం, "అమెరికాలో నున్న అవినీతి, అపవిత్రత, సొదొమ, గొమొఱ్ఱాలకన్న విపరీతముగా యున్నదని, అమె రికాలో జరుగుచున్న విడాకులు ప్రపంచమందు మరే దేశమందు లేదని" తెల్పెను.

వియత్నాం నుండి వచ్చిన అమెరికా సైనికులు హెర్-ఓ-ఇన్ (Hero-in) ను సేవించువారు 5,60,000, మత్తు పదార్థములను సేవించువారు 60,000 మరియు మారివానా (Marijuana) ను సేవించువారు 12,000 మంది గలరు. ఈ దేశమందు 4,000,000 మంది పురుషగాములుగా (Homosexuals), 300 లక్షలమంది పురుషగాముల చర్యలను అప్పు డప్పుడు అనుసరించువారుగా యున్నారు. ఇదే విధముగా ఇచ్చట నేర

ముల సంఖ్య, సుఖవ్యాధుల (Venereal diseases) సంఖ్య విపరీతముగా పెరిగినది. అలాగే 'హిప్పీ' అనే ఒక క్రొత్త రకపు పోకడ యువతర మందు ప్రవేశించినది. వీరు, మత్తు పదార్థములను సేవించుచు, బూతు బొమ్మల, బూతు సాహిత్యపు (Pornography) వ్యాపారము చేయుచు, విలాస జీవితములను గడుపుచున్నారు. ఈ దేశమందు కమ్యూనిజం ఎంతగా ప్రాకిపోయినదంటే తిరిగి వారి నైతిక స్థితిని బాగుచేయుటకు వీలు కాకున్నది. ఈలాగు దేశమందు అలజడులు చెలరేగుచు, మనుష్యుల నైతికస్థితి రోజురోజుకు దిగజారి పోవుచు, దేశ నాశనమునకు దారి తీయు చున్నది.

విద్యా రంగమందు, విద్యార్థుల అల్లరులు దౌర్జన్యములు దినదినము హెచ్చు గుటవలన ఉపాధ్యాయులు తమ రక్షణకొరకు, పోలీసువారి సహాయము కోరుచున్నారు. ఈ విధముగా, విద్యాసంస్థలు, రుసుములు సరిగా పొందక పోవుటవలన, విద్యను సక్రమముగా బోధించలేక పోవుచున్నారు.

అమెరికా డాలరు (నాణెము) విలువతగ్గి, ఆర్థికముగా రక్షణ లేకుండ పోయినది. కావున దేశములందు డాలరు విలువ తగ్గుచు, దేశ విలువను కూడ క్షీణింప చేయుచున్నది.

పూర్వము దేవునికి భయపడి జీవించే జనులు నేడు, వ్యాపారములందు, సుఖభోగములందు, కామ భోగములందు నిమగ్నులై, వీనినే తమ దేవ తలు (Idols)గా సేవించుచున్నారు. ఈలాగు, ఇచ్చట క్రైస్తవులు, నిజ మైన విశ్వాసులుగ, వాక్యానుసారముగా జీవించువారుగా యుండక, ఐక్యత అనే పేరుతో నడుపబడుచున్న WCC సంస్థలలో చేరి, తమ విశ్వాసమును సహితము కోల్పోవుచున్నారు.

ఒకనాడు ఈ దేశము గొప్ప శక్తిగల దేశముగాను, దేవుని ద్వారా ఎన్నో కార్యముల కొరకు గొప్పగా వాడబడిన దేశముగా నుండెను. ఆలాంటి స్వతంత్రము కొరకు పోరాడే దేశము నేడు నాశనమునకు దారి తీయు చున్నది. "దేవునినుండి తొలగిపోయిన దేశమునకైనను, మనుష్యుల కైనను ఇదే గతి పట్టును."

# తూర్పు దేశములు బలము నొందుట

"ఆరవ దూత తన పాత్రను యూఫ్రటీసు అను మహానది మీద కుమ్మరింపగా తూర్పునుండి వచ్చు రాజులకు మార్గము సిద్ధపరచబడునట్లు దాని నీళ్ళు యెండిపోయెను. మరియు ఆ ఘటసర్పము నోట నుండియు క్రూర మృగము నోట నుండియు అబద్ధ ప్రవక్త నోట నుండియు కప్పలవంటి మూడు అపవిత్రాత్మలు బయలు వెడలగా చూచితిని. అవి సూచనలు చేయునట్టి దయ్యముల ఆత్మలే; అవి సర్వాధికారియైన దేవుని మహాదినమున జరుగు యుద్ధమునకు లోకమంతట ఉన్న రాజులను పోగుచేయవలెనని వారి యొద్దకు బయలువెళ్ళి, హెబ్రీ భాషలో హార్ మెగిద్దోనను చోటుకువారిని పోగుచేసెను." ప్రకటన 16:12-15.



తూర్పు ఆసియా దేశములను గూర్చి ఎక్కువగా ప్రవచన రూపములో చెప్పబడకున్నను, పై ప్రవచనము ద్వార తూర్పు ఆసియా దేశములు మెగిద్దోనను స్థలమందు జరుగబోవు యుద్ధములో పాల్గొనునని, ఇది ప్రపంచమునకు వచ్చేడి శ్రమల అంతపు రోజులలో జరుగునని భావించుటకు అవకాశము కలదు. దానియేలు ప్రవక్త ద్వార తెల్పబడినట్లుగా, ఈజిప్టు, ఇశ్రాయేలు దేశములను నాశనముచేసిన పిమ్మట, తూర్పు రాజ్యములు మృగము యొక్క రాజ్యమును ఎదిరించుటవలన మృగము వీనితో యుద్ధము చేయునని స్పష్టముగా యున్నది.

"అంతట తూర్పు నుండియు ఉత్తరము నుండియు వర్తమానములు [illegible] యతని (మృగమును) కలతపరచును గనుక అత్యాగ్రహము కలిగి [illegible]ను పాడుచేయుటకును నశింపచేయుటకును అతడు బయలు [illegible]." దానియేలు 11:44.

(ప్రవచనముల ఆదేశానుసారముగా) తూర్పురాజ్యములు
మధ్యాసియా ప్రాంతముపై అంతిమశ్రమలలో జలలాదాడిజరుపుట



పై ప్రవచనము, తూర్పు రాజ్యములు మొదట మృగపు రాజ్యమును ఎదిరించునని, అయితే చివరకు మృగము వీనిని జయించుటద్వార ఈ రాజ్యము లన్నింటికిని అధిపత్యము వహించి, ప్రపంచమంతటిని 3 1/2 సం॥లు మహా అధికారముతో ఏలునని తెలియుచున్నది. ఈ విధముగా, తూర్పు రాజ్యములను జయించుట ద్వార మృగము ప్రపంచమునకు ఏకాధిపత్యము వహించును.

కొద్ది కాలములోనే, తూర్పు దేశములు బలమైన దేశములుగా వృద్ధిచెందుట, నేడు మనము కాంచుచున్నాము. ఇవి కొద్ది రోజులలో, ఇశ్రాయేలు ప్రాంతమును స్వాధీనపర్చుకొనబోవు దేశమును ఎదిరింప శక్తిగలవిగా అభివద్ధి నొందును.

గత 20 సం॥లలో చైనా ఎంతో వృద్ధి గాంచుటయేకాక, ప్రపంచమందలి శక్తిగల ఐదు దేశములలో ఒకటిగా పరిగణింపబడుచున్నది. నేడు ఈ దేశ జనాభా 800,000,000 గా నున్నది. ఈ శతాబ్దపు చివరిలో 1,400,000,000 వరకు పెరుగుననెడి అంచనా కలదు. ఇది ప్రపంచమందు జనాభాలో పెద్ద దేశముగా పరిగణింపబడుచు, శక్తివంతమైన దేశములతో సమానత్వమును కాంక్షించుచున్నది.

చైనా అణుశక్తిలో గొప్ప దేశముగా గుర్తించబడినది. చియన్ సుహె షెన్ (Chien Hsueh-shen) అనే చైనా శాస్త్రజ్ఞుడు, అమెరికాలో అణుఅస్త్రములో తర్ఫీతుపొంది, 1965 లో తిరిగి తన దేశమునకు వచ్చి అణుశాస్త్రమును తయారుచేసి 1966 లో దీనిలో కృతార్థుడయ్యెను. ఇప్పుడు చైనా ICBM (Inter Continental Ballistic Missile) లను 1975 వరకు ఉత్పత్తిచేసి, ఉపయోగించుటకు సిద్ధముగా యుండునని భావింపబడుచున్నది.

చాలా సంవత్సరములవరకు కమ్యూనిష్టు చైనా ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వము నొందకుండెను. గాని చివరకు 1971 అక్టోబరులో ఐక్యరాజ్య సమితిలో చేర్చుకొనబడెను. తరువాత 1972 ఫిబ్రవరిలో అమెరికా ప్రెసిడెంటు నిక్సన్ కమ్యూనిష్టు చైనాను దర్శించి, దానితో శాంతి సమాధానములు నెలకొల్పెను.

చైనా, అమెరికాతో స్నేహమునకు ఈ క్రింది మూడు విషయముల కొరకు అంగీకరించెను:—

1. రష్యా చైనాపై ఆక్రమణ జరుపకుండ శక్తి కల్గియుండుటకై, అమెరికా సహాయము అవసరము.

2. చైనా సముద్రపు లోతులో నున్న పెట్రోలు మొదలగు నూనెలను తీయుటకు, అమెరికా సాంకేతిక విద్యానైపుణ్యము అవసరము. ఈ రంగ మందు చైనా నైపుణ్యత సంపాదించుటకు చాలా సంవత్సరములు పట్టును. కాని అమెరికాతో స్నేహము కల్గియున్న వెంటనే లాభము పొందవచ్చును.

3. అమెరికాతో మైత్రి కల్గియుండుట ద్వార, తూర్పు ఆసియా ప్రాంత ములో అమెరికా ప్రభావము తగ్గే సూచనలు కలవు. అంతేకాక అమెరికా ఈ ప్రాంతములలో నుంచిన తన రక్షణ సైన్యమును మొదలగు వాటిని ఉపసంహరించుకొనవచ్చును. అమెరికా జపానుతో కలిగియున్న సంబం ధమును కూడా తెంచుకొన వీలై, జపానుతో చైనా స్నేహ సంబంధము కలించుకొనుటకు ఆస్కారము కలుగును. వీటన్నింటిని దృష్టిలో నుంచు కొనియే చైనా అమెరికాతో స్నేహమును కాంక్షించినది.

జపాను రెండవ ప్రపంచ యుద్ధము తర్వాత గొప్ప అభివృద్ధి కాంచెను. ఇది ప్రపంచమందు ఆర్థికముగా గొప్ప బలమైన దేశముగా నెంచబడెను. ఈ దేశము ప్రపంచమందలి అన్ని దేశములతో వ్యాపార వాణిజ్య రంగ ములందు సంబంధము కల్గియుండి, వ్యాపార ఆర్థిక స్తోమత 200 బిలి యనుల డాలర్లు (బిలియను=లక్షకోట్లు)గా యున్నది ఇది పారిశ్రామిక రంగమందు అమెరికా, రష్యా దేశముల తరువాత మూడవ స్థానము ఆక్రమించినది.

జపాను దేశము కొన్ని సం॥ క్రితము చైనాద్వార ఇంపీరిలిస్టు(రాజుకు సం బంధించిన)సామ్రాజ్యముగా నెంచబడెను. కాని 1972లో జపానుకు తనాకా, క్రొత్త ప్రధానమంత్రిగా ఎన్నుకొనబడిన తరువాత దేశ రాజకీయములందు మార్పువచ్చి, ఇరువురి మధ్య స్నేహ చిహ్నములు పొడచూపెను. ఇట్లు జపాను, చైనా దేశములు త్వరలో మైత్రిని నెలకొల్పుకొనగలవు. తరువాత

తూర్పు రాజ్యములన్నియు స్నేహముకలిగి యూరపునందు రాబోయే రాజ్యముల ఆధిపత్యమును ఎదిరించి, మధ్య ఆసియా (ఇశ్రాయేలు) సమస్యయందు ఇరుపక్షముల వారు తమ బలాబలములు చూచుకొనెదరు.

# త్వరలో జరుగబోవు సంగతులు

యేసు ప్రభువు—"ఆ ప్రకారమే మీరీ సంగతులన్నియు జరుగుట చూచునప్పుడు ఆయన సమీపముననే, ద్వారము దగ్గరనే యున్నాడని తెలిసికొనుడి" మత్తయి 24:33.

". వచ్చునట్టి రాజుయొక్క ప్రజలు పవిత్ర పట్టణమును పరిశుద్ధ ఆలయమును నశింప జేయుదురు. వాని అంతము హఠాత్తుగా వచ్చును, మరియు యుద్ధ కాలాంతము వరకు నాశనము జరుగునని నిర్ణయింపబడెను" దానియేలు 9:26.

రాబోవు దినములలో ప్రపంచ రాజకీయ మత సంబంధమైన రంగములందు పరిస్థితులు నేటికన్న మిక్కిలి అధమ స్థితికి దిగజారును. ఈ విషయములే తర్వాత వచ్చెడి ఆధ్యాయములలో వివరింపబడి యున్నవి.

ప్రపంచ క్రైస్తవ మత సంబంధమైన వివిధ డినామినేషన్ లన్నియు ఐక్యత నొందుటకు కృషి సల్పును. మొదట ప్రొటస్టెంటు సంఘములన్నియు ఒక్కటిగా రూపొందును. దీని తర్వాత కాథలిక్, ఆర్థడాక్సు, ప్రొటస్టెంటు సంఘములన్నియు కలిసి ఏకమగును. స్వమత పరిత్యాగము (Apostasy) హెచ్చై, వృద్ధి చెందును. బైబిళ్ళు, తర్జుమా పేరున చిన్నాభిన్నములుగ చేయబడి, దానిలోని సత్యముల, ధర్మవాక్యముల, భావము మార్పొందుట జరుగును. సువార్తను ప్రకటించే పెక్కు సంఘములు, సర్వజనులకు ఇష్టమగు విధముగా, తమ విశ్వాసమును, కార్యములను మార్చుకొని నడుచును.

ప్రపంచ సంఘటనలు రానురాను హీనస్థితికి దారితీయును. భూకంపములు, తెగుళ్ళు, తుఫానులు, చెడువాయువు, జనాభివృద్ధి, కరవులు మొదలగునవి హెచ్చుగును. దినములు గడచుచున్న కొలది, ప్రపంచ స్థితి, అపవి

త్రత, బూతు పటముల ప్రదర్శనములు, బూతు సాహిత్యము, మాన భంగ ములు, పురుషగాముల చర్యలు మొదలగునవి విపరీతముగా పెరిగి, సొదొమ గొమొఱ్ఱాల స్థితికంటే హీనమగును. భవిష్యత్తులో ఏమగునో, అనెడి భయము ద్వార మనోచింతగలవారై, శాంతి సుఖములను పొందు టకు మనుష్యులు లోకమందు అటు ఇటు తిరుగుదురు. 1000 ప్రయా ణికులు ప్రయాణించ వీలగు విమానములు నిర్మించబడును. ఇట్లు ప్రయాణమందు ఆధునిక వాహనముల ద్వార లోక పరిధి చిన్నదిగా చేయబడును.

అంధకార శక్తులకు సంబంధించిన, చేతబడి (చిల్లంగితనము), సోదె మొదలగునవి ప్రపంచమందు విరివిగా ప్రాకును. మత్తు పదార్థములకు మనుష్యులు బానిసలగుదురు. ఈ అలవాటు, ప్రభావము రాను రాను ఆఫ్రికా, ఆసియా, పశ్చిమ దేశములందంతట ప్రాకిపోవును.

సరియైన ఆహారము లభించక జనులు కరువులద్వార అలమటించుచు బాధ లకు లోనగుదురు. ఆహారము కొరకు అలజడులు, జాతి కులమత భేద ముల కలహములు, పనివారల సమ్మెలు, యువతరపు వారి తిరుగుబాటులు మొదలగు పెక్కు సమస్యలు తీర్చ వీలుకాకుండ అధికమగును. చట్టము లకు విరుద్ధముగా జనులు తిరుగుబాటు చేయుచు, తమ ఉద్దేశములను నెర వేర్చుకొనుటకు దౌర్జన్యములకు దిగుదురు. ఇవి ప్రతి దేశమందును జరుగును.

ఆయుధముల నిర్మాణ వ్యయము ప్రతి సంవత్సరము హెచ్చగును. ప్రపంచమందు, తీరని క్రొత్త సమస్యలవలన యుద్ధములు అధికమగును. కమ్యూనిజము పెక్కు దేశములను ఆక్రమించును. అణు అస్త్రముల విస్త రణ హెచ్చై, మిక్కిలి భీతి చెందించు సమస్యగా రూపొందును.

మనుష్యునికి శాస్త్ర విజ్ఞానమందు జ్ఞానాభివృద్ధి అగు కొద్ది గర్వము హెచ్చగుచు, తాను అనుకొన్నది చేయుటకు, పరిస్థితులను తనకనుగుణ ముగా మార్చుటకు సమర్థుడను అనే అహంభావము కలుగును. కాని, క్రొత్త రోగములు, మానసిక వ్యాధులు, ఆత్మహత్యలు, తెగుళ్ళు, భయము, నిరాశ మొదలగు తీరని సమస్యలద్వార మనుష్యులు వేదనలకు గురి అగుదురు.

ఉత్పత్తి, వ్యాపార రంగములకు సంబంధించిన కార్యములన్నియు దేశ ప్రభుత్వము ఆధీనములోనికి తేబడి చివరకు, ప్రపంచ నియంత పరిపాలనకు అనుగుణముగా మార్చబడును.

అమెరికా దేశము, ఎన్నో దేశములందున్న తన సైన్యములను ఉపసంహరించుకొనును. యూరపు సంయుక్త ప్రభుత్వపు అవతరణకు దారి తీయుచు, యూరపు రాజ్యములు బలిష్ఠములగును. రష్యా, ఇశ్రాయేలు, ఈజిప్టు మొదలగు మధ్య ఆసియా (మిడిల్ ఈస్టు) దేశములను, తక్కిన ప్రపంచ దేశములను తన అధికారములోనికి తెచ్చుకొనుటకు నానా యాతన పడును. తూర్పు రాజ్యములు శక్తివంతముగా మారును.

ఇశ్రాయేలు అభివృద్ధి నొంది అణుశక్తి యందు గొప్ప దేశముగా ఎంచబడును. ఇశ్రాయేలునకు అరబ్బు రాజ్యములతో యుద్ధములు తీరక జరుగుచునే యుండును. ఇశ్రాయేలు, అరబ్బులమధ్య జరుగు యుద్ధమందు, 'డోమ్ ఆఫ్ ద రాక్' మసీదు నాశనము కావింపబడి, లేక భూకంపము ద్వార దాని స్థానముననే యూదుల దేవాలయము నిర్మించబడును. యూరపు సంయుక్త రాజ్యముల ప్రభుత్వము ద్వారా నెలకొల్పబడిన శాంతి తాత్కాలికముగా యుండి, శాంతిని నెలకొల్పుట ప్రపంచమందు అసంభవముగా యుండును.

రాబోవు దినములలో, తాత్కాలికముగా సమస్యలు తీరినట్లుగా కాన్పించినను, వేరే సమస్యలు అకస్మాత్తుగా ఉద్భవించి, ప్రపంచ పరిస్థితి భయంకరమగును. సమస్యలను తీర్చుటకు చేయు కార్యములన్నియు తాత్కాలికముగా ఉండును. ప్రపంచము సమస్యలతో మునిగిపోవుచున్న ఓడ రీతిగా యుండగా; దేవుని తీర్పు, ప్రవాహమువలె వచ్చి దీనిని పూర్తిగా ముంచివేయును. ప్రపంచమునకు రాబోయే శ్రమల రోజులు నిశ్చయముగా వచ్చును. వీనినుండి లోకము తప్పించుకొనలేదు.

మనిషి తాను, తన కుటుంబము రక్షింపబడుటకు, నోవహు చేసినట్లు, దేవుని ఓడ యగు ఆయన రక్షణ సంకల్పములోనికి వచ్చుట ద్వార రక్షింపబడును. మనుష్యుడు, లోతువలె, దేవుని మాటను విని దేవుని ఉగ్రతను తప్పించుకొనుటకు లోకమునుండి (లోక కార్యముల నుండి)

బయటకు వెడలి రావలెను. దేవుని చిత్త ప్రకారము చేయచూచు మనుష్యుడు, తన్ను తాను రక్షించుకొనుటకే చూడక, ఇతరులు కూడ ఆ ఉగ్రత రోజులనుండి తప్పింపబడునట్లుగా, వారి రక్షణ కొరకై పాటు పడుచు, ఆయన రాకకొరకై ఎదురు చూడవలెను.

లోకాంతము విషయమై బైబిలులో చెప్పబడిన ముఖ్యమైన సంగతు లన్నియు నేడు జరుగుచున్నవి. అంతము ప్రవాహమువలె రానై యున్నది. అయ్యో! ఆ రోజులలో ఆయన రాజ్యములోనికి ప్రవేశించు టకు చాలామంది సిద్ధపాటుతో యుండరు. కావున నోవహు రోజులలో జరిగిన రీతిగా దేవుని ఉగ్రతకు వారు తప్పక గురి యగుదురు.

# క్రీస్తునందున్న విశ్వాసులు ఎత్తబడుట

కొన్ని రోజులలో, ఇంతవరకు కని విని సంఘటన జరుగును. అదే మనగా— క్రీస్తు నందున్న విశ్వాసులు, లోకమంతటి నుండి, ఒకే క్షణ మందు ప్రభువుతో సదాకాలము యుండుటకు ఎత్తబడెదరు. విశ్వాసు లందరు, ప్రపంచమంతట ఒకే క్షణమందు ఎత్తబడి (Raptured) అదృశ్యులగుట ద్వార, లోకము విభ్రాంతిలో మునుగును.

ఈ సంఘటన విషయమై, ప్రజలలో నమ్మకము పుట్టించుటకు, శాస్త్ర జ్ఞులు అంతరిక్షములోని ఒక ప్రభావము ద్వార వీరు కొంచుక పోబడి నారని, ఇంకా వేరే రకములైన కథలను చెప్పి నమ్మించచూతురు. అయితే ఈ సంఘటన నెరవేర్పు విషయమై బైబిలులో ముందుగానే ప్రవచింపబడియున్నది.

---

"ఆర్భాటముతోను, ప్రధాన దూత శబ్దముతోను, దేవుని బూరతోను పర లోకమునుండి ప్రభువు దిగివచ్చును. క్రీస్తు నందుండి మృతులైనవారు మొదట లేతురు. ఆ మీదట సజీవులమై నిలిచియుండు మనము వారితో కూడ ఏకముగా ప్రభువును ఎదుర్కొనుటకు ఆకాశ మండలమునకు మేఘ ముల మీద కొని పోబడుదుము. కాగా మనము (విశ్వాసులు) సదాకాలము ప్రభువుతో కూడ ఉందుము." (1 థెస్సలొనీకయులకు 4:16-17).

---

ఆకాశములోనికి మనిషి 5000 అడుగుల ఎత్తుకన్న పైకి వెళ్ళిన ప్రాణ వాయువు (oxygen) లేక చనిపోవును. మరి ఈ సంఘటన ఎలాగు జరుగగలదు? మనుష్యులు ప్రభువుతో ఎలాగు కలిసెదరు? అనెడి సందేహ ములు పలువురికి కలుగును. అయితే బైబిలు ఇది సంభవమని, ఎత్త బడక పూర్వమే శరీరమందున్న విశ్వాసులు నూతన - అక్షయ శరీర మును పొందెదరని తెలుపుచున్నది.

---

పౌలు — "ఇదిగో మీకు ఒక మర్మము తెలుపుచున్నాను. మనమంద రము నిద్రించముగాని నిమిషములో, ఒక రెప్పపాటున (twinkling of an eye) కడబూర మ్రోగగానే మనమందరము మార్పు పొందుదుము. బూర మ్రోగును; అప్పుడు మృతులు అక్షయులుగా లేపబడుదురు, మనము (సజీవులుగా నున్న విశ్వాసులు) మార్పు పొందుదుము. క్షయమైన యీ శరీరము అక్షయత ధరించుకొనవలసి యున్నది; మర్త్యమైన యీ శరీ రము అమర్త్యతను (immortality) ధరించుకొనవలసి యున్నది" 1 కొరింధి 15;51-53.

---

ఇప్పుడు మనము ధరించియున్న మంటి శరీరమువలె కాక ఆ దినమున అమర్త్యత నొందిన శరీరము అంతరిక్ష, లోక ప్రభావము వలన ఏ హాని నొందక యుండును.

ఈలాగు ఒకే క్షణమందు ఎత్తబడే కోట్లకొలది విశ్వాసులు, ఎందుకు ఎత్తబడుచున్నారు? ఎచ్చటికి పోవుచున్నారు? అనెడి ప్రశ్నలు అనేకులలో కల్గును. క్రీస్తును తమ స్వరక్షకునిగా విశ్వసించి, ఆయన చిందించిన రక్తముద్వారా కడుగబడి, తమ పాపములకొరకై యేసుప్రభువు చని పోయినాడని విశ్వసించి, తమ పాపములకై పశ్చాత్తాపము నొందినవారు (క్రీస్తునందు విశ్వాసులు) మాత్రమే ఈలాగు ఎత్తబడెదరు. (Raptured) వీరు ఈ క్షణముకొరకే, ప్రభుమాటను విశ్వసించి తమ జీవిత కాల మంతయు కనిపెట్టుచు యుండినవారు.

యేసు ప్రభువు— "నా తండ్రి ఇంట అనేక నివాసములు కలవు. లేని యెడల మీతో చెప్పుదును, మీకు స్థలము సిద్ధపరచ వెళ్ళుచున్నాను. నేను వెళ్ళి మీకు స్థలము సిద్ధపరచిన యెడల నేనుండు స్థలములో మీరును ఉండులాగున మరల వచ్చి నా యొద్ద నుండుటకు మిమ్ము్మను తీసికొని పోవుదును" యోహాను 14:2-3.

ఈ విధముగా ఆకాశములోనికి ఎత్తబడే విశ్వాసులు, నిజమైన క్రీస్తు సంఘమునకు చెందినవారు. వీరు తమ తండ్రియైన దేవుడు పరలోక మందు వీరికొరకు నిర్మించిన నివాసములలో సదాకాలము, ప్రభువుతో సహా యుండుటకు ఎత్తబడెదరు. (Raptured).
ఈ విధముగా, ప్రభువు తన సంఘము - క్రీస్తు శరీరమునకు చెందిన విశ్వాసులను లోకమందలి అన్నిదేశముల నుండి సమకూర్చి, తనతో కూడ వారు యుండుటకు సిద్ధపరచిన నివాసములలోనికి చేర్చును.
క్రీస్తు సంఘము ఎత్తబడిన పిమ్మట, దేవుడు తాను సంకల్పించిన ఉద్దేశమును, భూజనుల యందు, ఇశ్రాయేలీయుల పట్ల నెరవేర్చును.
పై సంగతే కాక, విశ్వాసులు జ్ఞప్తికి యుంచుకొనవలసినది మరియొకటి కలదు. అది క్రీస్తు న్యాయతీర్పు సింహాసనము. ఈ తీర్పు విశ్వాసులు ఎత్తబడిన తర్వాత తండ్రియగు దేవుడు వారికొరకు సిద్ధపరచిన నివాసములలోనికి చేర్చబడిన తరువాత జరుగును. ఈ తీర్పు వారి పాపముల కొరకై, చేయబడినది కాదు, ఎందుకనగా వారి పాపములకొరకై, అందరికొరకై క్రీస్తు చనిపోయినప్పుడే, ఆయనయందు ఆ తీర్పు తీర్చబడెను. ఇచ్చట విశ్వాసులకు జరుగబోయే తీర్పు, వారి క్రియలను బట్టి తీర్చబడును. అవి ఏవనగా, వారు ఆత్మీయ సంబంధముగా చేసిన క్రియలకు తగినట్లుగా వాడబారని బహుమతులను పొందెదరు. శరీర, లోక సంబంధముగ చేసిన క్రియలు కాల్చివేయబడును. ఈ విధముగా, ప్రతి విశ్వాసి లోకమందు తాను ప్రభువుకు నమ్మకముగా చేసిన ప్రతి కార్యమునకు ప్రతిఫలము పొందును. ప్రతివారు ఇట్లు బహూకరించబడెదరు. నమ్మకముగా లేని విశ్వాసులు రక్షింపబడెదరు, కాని అగ్నినుండి తప్పింపబడినట్లుగా రక్షింపబడి నష్ట పొందెదరు.

"అయితే నీవు నీ సహోదరునికి తీర్పు తీర్చ నేల? నీ సహోదరుని నిరాకరింప నేల? మనమందరము దేవుని పీఠము ఎదుట నిలుతుము" రోమా 14:10.

"పునాది మీద ఒకడు కట్టినపని నిలిచిన యెడల వాడు జీతము పుచ్చుకొనును. ఒకని పని కాల్చివేయ బడినయెడల వానికి నష్టము కలుగును అతడు తనమట్టుకు రక్షింపబడును గాని అగ్నిలోనుండి తప్పించు కొన్నట్లు రక్షింపబడును." 1 కొరింథి 3:14_15.

యేసు ప్రభువు—"ఇదిగో త్వరగా వచ్చుచున్నాను. వాని వాని క్రియల చొప్పున ప్రతివాని కిచ్చుటకు నేను సిద్ధపరచిన జీతము నాయొద్ద ఉన్నది" అని చెప్పుచున్నాడు. ప్రకటన 22:12.

సంఘము(Church)ఎత్తబడే దినము ఎన్నడో, ఎప్పుడో లోకమందున్న ఎవనికిని తెలియదు. కావున ఎవడును, ఫలాని రోజున సంఘము ఎత్తబడునని తేదీ నిర్ణయించుటకు వీలులేదు. ఎవ్వరేని ఆలాగు చెప్ప చూచినను నమ్మకుడి. ఈలాగున చాలామంది తేదులను నిర్ణయించి మనుష్యులను మోసముచేసిరి. కాని ప్రభువు చెప్పిన రీతిగా, ఇది జరుగకముందు తాను చెప్పిన కొన్ని సూచనలు లోకమందు జరుగును. వాటి విషయమై ప్రభువు చెప్పుచు, "అంజూరపు చెట్టును చూచి ఉపమానము నేర్చుకొనుడి. అంజూరపు కొమ్మ లేతదై చిగిరించునప్పుడు వసంత కాలము యింక సమీపముగా ఉన్నదని మీకు తెలియును. ఆ ప్రకారమే మీరీ సంగతులన్నియు జరుగుట చూచునప్పుడు ఆయన సమీపముననే, ద్వారము దగ్గరనే యున్నాడని తెలిసికొనుడి" మత్తయి 24:32_33.

"అయితే ఆ దినమును గూర్చియు ఆ గడియను గూర్చియు తండ్రి మాత్రమే యెరుగును గాని, యే మనుష్యుడైనను పరలోకమందలి దూతలైనను కుమారుడైనను ఎరుగరు" మత్తయి 24:36.

యేసు —"ఇవి జరుగు నారంభించినప్పుడు మీరు ధైర్యము తెచ్చుకొని మీ తలలెత్తికొనుడి, మీ విడుదల సమీపించుచున్నదనెను" లూకా 21:28

ఇచ్చట ప్రభువుచెప్పిన "విడుదల" అనునది శరీరమునకు సంబంధించిన సకల కష్టములు, బాధలు, హింసలు మొ॥ వాటినుండి విడుదలనొంది మర్త్య శరీరము వీడి అమర్త్య శరీరము (Immortal body) ధరించు కొనే క్షణము వచ్చెనని గ్రహించుటకు విశ్వాసుల కొరకై తెల్పబడినది. (1 కొరింథీయులకు 15:51-53 చదువుము. విశ్వాసులు, లోకాంతమునకు ముంగుర్తుగా జరుగబొయ్యేడి సంగతులను కొన్నింటిని మాత్రమే చూచెదరు. కాని అన్నింటిని చూడలేరు. ఎందుకనగా, వీరు రాబోయే శ్రమల ఆరంభ రోజులకు ముందుగానే ఎత్తబడెదరు (Raptured). శ్రమల రోజులలో సంఘము భూమిపై యుండునని తెల్పుటకు వాక్యాధారము లేదు. ఎందుకనగా ప్రభువు — *మీరీ సంగతులన్నియు జరిగిన పిమ్మట* మీరు ధైర్యము తెచ్చుకొని మీ తలల నెత్తికొనుడి, మీ విడుదల సమీపించుచున్నదని చెప్పలేదు కాని ఇవి జరుగ *నారంభించినప్పుడు* మీరు ధైర్యము తెచ్చుకొని మీ తల లెత్తికొనుడి. మీ విడుదల సమీపించుచున్నదనెను. ఈ మాటను మనము జాగ్రతగా గమనించిన, విశ్వాసులకు ఆయన మాటద్వార *సంఘము ఎత్తబడుట శ్రమల కాలమునకు ముందే జరుగునని* తెలియును. వీని ముందటి అధ్యాయములలో వివరించబడినట్లుగా, ప్రభువు చెప్పిన సూచన లన్నియు నేడు నెరవేరుటకు ఆరంభించుచున్నవి. గనుక విశ్వాసులకు ఆయన నుండి పిలుపు ఏ క్షణమందైనను రావచ్చును. ఆయన పిలుపు ఏనాడైనను వచ్చుననెడి భయముతో సిద్ధపడియుండెదము. లోక మందు వచ్చెడి శ్రమల దినములు గడిచిన పిమ్మట, శ్రమల ద్వార మను ష్యులు ధైర్యము చెడి గుండెలు చెదరు సమయమున, "మనుష్య కుమారుడు (యేసు క్రీస్తు) ప్రభావముతోను మహా మహిమతోను మేఘారూఢుడై వచ్చుట చూతురు." లూకా 21:27.

సంఘము రాబోయే శ్రమల రోజులలో లోకమందు యుండునని చెప్ప బడలేదు. కావున సంఘము ఇంతకుముందే పొందిన, హింసలు, కష్ట ములు మొ॥ కాక, దేవుని ఉగ్రతరోజున, యాకోబు (ఇశ్రాయేలీయుల) శ్రమల రోజులలో పాలివారుగా యుండక, ఈ రోజులు రాక పూర్వమే విశ్వాసులు ఎత్తబడుదురు. సంఘము రాబోయే శ్రమల రోజుల కొరకు

కనిపెట్టవలెనని లేక జాగరూకతతో యుండవలెనని చెప్పబడక, సంఘము (విశ్వాసులు) ప్రభురాకడ కొరకు సంసిద్ధతతో, ఆయన సమ్ముఖమందు నిర్దోషులముగా నిలువబడునట్లుగా, నిరీక్షణ గలవారమై యుండవలెనని చెప్పబడియున్నది. (మత్తయి 24:42-44. మార్కు 13:33-37, ప్రకటన 3:11, 22:7, 12, 20 చదువుము).

"క్రీస్తు సంఘము ఎత్తబడునప్పుడు దానిలో భాగస్థులైనవారు ధన్యులు. మరణము చెందకుండనే ఆయనతో నుండుటకు ఎత్తబడుట—ఇది ఎంత సంతోషము, ఉత్సాహము పుట్టించు సంఘటన! ఇక రోగము, విచారము, ఏడ్పులు మనకు లేవు. క్రీస్తు ప్రభువు తనవారిని చేర్చుకొను దినమందు. మేఘముల మీద వారు మహిమలోనికి ఎత్తబడి చేర్చుకొనబడెదరు".

—H. L. టర్నర్.

సంఘము ఎత్తబడిన తరువాత లోకమందు మిగిలిన జనులకు శ్రమలు కలుగును అయ్యో! వారు రాబోవు శ్రమల రోజులకొరకై భద్ర పరచబడి, వానిని అనుభవింతురు. "నీవు (విశ్వాసి) నా ఓర్పు విషయమైన వాక్యము ను గైకొంటివి గనుక భూనివాసులను శోధించుటకు లోకమంతటి మీదికి రాబోవు శోధన కాలములో నేను (యేసుప్రభువు) నిన్ను కాపాడెదను" ప్రకటన 3:10.

# శ్రమల రోజుల ఆరంభము

"లోకారంభము నుండి ఇప్పటివరకును అట్టిశ్రమ కలుగలేదు. ఇక ఎప్పుడును కలుగబోదు" మత్తయి 24:21.

ఈ శ్రమల దినములను గూర్చి దాదాపు 100 పర్యాయములకన్న ఎక్కువ సార్లు బైబిలులో తెల్పబడినది. ఈ విషయమై పాతనిబంధనలో మోషే, యెషయా, యిర్మియా, యెహెజ్కేలు, దానియేలు, ఆమోసు, ఓబద్యా, జెఫన్యా, జెకర్యా, మలాకీ మొదలగు ప్రవక్తలు మరియు క్రొత్త నిబంధనలో ప్రభువైన యేసు క్రీస్తు, పౌలు, పేతురు, యోహాను మొదలగు అపొస్తలులు కూడ తెల్పిరి.

ఈ శ్రమల రోజులు రెండు ఉద్దేశములను నెరవేర్చుటకై రానై యున్నవి. మొదటిది: ఇవి ఇశ్రాయేలీయుల కొరకై ఏర్పాటు చేయ బడెను. వారు, ఈ శ్రమల ద్వార ఎంతగా బాధ చెందుదురనగా, వీని ద్వార, వారు తమ్మును సృజించిన దేవుని వైపుకు దీన మనస్సుతో తిరుగ వీలగును. ఇట్లు వీరు మారిన మనస్సుతో తమ మెస్సీయాను స్వీకరించు టకు వీలగును.

దేవుడు అంత్యకాలములో దేవునిశక్తి ద్వార నియమింపబడిన ఇద్దరు ప్రవక్తలను లోకమునకు తన సాక్షులుగా పంపును. వీరు దేవుని సాక్షులుగా లేక ప్రవక్తలుగా యుండి, ఇశ్రాయేలీయులను తమ దేవునివైపు త్రిప్పుదురు. చివరి కాలమందు చాలమంది ఇశ్రాయేలీయులు తమ మెస్సీయాను గుర్తించి రక్షణ పొందెదరు.

"సహోదరులారా, మీదృష్టికి మీరేబుద్ధిమంతులమని అనుకొనకుండునట్లు ఈ మర్మము మీరు తెలుసుకొన గోరుచున్నాను. అదేమనగా, అన్యజనుల ప్రవేశము సంపూర్ణమగు వరకు ఇశ్రాయేలునకు కఠిన మనస్సు కొంతమట్టుకు కలిగెను. వారు ప్రవేశించునప్పుడు-విమోచకుడు సీయోనులో నుండి వచ్చి యాకోబులో నుండి భక్తిహీనతను తొలగించును; నేను వారి పాపములను పరిహరించినప్పుడు నావలన వారికి కలుగు నిబంధన ఇదియే అని వ్రాయబడినట్టు ఇశ్రాయేలు జనులందరును *రక్షింప బడుదురు*" రోమా 11:25-27.

అన్య జనాంగములవారు (ఇశ్రాయేలీయులు కానివారు) ప్రపంచమంతట, నిజ రక్షకుని తెలిసికొని రక్షింపబడెదరు. దేవుడు పంపిన ఇద్దరు ప్రవక్తల ద్వార ఇశ్రాయేలీయులలో అనేకులు రక్షింపబడెదరు.

"....ఆ దినమున యెహోవా నామమును బట్టి ఆయనకు ప్రార్థన చేయు వారందరును రక్షింపబడుదురు" యోవేలు 2:32.

ఈ శ్రమలు కలుగుటకు గల రెండవ ఉద్దేశము: దేవుడు ఈ శ్రమల రూపములో అవిశ్వాసులను, చెడ్డవారిని శిక్షించుటకు జరుగును. వీరు ఎలాటి శ్రమలను పొందెదరో ప్రకటన గ్రంథమందు ప్రవచింపబడినది.

ఈ క్రింద వివరింపబడిన ప్రవచనముల ద్వార, ఆ నాటి శ్రమల రోజులు ఎలాగుండునో గ్రహింప వీలగును:

"సీయోను కొండమీద బాకా ఊదుడి నా పరిశుద్ధ పర్వతము మీద హెచ్చరిక నాదము చేయుడి యెహోవా దినము వచ్చుచున్నదనియు అది సమీపమాయెననియు దేశ నివాసులందరు వణుకుదురు గాక. ఆ దినము అంధకారమయముగా ఉండును మహాంధకారము కమ్మును. మేఘములును గాఢాంధకారమును ఆ దినమున కమ్మును. పర్వతములమీద ఉదయకాంతి కనబడునట్లు అవి కనబడుచున్నవి. అవి బలమైన యొక గొప్ప సమూహము. ఇంతకుముందు అట్టివి పుట్టలేదు. ఇక మీదట తరతరములకు అట్టివి పుట్టవు" యోవేలు 2:1-2.

"అయ్యో యెంత భయంకరమైన దినము! అట్టి దినము మరియొకటి రాదు. అది యాకోబు సంతతివారికి (ఇశ్రాయేలీయులకు) అపద తెచ్చు దినము; అయినను వారు దానిలో పడకుండ రక్షింపబడుదురు" యిర్మీయా 30:7.

"యెహోవా మహాదినము సమీపమాయెను, యెహోవా దినము సమీపమై అతి శీఘ్రముగా వచ్చుచున్నది. ఆలకించుడి, యెహోవా దినము వచ్చుచున్నది. పరాక్రమశాలులు మహా రోదనము చేయుదురు. ఆ దినము ఉగ్రత దినము, శ్రమయు ఉపద్రవమును మహా నాశనమును కమ్ము దినము" జెఫన్యా 1:14-15.

"మరియు సూర్య చంద్ర నక్షత్రములలో సూచనలును, భూమిమీద సముద్ర తరంగముల ఘోషవలన కలవరపడిన జనములకు శ్రమయు కలుగును. ఆకాశమందలి శక్తులు కదిలించబడును. గనుక లోకముమీదికి రాబోవుచున్న వాటి విషయమై భయముకలిగి, మనుష్యులు ఎదురు చూచుచు ధైర్యముచెడి కూలుదురు" లూకా 21:25-26.

భూరాజులును, ఘనులును, సహస్రాధిపతులును, ధనికులును, బలిష్ఠులును, ప్రతి దాసుడును, ప్రతి స్వతంత్రుడును కొండ గుహలలోను బండల సందులలోను దాగుకొని — సింహాసనాసీనుడై యున్న వాని యొక్కయు గొఱ్ఱెపిల్ల యొక్కయు ఉగ్రత మహాదినము వచ్చెను;

దానికి తాళ జాసినవాడెవడు? మీరు మా మీదపడి ఆయన సన్నిధికిని గొర్రెపిల్ల ఉగ్రతకును మమ్మును మరుగుచేయుడి అని పర్వతములతోను, బండలతోను చెప్పుచున్నారు" ప్రకటన 6:15-17.
శ్రమల రోజులలో, దేవుడు లోకమునకు తీర్పు తీర్చుటకై, ఎన్నో విధములైన శ్రమలను కలుగచేయును. వానిలో ప్రకృతి సంబంధమైన శ్రమలు, మనుష్యుడు నిర్మించిన వైజ్ఞానిక పరిశోధనలు తన నాశనమునకే ఉపయోగపడునవిగా యుండును. ఇవే కాక దేవుడు ఉగ్రత పాత్రల ద్వార కుమ్మరించే తీర్పులు, తెగుళ్ళు మొదలగునవి అనేకములుగా యుండును.
ఈ శ్రమలు ఎన్నిరోజుల వరకు జరుగును?—దానియేలు ప్రవక్త ప్రవచనముల ద్వార, ఇవి ఏడు సంవత్సరముల వరకు జరుగును. (మన క్యాలండరును అనుసరించి 6 సం॥ 329 దినములు ఎందుకనగా ప్రవచన సం॥ 360 రోజులదిగా యుండును). ఈ శ్రమల కాలము తిరిగి రెండు భాగములుగా విభాగింపబడినది. మొదటి శ్రమల భాగము 1260 దినములదిగా యుండి దీని విషయమై ప్రకటన 11:3 లో తెల్పబడినది. మరియు రెండవ శ్రమల భాగము 1260 దినములదిగా యుండి దీని విషయమై ప్రకటన 13:5 లో వివరింపబడినది. మొదటి 3 1/2 సంవత్సరముల శ్రమలు తీవ్రముగా యుండును, మరియు మిగిలిన 3 1/2 సం॥ల శ్రమల దినములు తీవ్రతరముగా యుండును. శ్రమ రోజులు గడుచుచున్న కొలది, దినదినము తీర్పు యొక్క తీవ్రతకూడ హెచ్చగును.
7 సం॥ల శ్రమల రోజులు చాలా కష్టతరమైన దినములుగా యుండును. వీటి వివరణ ఈలాగు జరుగునవి చెప్పుటకు వీలుకాదు. కాని ఈ శ్రమలు ఏ రూపములో కలుగునో, అవి ప్రకటన 4వ అధ్యాయమునుండి 19వ అధ్యాయము వరకు వివరింపబడిన రీతిగా, ఇవి ఏడు సంవత్సరములు జరుగును.

ప్రకటన గ్రంథము, అపొస్తలుడైన యోహానుకు దర్శన రూపముగా తెల్పబడినది. కావననే, ఈ దర్శన భావములన్నియు చాలావరకు మర్మములుగా యుండి కొన్ని సాంకేతిక పదముల ద్వార వివరింపబడినవి. వీనిలో మర్మములుగా భావగర్భితములుగా తెల్పబడిన వానిలో, తెల్లని,

ఎఱ్ఱని, నల్లని, పాండుర వర్ణములు గల గుఱ్ఱములు మొదలగునవి (ప్రకటన 6వ అధ్యాయము) ఉదాహరణముగా తీసికొనవచ్చును. ఇవికాక కరవులు, రక్తపాతము మొదలగు మాటలు భావగర్భితములుగా తెలుప బడక, నిజరూపముగా వివరింపబడినవి.

ప్రకటన 6 నుండి 19 అధ్యాయముల వరకు శ్రమల రోజులలో వచ్చెడి తీర్పులు వివరింపబడినవి. అయితే వీనిలో కొన్నింటిని స్పష్టముగా గ్రహించుటకు, మరికొన్ని ప్రవచనముల (భావముల) తో జతచేసి చూడ వలసి వచ్చును. అప్పుడు ప్రవచనము నంతటిని స్పష్టముగా గ్రహింప వీలగును.

# ప్రథమ అర్ధ శ్రమల రోజులు

## 1. ముద్రలు, బూరల ద్వార కల్గు తీర్పులు

ప్రకటన 6వ అధ్యాయములో వివరించబడినట్లుగా ఒకదాని తరువాత మరి యొకటి జరుగు ఏడు తీర్పులను కలియుండి, ఏడు ముద్రలు గల గ్రంథము యున్నట్లుగా చూడగలము. 6 వ అధ్యాయములో ఈ ముద్ర లను విప్పుటద్వార లోకమందు కల్గెడి శ్రమలను గూర్చి తెప్పబడినది.

ఈ ముద్రలు ఎవ్వరి ద్వారనో కాక, దేవుని గొఱ్ఱెపిల్ల మరియు యూదా గోత్రపు సింహమైన ప్రభువగు యేసు క్రీస్తు ద్వార విప్పబడెను.

"....ఇదిగో దావీదుకు చిగురైన యూదా గోత్రపు సింహము ఏడు ముద్రలను తీసి ఆ గ్రంథమును విప్పుటకై జయము పొందెనని నాతో చెప్పెను" (పకటన 5:5).

క్రీస్తు ద్వార ఈ ముద్రలు ఎందుకు విప్పబడెను? ఎందుకనగా- ఈ ఏడు ముద్రలు విప్పుట ద్వార ఏడు తీర్పులు సంభవించును. మరియు ఈ తీర్పు లన్నియు తీర్చుటకు దేవుని కుమారుడగు క్రీస్తుకు అప్పగించబడినవి. (యోహాను 5:22 చదువండి).

# మొదటి ముద్ర

## తాత్కాలికమైన శాంతి




"ఆ గొఱ్ఱెపిల్ల ఆ యేడు ముద్రలలో మొదటి దానిని విప్పినప్పుడు నేను చూడగా ఆ నాలుగు జీవులలో ఒకటి—రమ్ము అని ఉరుమువంటి స్వరముతో చెప్పుట వింటిని. మరియు నేను చూడగా, ఇదిగో ఒక తెల్లనిగుఱ్ఱము కనబడెను; దానిమీద ఒకడు విల్లు పట్టుకొని కూర్చుండి యుండెను. అతనికి ఒక కిరీటమియ్యబడెను; అతడు జయించుచు, జయించుటకు బయలువెళ్ళెను."

ప్రకటన 6:1-2.

ఈ ముద్రలు భూమిపైకి వచ్చెడి భయంకరమైన విపత్తులను వివరించును. ఇచ్చట తెల్పబడిన తెల్లని గుఱ్ఱము లోకమందు జరుగు శాంతిని గూర్చిన ఆలోచనను సూచించును. మనము తెలిసికొనినట్లుగా, మృగము, మొదట శాంతిని కాంక్షించువాడుగా యుండునని ఎరుగుదుము. అయితే ఈ శాంతి సంబంధమైన ఆలోచన కొంతకాలము వరకే యుండును.

ముద్ర విప్పుట తోడనే ఉరుమువంటి శబ్దము వినబడెను. శబ్దము వచ్చెడి తుఫానును సూచించునదిగా యున్నది. పిమ్మట తెల్లని గుఱ్ఱముపై స్వారి చేయువాడు కనబడెను. గుఱ్ఱముపై కూర్చున్నవాడు, శాంతిని నెలకొల్పుటకు ప్రయత్నించు నాయకునిని సూచించును—తెల్లని గుఱ్ఱము శాంతిని సూచించును. మరొక సంగతి, ఈ గుఱ్ఱముపై కూర్చున్న వానికి విల్లు కలదు కాని బాణము (Arrow) లు లేవు. అంటే—ఇతను రక్తాపాతము జరుగకుండ శాంతిని నెలకొల్పుటలో జయమొందును. అతనికి కిరీటము ఇవ్వబడినది కావున ఇతనినొక గొప్ప రాజ్యాధి పతిగా బావించవచ్చును.

ఈ ప్రవచనము వెరే ప్రవచనములతో ఏకీభవించునదిగా యుండి రోమా సామ్రాజ్యమును—మృగమును (క్రీస్తు విరోధి), సూచించుచున్నది. ఇతను మొదట శాంతిని నెలకొల్పువాడుగా యుండి, అధికారములోనికి

వచ్చునని తెలియనగును. శాంతి పథకముద్వార ఇతను ఎన్నో రాజ్యములను జయించినను, అన్ని రాజ్యములు ఇతనిద్వార జయించబడనేరవు.

ఈ శ్రమల ఆరంభపు రోజుల సమయము, రెండు గొప్ప వెవ్వేరు స్వాభావిక శక్తుల ద్వార ఆవరింపబడినట్లుగా చూడగలము. పరలోకమందు క్రీస్తుకు సర్వాధికారము ఇవ్వబడినట్లు (మత్తయి 28:18), భూలోకమును పాలించుటకు క్రీస్తు విరోధియగు మృగము, సాతాను శక్తి ద్వార తన దుష్టకార్యములను కొనసాగించుటకు సిద్ధపడుచున్నట్లు కనుగొనగలము.

## రెండవ ముద్ర

### యుద్ధము



"ఆయన రెండవ ముద్రను విప్పినప్పుడు—రమ్ము అని రెండవ జీవి చెప్పుట వింటిని. అప్పుడు ఎఱ్ఱనిదైన వేరొక గుఱ్ఱము బయలు వెళ్ళెను. మనుష్యులు ఒకని ఒకడు చంపుకొనునట్లు భూలోకములో సమాధానము లేకుండ చేయుటకు ఈ గుఱ్ఱము మీద కూర్చున్నవానికి అధికారమియ్యబడెను; మరియు అతనికి ఒక పెద్ద ఖడ్గమియ్యబడెను." ప్రకటన 6:3-4.

మృగము ద్వార సాధించబడిన శాంతి కొంత కాలమే యుండి, రెండవ ముద్ర విప్పుట ద్వార శాంతి కార్యములు అంతరించును. ఎర్రని గుఱ్ఱముపై కూర్చున్నవాడు రక్తపాతమును సూచించు వాడునై యున్నాడు. ఈ ప్రవచనము రాబొయ్యేడి భయంకరమైన యుద్ధములను, హత్యాకాండములను తెలుపుచున్నది. ఈ యుద్ధములను గూర్చి వివరముగా మనము తదుపరి చర్చించెదము.

## మూడవ ముద్ర

### కరవు




"ఆయన మూడవ ముద్రను విప్పినప్పుడు, రమ్ము అని మూడవ జీవి చెప్పుట వింటిని. నేను చూడగా, ఇదిగో ఒక నల్లని గుఱ్ఱము కనబడెను, దాని మీద ఒకడు త్రాసు చేత పట్టుకొని కూర్చుండెను. మరియు-దేనారమునకు ఒక సేరు గోధుమలనియు, దేనారమునకు మూడు సేర్ల యవలననియు నూనె ద్రాక్షారసమును పాడు చేయవద్దనియు, ఆ నాలుగు జీవుల మధ్య ఒక స్వరము పలికినట్టు నాకు వినబడెను" ప్రకటన 6:5-6.

నల్లని గుఱ్ఱము, యుద్ధకాలమందు వచ్చెడి కరవులను సూచించును. దేనారము ఒక దినపు పని ద్వార వచ్చెడి నీ జీతమునకు (Labour) సమానము కావచ్చును. త్రాసు, ధరలు అధికమగుననెడి భావమును తెల్పుచున్నది.

ఈ కరవు ఒక్క ప్రాంతమునకు చెందినదిగా యుండక భూలోకమంతటను యుండును. ఈ రోజులలో వచ్చుచున్న కరవులను నివారించుటకు, కరవులేని ప్రాంతములు కరవుగల ప్రాంతములకు ఆహారమును సరఫరా చేసి సహాయము చేయుచున్నవి. కాని రాబొయ్యెడి రోజుల కరవులను నివారించుటకు ఏ ప్రాంతమందును ఆహార ధాన్యము సమృద్ధిగా యుండదు. ఈ కరవులను నివారించుటకు సంభవము కాకుండ, వీనిని నివారింప నిరీక్షణాధారమే లేకుండ నగును.

## నాలుగవ ముద్ర

### మరణములు



"ఆయన నాలుగవ ముద్రను విప్పినప్పుడు— రమ్ము అని నాలుగవ జీవి చెప్పుట వింటిని. అప్పుడు నేను చూడగా, ఇదిగో పాండుర వర్ణముగల ఒక గుఱ్ఱము కనబడెను. దాని మీద కూర్చున్నవాని పేరు మృత్యువు. పాతాళ లోకము వానిని వెంబడించెను. ఖడ్గము వలనను కరవు వలనను మరణము వలనను భూమిలోనుండు క్రూర మృగముల వలనను భూనివాసులను చంపుటకు భూమి యొక్క నాలుగవ భాగము పైన అధికారము వారి కియ్యబడెను." ప్రకటన 6:7-8.

పాండుర వర్ణముగల గుఱ్ఱము, లోకము మీదికి తీవ్రతరముగా రాబోయే యుద్ధముల ద్వార కల్గెడి కరవులు, ఆకలి మరణములు; తెగుళ్ళు, భూకంపములు, చెడు వాయువు మొదలగు వాని ద్వార కలుగు మరణములను గూర్చి తెల్పుచున్నది. ఆకలి బాధచేత మనుష్యులు, ఒకనినొకడు చంపుకొందురు. ఇట్లు ఆహారముకొరకు దౌర్జన్యములు, హత్యలు హెచ్చగును. లోకమందు ఆహారముకొరకు వినియోగింపబడుచున్న సమస్త జంతువులు, పక్షులు మొదలగునవి సరిపోక, సాధు జంతువులను సహా, ఆహారము కొరకు వినియోగించెదరు. మృగములు తమ ప్రాణములను రక్షించుకొనుటకై మనుష్యులపై తిరుగబడును. చివరకు ఆహార సమస్య ఎలాగు పరిణమించునంటే, మనుష్యులు మనుష్యులనే తిను సంఘటనలు జరుగును.

కరవులు, దౌర్జన్యములు, తెగుళ్ళు మొదలగువానికి గురియై, లోకమందున్న మనుష్యులు నాలుగవ భాగము నశించిపోవుదురు. నోవహు కాలమందు జల ప్రళయముల ద్వార మనుష్య జాతి నశించినట్లు, ఈ భయంకర కరవుల ద్వార అనేక మరణములు సంభవించును.

# ఐదవ ముద్ర

## హింసలు



"ఆయన అయిదవ ముద్రను విప్పినప్పుడు, దేవుని వాక్యము నిమిత్తమును, తాము ఇచ్చిన సాక్షము నిమిత్తమును వధింపబడిన వారి ఆత్మలను బలిపీఠము క్రింద చూచితిని. వారు—నాథా, సత్యస్వరూపీ, పరిశుద్ధుడా, యెందాక తీర్పు తీర్చకయు, మా రక్తము నిమిత్తము భూనివాసులకు ప్రతి దండన చేయకయు ఉందువని బిగ్గరగా కేకలు వేసిరి. తెల్లని వస్త్రము వారిలో ప్రతివాని కియ్యబడెను; మరియు—వారివలెనే చంప బడబోవు వారి సహ దాసుల యొక్కయు సహోదరుల యొక్కయు లెక్క పూర్తి యగువరకు ఇంక కొంచెము కాలము విశ్ర మింపవలెనని వారితో చెప్పబడెను."—ప్రకటన 6:9-11.

పై ప్రవచనము శ్రమల రోజులలో చాలామంది హతసాక్షులగుదురని తెల్పుచున్నది. క్రీస్తును నూతనముగా నమ్మినవారు, వారి వలననే ఈ కష్టములు వచ్చుచున్నవనెడి నిందవేసి (నీరో చక్రవర్తివలె) క్రైస్తవులను వధించుటకు ఆజ్ఞ రావచ్చును. అప్పుడు, క్రైస్తవులు, తామిచ్చిన సాక్షముద్వార, తమ విశ్వాసమును, నిరీక్షణను లోకమునకు తెలుపుదురు. ఈ సమయమును తెల్పుచు, యేసుప్రభువు—"సహోదరుడు సహోదరుని, తండ్రి కుమారుని, మరణమున కప్పగింతురు; కుమారులు తల్లిదండ్రుల మీద లేచి వారిని చంపింతురు" అనెను. మార్కు 13:12.

ఈ కాలమందు హతసాక్షుల సంఖ్య హెచ్చై, అధికమించి, నలుమూలల విస్తరించును. న్యాయము కొరకు ఎవరును మాట్లాడ వీలులేకుండ కాలము మార్పొందును. ఈ శ్రమల కాలమందు హతసాక్షుల సంఖ్య

హెచ్చగును, తొలుత క్రీస్తు అనుచరులనే వధించుటకు మొదలైనను, తరువాత అన్ని మతములవారు చిత్రవధల పాలగుదురు.

ప్రకటన 20:4 లో చెప్పబడిన రీతిగా క్రీస్తు సాక్షుల తలలను ఛేదించుటకు గండ్ర గొడ్డండ్లు (Gillotines) హెచ్చుగా వాడబడునని తెలియనగును. క్రీస్తేతరులను హెచ్చరించుటకై, ఈ తీర్పులు ప్రజల సముఖమందే కొనసాగించబడును.

---

## ఆరవ ముద్ర

### నాశనము



"ఆయన ఆరవ ముద్ర విప్పినప్పుడు నేను చూడగా పెద్ద భూకంపము కలిగెను. సూర్యుడు కంబళివలె నలుపాయెను, చంద్రబింబమంతయు రక్త వర్ణమాయెను. పెద్దగాలి చేత ఊగులాడు అంజూరపు చెట్టునుండి ఆ కాలపు కాయలు రాలినట్లు ఆకాశ నక్షత్రములు భూమిమీద రాలెను. మరియు ఆకాశమండలము చుట్టబడిన గ్రంథమువలెనై తొలగిపోయెను. ప్రతి కొండయు ప్రతి ద్వీపమును వాటి వాటి స్థానములు తప్పెను. భూరాజులు, ఘనులను, సహస్రాధిపతులును, ధనికులును, బలిష్ఠులును, ప్రతి దాసుడును, ప్రతి స్వతంత్రుడును కొండ గుహలలోను బండల సందులలోను దాగుకొని సింహాసనాసీనుడై యున్న వాని యొక్కయు, గొఱ్ఱెపిల్ల యొక్కయు ఉగ్రత మహా దినము వచ్చెను, దానికి తాళజాలిన వాడెవడు? మీరు మా మీదపడి ఆయన సన్నిధికిని గొఱ్ఱెపిల్ల ఉగ్రతకును మమ్మును మరుగు చేయుడి అని పర్వతములతోను బండలతోను చెప్పుచున్నారు" (ప్రకటన 6:12-17).

---

పై వచనము, అంత్యకాలమందు – శ్రమల రోజులలో వచ్చెడి గొప్ప భూకంపములను తెల్పుచున్నది. ఇది జరుగు కాలములో సూర్యుడు, చంద్రుడు తమ రూపములలో మార్పొంది, సూర్యుడు నలుపుగా, చంద్రుడు రక్తమువలె ఎరుపుగా మారును. ఈ విషయమునే యేసు

ప్రభువు కూడ తెల్పెను. (మత్తయి 24:29, యోవేలు 2:31 చదువుము). యేసు ప్రభువు, మత్తయి 24వ అధ్యాయములో, ఆకాశము నుండి నక్షత్రములు రాలును; ఆకాశమందలి శక్తులు కదిలించబడును అని ఈ రోజులను గూర్చే తెలిపెను. ఇవి నిజమైన నక్షత్రములు లేక అంతరిక్షము నుండి భూమిపైకి ప్రయోగించబడే అణు అస్త్రములైనను కావచ్చును. అయితే ఇవి నక్షత్రములే రాలుచున్నట్లుగా కనబడును. వీటివివరణ, "ఆకాశమందలి మహా భయోత్పాతములు, గొప్ప సూచనలు" అను అధ్యాయములో వివరింపబడినది.

ఇది అణుశక్తికి సంబంధించిన అస్త్రములను గూర్చి తెల్పుచు, లోకమందలి పర్వతములు, కొండలు మొదలగునవి తొలగిపోవునని, మనుష్యులు, భీతిచేత, ఈ ఉగ్రత రోజులనుండి తప్పించుకొనుటకు పర్వతములలోనికి, బండ సందులలోనికి దాగుకొనుటకు పోయెదరని వివరించుచున్నది.

ఈ ఆరవ ముద్ర ద్వార కల్గెడి తీర్పు యొక్క విపత్తునుండి తప్పించుకొనుటకు గొప్ప భూలోక నాయకులు, సైన్యాధిపతులు మరణమొంద ఇష్టపడెదరు.

## ఏడవ ముద్ర

ఏడు బూరల ద్వార వచ్చెడి తీర్పులు



"ఆయన ఏడవ ముద్రను విప్పినప్పుడు పరలోకమందు ఇంచుమించు అరగంట సేపు నిశ్శబ్దముగా ఉండెను. అంతట నేను దేవుని యెదుట నిలుచు ఏడుగురు దూతలను చూచితిని; వారికి ఏడు బూరలియ్యబడెను ... "అంతట ఏడు బూరలు పట్టుకొనియున్న ఆ యేడుగురు దూతలు ఊదుటకుసిద్ధపడిరి." ప్రకటన 8:1-2,6.

ఈ ఏడవ ముద్ర, జరుగబొయ్యే ఏ సంఘటనను తెల్పక, ఏడు బూర ధ్వనుల ద్వార వచ్చెడి మరో ఏడు తీర్పులను తెల్పుచున్నది.

## మొదటి బూర

*రక్తము, వడగండ్లు, అగ్ని*



"మొదటి దూత బూర ఊదినప్పుడు రక్తముతో మిళితమైన వడగండ్లును అగ్నియు పుట్టి భూమిపైన పడవేయ బడెను; అందువలన భూమిలో మూడవ భాగము కాలిపోయెను. చెట్లలో మూడవ భాగమును కాలిపోయెను. పచ్చగడ్డి యంతయు కాలిపోయెను." ప్రకటన 8:7.

ఈ తీర్పువలన భూమిపై యున్న చెట్లు, మొక్కలు మొదలగున వన్నియు కాల్చబడి ఆహార సమస్య తీర్చుటకు వీలు లేకుండ చేయ బడును.

వడగండ్లు, అగ్ని తీర్పులు ఇంతకు పూర్వమే ఉపయోగింపబడెను. నిర్గమ కాండము 9:24-25 లో ఐగుప్తు దేశముపై దేవుడు క్రుమ్మరించిన తీర్పులలో వడగండ్లు ఒకటి. దీనిద్వార దేశములోనున్న మనుష్యులనేమి జంతువులనేమి బయటనున్నది యావత్తు నశింపచెసెను. వడగండ్లు పొలములోని ప్రతి కూరను చెడగొట్టెను. పొలములోని ప్రతి చెట్టును విరగగొట్టెను.

అగ్ని ద్వార సొదొమా, గొమొఱ్ఱో దేశములకు దేవుడు, లోతు కాలములో(ఆదికాండము 19:24)తీర్పుతీర్చి, వాటినిపూర్తిగా కాల్చివేసెను.

ఈ శ్రమల కాలములో మొదటి బూర ద్వార కల్గెడి తీర్పువలన అగ్నిద్వార సంభవించెడి నాశనము ఒక్క పట్టణమునకు, లేక దేశమునకు పరిమితముగా యుండక, ప్రపంచమందలి చెట్లలోని మూడవ భాగమంతటికిని సంభవించును. ఆహారసమస్య తీర్చుటకు ఎంత మాత్రము వీలుకాకుండ అయి, ఈ సమస్య పరిష్కారమునకు నిరీక్షణా దారము లేకుండ అగును.

## రెండవ బూర

### అగ్నివలె మండుచున్న పర్వతము



"రెండవదూత బూర ఊదినప్పుడు అగ్ని చేత మండుచున్న పెద్ద కొండవంటిది ఒక్కటి సముద్రములో పడవేయబడెను. అందువలన సముద్రములో మూడవ భాగము రక్తమాయెను. సముద్రములోని ప్రాణముగల జంతువులలో మూడవ భాగము చచ్చెను. ఓడలలో మూడవ భాగము నాశన మాయెను." ప్రకటన 8:8-9.

ఈ పుస్తకములో ముందుగా వివరింపబడినట్లు ఈ ప్రవచనము అమెరికా దేశ పతనమునకు చెందినదని భావించవచ్చును. ఇది అమెరికానో కాదో నిశ్చయముగా చెప్పలేము. ఒకవేళ ఇది అమెరికాను గూర్చిన ప్రవచనము కాకున్న, నాశనకరమగు యుద్ధము, మరే దేశము ద్వారానో జరిగి, సముద్రములోని ప్రాణులు, ఓడలోని మూడవ భాగము (1/3) నాశన మగునని తెలిసికొనవచ్చును.

ఈ మండుచున్న కొండ, ఎదేని గ్రహము భూమిపై రాలి పడుటద్వార కల్గెడి పరిణామమే కావచ్చును. ఇది సంభవమేనని భావించవచ్చును; ఎందుకనగా, ఆరవ ముద్రలో జరిగిన తీర్పుల దృష్ట్యా ఇదికూడ జరుగ వచ్చునని తలంచుటకు ఆస్కారము కలదు.

## మూడవ బూర

### మాచిపత్రి



"మూడవ దూత బూర ఊదినప్పుడు దివిటీవలె మండుచున్న యొక పెద్ద నక్షత్రము ఆకాశమునుండి రాలి నదుల మూడవ భాగము మీదను నీటి బుగ్గల మీదను పడెను. ఆ నక్షత్రమునకు మాచి పత్రి యని పేరు అందువలన నీళ్ళలో మూడవ భాగము మాచిపత్రి (చేదు) యాయెను; నీళ్ళు చేదై పోయినందున వాటివలన మనుష్యులలో అనేకులు చచ్చిరి" ప్రకటన 8:10-11.

ఈ ప్రవచనము, ప్రపంచములోని మూడువంతుల నీరు విష జలమగుట ద్వార జనులు మరణింతురని, త్రాగెడి నీటిలో, బొటులినస్ టాక్సిన్ (Botulinus Toxin) మొదలగు రసాయన పదార్థముల కలయిక ద్వార ఇది సంభవమేనని తెలిసికొనవచ్చును. ఈలాంటి రసాయినిక పదార్థములను గూర్చి, జీవవినాశక ఆయుధముల అధ్యాయములో వివరముగా చెప్పబడినది.

ఈ రసాయినిక పదార్థములు, యుద్ధాస్త్రముల ద్వార నీటిలోనికి కలుపబడు నని, భూవాతావరణములోనికి ఈ అస్త్రములు చేరునప్పటికి మండుచున్న దివిటీల మాదిరి కాన్పించును.

ఆకాశమునుండి పడిపోవుచున్న నక్షత్రమువంటి జ్యోతి, దేవుని తీర్పును నెరవేర్చుటకు నీటిలో పడి కూడ నీటిని విషజలముగా మార్చవచ్చును. ఈ తీర్పుద్వార అనేకులు చనిపోవుదురు.

---

## నాలుగవ బూర

### లోకము పై చీకటి కమ్ముట




"నాలుగవ దూత బూర ఊదినప్పుడు సూర్య చంద్ర నక్షత్రములలో మూడవ భాగము చీకటి కమ్మినట్లును, పగటిలో మూడవ భాగమున సూర్యుడు ప్రకాశింపకుండునట్లును, రాత్రిలో మూడవభాగమున చంద్ర నక్షత్రములు ప్రకాశింపకుండునట్లును వాటిలో మూడవ భాగము కొట్టబడెను. మరియు నేను చూడగా ఆకాశ మధ్యమున ఒక పక్షి రాజు ఎగురుచు - బూరలు ఊద బోవుచున్న ముగ్గురు దూతల బూరల శబ్దములను బట్టి భూనివాసులకు అయ్యో, అయ్యో, అయ్యో, అని గొప్ప స్వరముతో చెప్పుట వింటిని. ప్రకటన 8:12-13.

---

ఈ ప్రవచనము లోకము పైకి రాబోయ్యే ప్రళయమునుగూర్చి తెల్పుచు, హగ్గయి ప్రవక్త ద్వారా చెప్పబడిన దానితో సంబంధము కల్గియున్నది. "మరియు సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చునదేమనగా

ఇక కొంతకాలము ఇంకొకమారు ఆకాశమును, భూమిని, సముద్రమును, నేలను నేను కంపింతును. నేను అన్య జనులనందరిని కదిలింపగా అన్య జనులందరి యొక్క యిష్ట వస్తువులు తేబడును." హగ్గయి 2:6-7. ఈ తీర్పు రాబోయ్యేడి భయంకరమైన ఉపద్రవమును సూచించు చున్నది. ఇంతకు పూర్వపు తీర్పులద్వారనే నీటిలోని, భూమిపైని ప్రాణులు చాలా శ్రమల పాలైయ్యెను, ఆహారము నాశనము కావింపబడెను, అన్ని రంగముల అభివృద్ధులు స్థంబించెను మరియు ఆకాశములు సొమ్మసిల్లెను.

ఇంకా ఏమి జరుగనున్నది? ఇప్పుడు ఒక దూత, ఈ మూడు బూరల ద్వార వచ్చేడి మహోగ్రత తీర్పులను చాటించుచున్నది. ఈ మూడు తీర్పులు ప్రత్యేకమైనవిగా యుండి మహోగ్రత తీర్పులుగాయుండును.

## అయిదవ బూర

### మిడుతలు



"అయిదవ దూత బూర ఊదినప్పుడు ఆకాశము నుండి భూమి మీదరాలిన ఒక నక్షత్రమును చూచితిని. అగాధము యొక్క తాళపుచెవి అతనికి ఇయ్యబడెను. అతడు అగాధము తెరువగా పెద్ద కొలిమిలోనుండి లేచు పొగవంటి పొగ ఆ అగాధములోనుండి లేచెను. ఆ అగాధములోనుండి మిడుతలు భూమి మీదికి వచ్చెను. భూమిలో ఉండు తేళ్ళకు బల మున్నట్లు వాటికి బలము ఇయ్యబడెను. మరియు నొసళ్ళయందు దేవుని ముద్ర లేని మనుష్యులకే తప్ప భూమి పైనున్న గడ్డికైనను, ఏ మొక్కలకైనను, మరి ఏవృక్షమునకైనను హాని కలుగజేయ కూడదని వాటికి ఆజ్ఞ ఇయ్యబడెను. మరియు వారిని చంపుటకు అధికారము ఇయ్యబడలేదు గాని అయిదు నెలలవరకు బాధించుటకు వాటికి అధికారము ఇయ్యబడెను. వాటివలన కలుగు బాధ, తేలు మనుష్యుని కుట్టినప్పుడుండు బాధవలెఉండును. ఆ దినములలో మనుష్యులు మరణమును వెదకుదురు గాని అది వారికి దొరకనే దొరకదు. చావవలెనని ఆశపడుదురు గాని మరణము వారి యొద్దనుండి పారిపోవును" (ప్రకటన 9:1-11).

పూర్తి అధ్యాయమును చదువుము.

ఇచ్చట చెప్పబడిన మిడుతలు, సాతానుయొక్క ప్రతినిధులుగా గుర్తించ వచ్చును. వీనికి మనుష్యులను హింసించుటకు సెలవియ్యబడును. వీని ద్వార కలుగు హింసలు ఐదు నెలల వరకు జరుగును. మనుష్యులు ఈలాంటి శ్రమలను ఓర్చుకొనలేక ఆత్మ హత్యలకు పాల్పడ చూతురు కాని వారు తమ ప్రయత్నములలో నిఫలులగుదురు. మరియు మరణము పొందకుండ ఏదో శక్తి ద్వార వీరు ఆపబడెదరు. ఈలాగు ఐదవ బూర ద్వార కల్గే తీర్పు ప్రత్యేకమైన మొదటిరకపుశ్రమగా యుండును.

## ఆరవ బూర

### 2,000 లక్షల సైన్యము



ఆరవ దూత బూర ఊదినప్పుడు దేవుని యెదుట ఉన్న సువర్ణ బలిపీఠము యొక్క కొమ్ములనుండి యొక స్వరము—యూఫ్రటీసు అను మహానదియొద్ద బంధింపబడి యున్న నలుగురు దూతలను వదిలిపెట్టుమని బూర పట్టుకొనియున్న ఆ యారవదూతతో చెప్పుట వింటిని.

"మనుష్యులలో మూడవ భాగమును సంహరించవలెనని అదే సంవత్సరమున అదే నెలలో అదే దినమున అదే గంటకు సిద్ధపరచబడి యుండిన ఆ నలుగురు దూతలు వదిలిపెట్టబడిరి. గుఱ్ఱపు రౌతుల సైన్యముల లెక్క, యిరువది కోట్లు: వారి లెక్క యింత అని నేను వింటిని. మరియు నాకు కలిగిన దర్శనమందు ఈలాగు చూచితిని, ఆ గుఱ్ఱములకును వాటిమీద కూర్చుండియున్న వారికిని, నిప్పువలె ఎరుపు వర్ణము, నీలవర్ణము, గంధక వర్ణముల మైమరుపులుండెను. ఆ గుఱ్ఱముల తలలు సింహపు తలల వంటివి, వాటి నోళ్ళలోనుండి అగ్ని ధూమ గంధకములు బయలు వెడలుచుండెను. ఈ మూడు దెబ్బలచేత, అనగా వీటి నోళ్ళలోనుండి బయలువెడలుచున్న అగ్ని ధూమగంధకముల చేత, మనుష్యులలో మూడవ భాగము చంపబడెను." (ప్రకటన 9:13-18)

ఇది రెండవ ప్రత్యేకమైన తీవ్రతరమైన శ్రమగా తెల్సికొంటున్నాము. గుఱ్ఱపు రౌతు ఒక గొప్ప సైన్యమును సూచించును. వీనిద్వార దేశముల పై ఒకేసారి, నిప్పులాంటి గంధకమును కురిపించుట ద్వార లోకమందలి మనుష్యులలో మూడవ భాగము చంపబడెను. ఇచ్చట వివరింపబడిన సైన్యము, లోకమందు నేడు మనుష్యుడు తయారుచేయుచున్న యుద్ధాయుధములు. అణుశక్తి మొదలగునవి కావచ్చును. గుఱ్ఱపు రౌతులు చాలా మంది యుండుటవలన, ఇది గొప్ప సైన్య సమూహమని గ్రహింపవచ్చును. కొంతమంది వ్యాఖ్యానికులు; నేడు చైనా దేశము సమకూర్చుకొనినటువంటి గొప్ప సైన్యముగా యుండునని భావింతురు. కాని మనము దీని విషయమై ఏమి చెప్పవీలుకాదు. అయితే ప్రవచనమందు చెప్పబడిన సైన్య సమూహము ఇహమునకు చెందినది కాదు.

ఆరవ బూర ద్వార కల్గు తీర్పు పూర్తవుటకై, మరొక భయంకర భూకంపము మధ్యాసియ ప్రాంతమందు జరుగుట ద్వార, యెరూషలేము లోనే 7,000 మంది చనిపోవుదురు.

"ఆ గడియలోనే గొప్ప భూకంపము కలిగినందున ఆ పట్టణములో పదియవభాగము కూలిపోయెను. ఆ భూకంపము వలన ఏడువేల మంది చచ్చిరి. మిగిలినవారు భయాక్రాంతులై పరలోకపు దేవుని మహిమ పర్చిరి." (ప్రకటన 11:13).

## ఏడవ బూర

### చివరి ఏడు తెగుళ్ళ

### ఆరంభము




"ఏడవ దూత బూర ఊదినప్పుడు పరలోకములో గొప్ప శబ్దములు పుట్టెను. ఆ శబ్దములు - ఈ లోక రాజ్యము మన ప్రభువు రాజ్యమును ఆయన క్రీస్తు రాజ్యము నాయెను; ఆయన యుగయుగముల వరకు ఏలుననెను,——అప్పుడు మెరుపులును ధ్వనులును ఉరుములును భూకంపమును గొప్ప వడగండ్లును పుట్టెను ......మరియు ఆశ్చర్యకరమైన మరియొక గొప్ప సూచన పరలోకమందు చూచితిని. అదేమనగా ఏడు తెగుళ్ళు (చేత) పట్టుకొనియున్న యేడుగురు దూతలు. అవే కడవరి తెగుళ్ళు; వీటితో దేవుని కోపము సమాపమాయెను." (ప్రకటన 11:15,19;15:

ఈ ఏడవబూర ద్వార వచ్చెడి తీర్పు తీవ్రతరముగా యుండి మరో ఏడు తీర్పులు ఉగ్రత పాత్రల ద్వార కుమ్మరింప బడుటకు దారితీయును. ఏడవ బూరద్వార ఈ లోకము క్రీస్తు రాజ్యమయ్యెనని తెల్పుచు, తీర్పు లన్నింటికి నాంది పలుకుచున్నది. ఈ తీర్పుల తరువాత క్రీస్తు రాజ్యము వచ్చును. ఉగ్రత పాత్రలద్వారా వచ్చెడి మరో ఏడు తీర్పులను తెలిసి కొనకముందు ఈ 3 1/2 సం॥ల శ్రమల కాలములో లోకమందలి మత, రాజ్యాంగ విషయములను చర్చించెదము. ఇక ముందు వచ్చెడి శ్రమలు ప్రత్యేకముగా యుండి శ్రమల తీవ్రతను తెలుపును.

## 2. ఇశ్రాయేలీయులు

ప్రవచనముల నెరవేర్పులను గూర్చి విపరముగా తెలిసికొనుటకు ముందు, దేవునిచే ఏర్పర్చబడిన ప్రజలగు ఇశ్రాయేలీయులను గూర్చి తెలిసికొనుట ఎంతైన అవసరము. ప్రపంచ రాజకీయ రంగములో ఇశ్రాయేలు నేడు కీలకస్థానము కలియున్నది, అలాగే శ్రమల రోజులలో కూడ పంచ రాజకీయ రంగమందు ఇశ్రాయేలు గొప్ప పాత్రను వహించును. బిలునందు ఇశ్రాయేలు అనగా ఇశ్రాయేలీయులను గూర్చియు, వారి మైన పాలస్తీనాను గూర్చియు చెప్పబడినదని గ్రహింపవలెను. శ్రాయేలు అనగా, అబ్రహాము, యాకోబు సంతతివారని ఎవరితో వుడు నిబంధన (covenant) చేసెనో వారని కూడ తెలిసి నవలెను. ఇశ్రాయేలు అనగా బ్రిటన్ లేక అమెరికా అవి లేక ఇశ్రాయేలు అనగా సంఘం (Church) అని కాక, ఇశ్రాయేలు అనగా ఇశ్రాయేలీయులను గూర్చియు, వారి దేశమైన పాలస్తీనా గూర్చియు బడినదని గ్రహించవలెను. శ్రమల రోజులకు ముందు లేక శ్రమల ల ఆరంభమందు ఇశ్రాయేలీయులు తమ దేవాలయము యెరూష నందు కట్టెదరు. నేడు నవీన ఇశ్రాయేలునందు, మోషేద్వార ఇవ్వ న ధర్మశాస్త్రము చొప్పున (జంతువుల) బలులను, నైవేద్యములను కొత్తగా నిర్మించే దేవాలయమునందు అర్పించుటకు ఉద్దేశము కలి యున్నారు. ఇది వారికి చాలా ముఖ్యమైనదియును గొప్ప నిరీక్షణతో కూడి నదై యున్నది.

అపొస్తలుడైన యోహానుకు కలిగిన దర్శనములో (ప్రకటన 11 అధ్యాయములో) — "నీవు లేచి దేవుని ఆలయమును బలిపీఠమును కొలతవేసి ఆలయములో పూజించువారిని లెక్కపెట్టుమనెను."

శ్రమల రోజుల ఆరంభములో, ఇశ్రాయేలు, సంయుక్త యూరపు (మృగపు) రాజ్యములతో ఏడు సంవత్సరములు శాంతి సంబంధమైన నిబంధనను చేసికొనును.

"అతడు (మృగము) ఒక వారము (వారము అనగా 7 సం॥లని అర్థము) వరకు అనేకులకు నిబంధనను స్థిరపరచును" దానియేలు 9:27.

మృగముతో చేసికొనెడి నిబంధన ఇశ్రాయేలును, తన శత్రువుల ఆక్రమణ నుండి, తూర్పు, ఉత్తర రాజ్యముల దాడినుండి కాపాడును. అయితే ఈ నిబంధన ఇశ్రాయేలు దేశము, యూదులనుండి లాగివేయబడకుండ, నాశనము చేయబడకుండ ఉండుటకు ఏ మాత్రము అడ్డుకొనలేదు. ఈలాగున ఈ నిబంధన అంతిమమున వ్యర్థపర్చబడును.

యెషయా ప్రవక్త కూడా ఈ నిబంధనను గూర్చి ప్రవచించినాడు. తన ప్రవచనమందు, ఇశ్రాయేలు నమ్మ వీలుకాని బలమైన వాని (మృగము) రాజ్యముతో నిబంధనను చేయునని తెల్పెను.

"మేము మరణముతో నిబంధన చేసికొంటిమి సాతానుతో ఏకమైతిమి ఉపద్రవము ప్రవాహమువలె వడిగా దాటునప్పుడు అది మా యొద్దకు రాదు అబద్ధములను మాకు ఆశ్రయముగా చేసికొంటిమి. మాయక్రింద దాగియున్నాము అని మీరు చెప్పుచున్నారే." యెషయా 28:15.

శ్రమల రోజులు అంతరించక పూర్వము, ఇశ్రాయేలీయులలో, మూడింట రెండవ (2/3) భాగము నశించెదరు. ఈ రోజులు ఇశ్రాయేలీయులకు మిక్కిలి శ్రమల రోజులుగా ఎంచబడును. ఈ రోజులను గూర్చి ప్రవక్తయగు జెకర్యా కూడ ప్రవచించెను.

"దేశమంతట జనులలో రెండు భాగములవారు తెగవేయబడి చత్తురు, మూడవ భాగము వారు శేషింతురు. ఆ మూడవ భాగమును నేను (యెహోవా—దేవుడు) అగ్నిలో నుండి వెండిని శుద్ధపరచినట్లు శుద్ధపరతును. బంగారమును శోధించినట్లు వారిని శోధింతును; వారు నా నామమును బట్టి మొట్టపెట్టగా నేను వారి మొఱను ఆలకింతును. వీరు నా

జనులని నేను చెప్పుదును, యెహోవా మా దేవుడని వారు చెప్పుదురు." జెకర్యా 13:8_9.

## 3. దేవుని ఆత్మ నడుపుదల

శ్రమల ప్రారంభ దినములలో, దేవుడు, తన శక్తి ద్వార నింపబడిన ఇద్దరు ప్రవక్తలను, తనకు సాక్షులై, యెరూషలేము పట్టణమందు సువార్తను 3 1/2 సంవత్సరములు ప్రకటించుటకు పంపును.

"నేను నా యిద్దరు సాక్షులకు అధికారము ఇచ్చెదను. వారు గోనెపట్ట ధరించుకొని వెయ్యిన్ని రెండు వందల అరువది దినములు ప్రవచింతురు. వీరు భూలోకమునకు ప్రభువైన వాని యెదుట నిలుచున్న రెండు ఒలీవ చెట్లును దీప స్తంభములునై యున్నారు. ఎవడైనను వారికి హాని చేయ నుద్దేశించినయెడల వారి నోటినుండి అగ్ని బయలువెడలి వారి శత్రువులను దహించివేయును గనుక ఎవడైనను వారికి హానిచేయ నుద్దేశించినయెడల ఆలాగున వాడు చంపబడవలెను. తాము ప్రవచింపు దినములు వర్షము కురువకుండ ఆకాశమును మూయుటకు వారికి అధికారము కలదు. మరియు వారి కిష్టమైనప్పుడెల్ల నీళ్ళు రక్తముగా చేయుటకును, వారికి అధికారము కలదు." (ప్రకటన 11:3_6).

ఈ ఇద్దరు ప్రవక్తలు సాక్షులుగా యుండి సువార్త ప్రకటించు కాలమున, దేవుడు మనుష్యులపై తన ఆత్మను క్రుమ్మరించును. దీనిద్వార లక్షలకొలది ప్రజలు ఉజ్జీవింపబడుట, మారు మనస్సునొంది దేవుని వైపునకు తిరుగుట సంభవించును. ఈ రోజులను గూర్చి యోవేలు ప్రవక్త ఈలాగు ప్రవచించెను—

"తరువాత నేను సర్వజనుల మీద నా ఆత్మను కుమ్మరింతును. మీ కుమారులు మీ కుమార్తెలును ప్రవచనములు చెప్పుదురు. మీ ముసలివారు కలలు కందురు. మీ యౌవనస్థులు దర్శనము చూతురు. ఆ దినములలో నేను పనివారి మీదను పనికత్తెల మీదను నా ఆత్మను కుమ్మరింతును." (యోవేలు 2:28_29),

శ్రమల కాలములో నూతనముగా సంఘములోనికి రక్షణపొంది చేర్చబడే విశ్వాసులు, శ్రమల కాలపు పరిశుద్ధులుగా పరిగణింపబడి, వీరు సువార్తను

లోకమంతట ప్రకటించుటకు శక్తివంచన లేకుండ, ప్రయాసపడెదరు. కాబట్టి, దేవుడు ఇశ్రాయేలీయులనుండి మరికొన్ని దేశములనుండి గొప్ప జనమును శ్రమల తదుపరి స్థాపింపబడు తన రాజ్యమునకు సొత్తు దారులగుటకై ఏర్పరచుకొనును. వీరు దేవుని ద్వార ముద్రింపబడుటచే శ్రమల కాలములో దేవుని తీర్పులవలన కల్గెడి వేదనలు, తెగుళ్ళు, వీరిని బాధింపజాలవు.

"ఈ దూత—మేము మా దేవుని దాసులను వారి నొసళ్ళయందు ముద్రించు వరకు భూమికైనను సముద్రముకైనను చెట్లకైనను హాని చేయవద్దని బిగ్గరగా చెప్పెను .. ఇశ్రాయేలీయుల గోత్రములన్నిటిలో ముద్రింప బడినవారు పండ్రెండువేల మంది.... అటు తరువాత నేను చూడగా ఇదిగో, ప్రతి జనములో నుండియు, ప్రతి వంశములో నుండియు, ప్రజ లలో నుండియు, ఆయా భాషలు మాటలాడువారిలో నుండియు వచ్చి, యెవడును లెక్కింపజాలని యొక గొప్ప సమూహము కనబడెను. వారు తెల్లని వస్త్రములు ధరించుకొన్నవారై, ఖర్జూరపు మట్టలు చేతపట్టుకొని సింహాసనము యెదుటను గొఱ్ఱెపిల్ల యెదుటను నిలువబడి—సింహాసనా సీనుడైన మా దేవునికిని గొఱ్ఱెపిల్లకును మా రక్షణకై స్తోత్రమని మహా శబ్దముతో ఎలుగెత్తి చెప్పిరి." (ప్రకటన 7:3-10).

శ్రమల రోజులలో లోకమందు నిలిచియున్న నూతన విశ్వాసులు, దేవుని తీర్పుల ద్వార కల్గెడు వేదనలకు, శ్రమలకు గురి కాకున్నను, మనుష్యుల ద్వార వదిలిపెట్టబడక, ఐదవ ముద్ర ద్వార కల్గిన తీర్పులో వివరించబడి నట్లు, చాలామంది హతసాక్షులగుదురు.

వీరిని ఎవ్వరు చంపెదరు?—మొదట, రోమా పరిపాలనకు సమ్మతిం చిన, క్రైస్తవ మత సంబంధమైన బబులోనియా క్రైస్తత్వమువారు చంపించెదరు. వీరు తమ మతాచారములకు విరుద్ధముగా విశ్వాసులుండుటచే ఓర్వలేక ద్వేషముతో చంపించెదరు.

"మరియు ఆ స్త్రీ పరిశుద్ధుల రక్తముచేతను, యేసుయొక్క హతసాక్షుల రక్తముచేతను మత్తిల్లి యుండుట చూచితిని." ప్రకటన 17:6.

రెండవదిగా, మృగము శ్రమల రెండవ దశయందు చాలామంది విశ్వా సులను చంపించును.

"మరియు ఆ మృగముయొక్క ప్రతిమ మాటలాడునట్లును, ఆ మృగము యొక్క ప్రతిమకు నమస్కారము చేయనివానిని హతము చేయునట్లును, ఆ మృగముయొక్క ప్రతిమకు ప్రాణమిచ్చుటకై దానికి అధికారము ఇయ్యబడెను. యేసు ప్రభువు యూదులకు వచ్చెడి హింసలను గూర్చి ముందుగానే ప్రవచించెను—"అప్పుడు జనులు మిమ్మును శ్రమల పాలుచేసి చంపెదరు, మీరు నానామము నిమిత్తము సకల జనులచేత ద్వేషింపబడుదురు." (మత్తయి 24:9).

ఈ విధముగా విశ్వాసులు ఎందరో చంపబడినను, చాలామంది విశ్వాసులు క్రీస్తు రాజ్యములోనికి ప్రవేశించునట్లుగా మిగల్చబడెదరు.

## 4. మృగపు సంయుక్త రాజ్యములు



లోకమునకు వచ్చెడి శ్రమల ఆరంభ దినములలో యూరపు ఖండమందు ఒక బలిష్ఠుడును, శక్తి గలిగిన రాజకీయ నాయకుడు ఉద్భవించును. ఇతను మొదట శాంతిని కోరువాడుగా పరిగణింపబడును.

"మరియునతడు (మృగము) ఉపాయము కలిగినవాడై మోసముచేసి తనకు లాభము తెచ్చుకొనును. అతడు అతిశయపడి తన్ను తాను హెచ్చించుకొనును. క్షేమముగా నున్న కాలమందు అనేకులను సంహరించును. అతడు రాజాధి రాజులతో యుద్ధము చేయును గాని కడపట అతని బలము దైవాధీనము వలన కొట్టివేయబడును." దానియేలు 8:25.

ఇతను (మృగము) గొప్ప రాజకీయ వేత్తగా, చతురత కలిగినవాడుగా, తెలివి కలిగినవాడుగా యుండి త్వరలో గొప్ప కీర్తిని సంపాదించును. ఇతను తన తెలివి, ప్రవీణత ద్వార రోమా రాజ్యమునకు నియంతగా మారును. ఇతను పూర్వపు నియంత నాయకులగు హిట్లర్, స్టాలిన్ మొదలగువారికన్న తన హింసా కృత్యములందు అధిగమించును.

ఇతను యూరపు సంయుక్త రాజ్యములకు అధిపతిగా యుండి, ఇశ్రాయేలీయులతో (ఇశ్రాయేలు దేశము) 7 సంవత్సరముల కొరకు శాంతి సంబంధమైన నిబంధనను చేయును.

"అతడు ఒక వారము (7 సం॥) వరకు అనేకులకు నిబంధనను స్థిరపరచును. అర్ధవారము (3 1/2 సం॥) నకు బలిని నైవేద్యమును నిలిపివేయును, హేయమైనది నిలుచువరకు నాశనము చేయువాడు వచ్చును. నాశనము చేయువానికి రావలెనని నిర్ణయించిన నాశనము ముగించువరకు ఈలాగు జరుగును." దానియేలు 9:27.

ఇతను (మృగము) అబద్ధ ప్రవక్త అనెడి రెండవ మృగముగా ఎంచబడే వాని సలహాల ననుసరించి నడుచును. ఈ అబద్ధ ప్రవక్త, సాతాను శక్తి ద్వార అద్భుతములను చేసి, మోసము ద్వార లోకమును విస్మయమొందించును.

"మరియు భూమిలోనుండి మరియొక క్రూర మృగము పైకి వచ్చుట చూచితిని. గొఱ్ఱెపిల్ల కొమ్మువంటి రెండు కొమ్ములు దానికుండెను; అది ఘటసర్పమువలె మాటలాడుచుండెను. అది ఆ మొదటి క్రూరమృగమునకున్న అధికారపు చేష్టలన్నియు దానియెదుట చేయుచున్నది. మరియు చావుదెబ్బ తగిలి బాగుపడియున్న ఆ మొదటి మృగమునకు భూమియు దానిలో నివసించువారును నమస్కారము చేయునట్లు అది బలవంతము చేయుచున్నది. అది ఆకాశమునుండి భూమికి మనుష్యుల యెదుట అగ్ని దిగివచ్చునట్లుగా గొప్ప సూచనలు చేయుచున్నది." ప్రకటన 13:11-13.

ఈజిప్టు దేశము, రష్యా సహాయముతో ఇశ్రాయేలు మీదికి దండెత్తి వచ్చినప్పుడు, ఈ మృగము కూడ తన సైన్యమును పాలస్తీనాలోనికి నడిపించును. తరువాత మృగము తనకొరకై యెరూషలేము కొండలపై నివాసము ఏర్పరచుకొనును.

"అతడు ఆనంద దేశమున (ఇశ్రాయేలు) ప్రవేశించుటవలన అనేకులు కూలుదురు ... కాబట్టి (మృగము) తన నగరు దేరాను సముద్రముల

క్షను పరిశుద్ధానందములు గల పర్వతమునకును మధ్య వేయును."
దానియేలు 11:41_45.

ఈ కాలమందు మృగమును, ఇశ్రాయేలీయులనేకులు, తమ మెస్సయ్యగా స్వీకరింతురు. ఇతను, వీరు సర్వసంపదలతో తులతూగు రోజులలో, వీరి విమోచకునిగా నెంచబడును.

ఈ విధముగా, వాస్తవమైన మెస్సయ్యాను కాక, మెస్సయ్యాకు విరుద్ధమైన మృగము మెస్సయ్యగా ఇశ్రాయేలీయులకు నమ్మించ చూచుట, సాతాను యొక్క ఉద్దేశమై యున్నది. ఇది పూర్తి మోసముతో కూడినదై యున్నను, మృగపు నిజమగు గుణము త్వరలోనే బయలుపర్చబడును.

## 5. ప్రపంచ రోమా మత సంఘముల నాశనము

మృగము, తాను అధికారములోనికి వచ్చుటకు సహకరించిన బాబిలోనియా మతము, తన దుష్టకార్యములను సాగించకుండ అడ్డుకొనుటను చూచి, మహా రౌద్రముతో దాని అధికారమును తొలగించి, ధ్వంసము చేసి, దాని సంపదనంతయు దోచుకొనుటకై వచ్చును. మృగపు రాజ్యములందున్న ఆపదలు, ఆర్థిక ఇబ్బందులు ఈ మత సంబంధమైన సంపదను దోచుకొనుటకును పురికొల్పును.

"ఆ స్త్రీ ధూమ్ర రక్తవర్ణముగల వస్త్రము ధరించుకొని బంగారముతోను రత్నములతోను, ముత్యములతోను అలంకరింపబడినదై ... ... ... ... నీవు, ఆ పది కొమ్ములుగల ఆ మృగమును చూచితివే, వారు ఆ వేశ్యను (బాబిలోనియా మతము లేక రోమన్ కాథోలిక్ మతము) ద్వేషించి, దానిని దిక్కులేనిదానిగాను దిగంబరిగాను చేసి, దాని మాంసము భక్షించి అగ్నిచేత దానిని బొత్తిగా కాల్చివేతురు." ప్రకటన 17:4_16).

# 6. శ్రమలకాలపు యుద్ధములు

శ్రమల ఆరంభములో, లోకమందు శాంతి నెలకొల్పబడినట్లుగా యుండును. (తెల్లని గుఱ్ఱపు మర్మము ఈ విషయమునే తెలుపుచున్నది). కాని శాంతి కొంతకాలమే యుండును. పౌలు చెప్పినరీతిగా—"లోకులు —నెమ్మదిగా ఉన్నది, భయమేమియు లేదని చెప్పుకొనుచుండగా, గర్భిణి స్త్రీకి ప్రసవ వేదన వచ్చునట్లు వారికి ఆకస్మికముగా నాశనము తటస్థించును గనుక వారెంతమాత్రమును తప్పించుకొనలేరు." 1 థెస్స లోనీకయులకు 5:3.

యుద్ధములు లోకమందు జరుగుచునే యుండును. ఈ విషయములో ఏమాత్రము సందేహము లేదు. అయితే ప్రవచనముల ననుసరించి ముఖ్యమైన యుద్ధములు మధ్యాసియా (Middle East) దేశములందు జరుగును. ఈజిప్టు, ఇశ్రాయేలీయుల మధ్యన చిరకాలమునుండి యున్న భేదములు, వివాదమునకు దారితీయును, ఈజిప్టు దేశము బలమైనదిగా అయి లేక బలమైనదని ఊహించుకొని, జయమో, అపజయమో, తేల్చు కొంటానికి తన శక్తినంతయు ఉపయోగించి ఇశ్రాయేలుమీదికి దండెత్తి వెళ్ళును.

"ఐగుప్తు దండు నైలు నదివలె ప్రవహించుచున్నది. దాని జలములు తొణుకునట్లుగా అది వచ్చుచున్నది—నేనెక్కి భూమిని కప్పెదను. పట్ట ణమును దాని నివాసులను నాశనము చేసెదను." (యిర్మీయా 46:8).

"అంత్యకాలమందు దక్షిణ దేశపు రాజు అతనితో యుద్ధము చేయును. మరియు ఉత్తర దేశపు రాజు రథములను గుఱ్ఱపు రౌతులను అనేకమైన ఓడలను సమకూర్చుకొని, తుఫానువలె అతనిమీద పడి దేశములమీదుగా ప్రవాహమువలె వెళ్ళును." దానియేలు 11:40.

ఉత్తర దేశములు, రష్యా ఆధిపత్యము క్రిందనుండి, ఇశ్రాయేలుతో యుద్ధము చేయుటకు, ఈజిప్టు దేశమునకు సహాయము చేయుటకు వచ్చును. అయితే రష్యా, తాను ఎన్నో సంవత్సరములనుండి చేసికొన్న సన్నాహములు, ఈలాంటి యుద్ధములో వ్యర్థమై పోవునేమో అనెడి భయము కలిగియున్నది.

"గాలివాన వచ్చినట్లును మేఘము కమ్మినట్లును నీవు (రష్యా), దేశము (ఇశ్రాయేలు) మీదికి వచ్చెదవు, నీవును నీ సైన్యమును నీతోకూడిన బహు జనమును దేశము మీదికి వ్యాపింతురు." (యెహెజ్కేలు 38 అధ్యాయము).

రష్యా దేశము మరియు దానితో మైత్రి కలిగిన దేశములు తమ, సైన్య, వాయు, నౌకా బలములతో ఇశ్రాయేలుమీదికి వచ్చెదరు.

ఈ సమయమందు మృగము (యూరపు సంయుక్త రాజ్యముల అధిపతి) తాను ఇశ్రాయేలీయులతో చేసికొన్న నిబంధనను బట్టి, ఆనంద దేశము లోనికి ప్రవేశించి, ఆ దేశమును ఇతరులు ఆక్రమించకుండ కాపాడు టకై ఉద్దేశించి చివరకు ప్రపంచమందలి అన్ని దేశములతో సహా ఇశ్రా యేలును ఆక్రమించుకొనును.

"అతడు (మృగము) ఆనంద దేశమున (ఇశ్రాయేలు) ప్రవేశించుటవలన అనేకులు కూలుదురు గాని ఎదోమీయులు, మోయాబీయులు, అమ్మోనీ యులలో ముఖ్యులు అతని చేతిలో నుండి తప్పించుకొందురు." (దానియేలు 11:40-41).

పై విధముగా తెల్పబడిన యుద్ధమందు యెరూషలేము మరియొక సారి పట్టబడి నాశనము కావింపబడును. ఈ విషయము, జెకర్యా ప్రవక్త ఈలాగు ప్రవచించెను—

"ఏలయనగా యెరూషలేము మీద యుద్ధము చేయుటకు నేను అన్యజనుల నందరిని సమకూర్చబోవుచున్నాను. పట్టణము పట్టపడును. ఇండ్లు కొల్ల గొట్టబడును, స్త్రీలు చెరుపబడెదరు. పట్టణములో సగముమంది చెర పట్టబడి పోవుదురు. అయితే శేషించువారు నిర్మూలము కాకుండ పట్టణములో నిలుతురు." (జెకర్యా 14:2-3).

"అతడు (మృగము) ఇతర దేశములమీదికి తన సేన నంపించును. ఐగుప్తు సహా తప్పించుకొనన నేరదు. అతడు విలువగల సమస్త బంగారు వెండి వస్తువులను ఐగుప్తు యొక్క విలువగల వస్తువులన్నింటిని వశపరచుకొని, లూబీయులను, కూషీయులను తనకు పాదసేవకులుగా చేయును." (దానియేలు 11:42-43; యిర్మియా 46:14-16).

మృగము దేవుని చేతిలోని పనిముట్టుగా యుండి, ఐగుప్తును మిగిలిన అరబ్బు మిత్ర దేశములను నాశనము చేయుటకు వాడబడును.

దీని తరువాత దేవుడే, రష్యా మొదలగు ఉత్తర దేశములతో గొప్ప యుద్ధము చేయును. ఈ విషయము యెహెజ్కేలు 38,39 అధ్యాయములలో వివరింపబడినది. ఈ యుద్ధములలో వాడబడే అణు అస్త్రములద్వార ఈ దేశములు నాశనము కావింపబడును. ఈ అస్త్రములు యూరపునుండి ప్రయోగించబడును, లేక స్వదేశమందలి అస్త్రములే తమ దేశమందు ప్రేలి నాశనమునకు దారితీయును. యెహెజ్కేలు ప్రవక్త దీని విషయమై స్పష్టముగా తెల్పెను.

"కాబట్టి నేను (దేవుడైన యెహోవా) రోషమును మహా రౌద్రమును గలిగినవాడనై యీలాగు ప్రమాణము చేసితిని.... తెగులు పంపి హత్య కలుగచేసి అతని (రష్యా) మీదను అతని సైన్యముమీదను అతనితో కూడిన జనము లనేకముల (Allies) మీదను ప్రళయమైన వానను పెద్ద వడగండ్లను అగ్ని గంధకములను కురిపించి నేను అతని (రష్యా)తో వ్యాజ్యమాడుదును." (యెజ్కేలు 38:19_22)

"... రోషుకును మెషెకునకును అధిపతియైన గోగూ నేను నీకు విరోధినై యున్నాను. నిన్ను వెనుకకు త్రిప్పి, నడిపించి ఉత్తర దిక్కున దూరములో ఉన్న నిన్ను బయలుదేరదీసిన ఇశ్రాయేలీయుల పర్వతములకు రప్పించి.... నేను మా గోగు మీదికిని ద్వీపములలో నిర్విచారముగా నివసించు వారి మీదికిని అగ్ని పంపెదను. అప్పుడు నేను యెహోవానై యున్నానని వారు (రష్యా మొ॥ దేశములు) తెలిసికొందురు." (యెహెజ్కేలు 39:1_6.)

దీనివలన అణు అస్త్రముల యుద్ధము సంభవించునని, రష్యా, మరియు రష్యాతో చేరి యుద్ధము చేయు దేశములన్నింటి సైన్యములో ఆరింట అయిదు భాగములు (5/6) నాశనము కావింపబడి చివరకు మాస్కో కూడ ధ్వంసమగునని తెలియుచున్నది. రష్యాకు పాలస్తీనా దేశము పైకి దండెత్తి వెళ్లుటద్వార ఈలాంటి పరిణామము సంభవించును. యెషయా

ప్రవక్తద్వార 2500 సం॥లకు పూర్వము చెప్పబడినట్లుగా జరుగును. "నీకు (ఇశ్రాయేలుకు) విరోధముగా రూపింపబడిన యే అయుధము వర్ధిల్లదు." —యెషయా 54:17.

రష్యా, ఈజిప్టు పడిపోవుటను చూచి మృగము ఈజిప్టు దేశ సంపదసంతటిని దోచుకొనును.

"అంతట తూర్పు నుండియు, ఉత్తరము నుండియు, వర్తమానములు వచ్చి యతని (మృగమును) కలత పరచును గనుక అత్యాగ్రహము కలిగి అనేకులను పాడుచేయుటకును నశింపజేయుటకును అతడు బయలు దేరును." (దానియేలు 11:44.)

రష్యా యుద్ధమందు ఓడిపోవుటను చూచి, తూర్పు రాజ్యములు ఏకమై మధ్యాసియా ప్రాంతముల (Middle East) ఖనిజ, పెట్రోలు నూనె సంపదలను దోచుకొనుటకై దండెత్తి వచ్చెదరు. అయితే వీరు మృగము చేతిలో చిత్తుగా ఓడిపోయి నాశనము కావింపబడెదరు.

ఈ విధముగా రష్యా, అమెరికా, అరబ్బు, తూర్పు దేశములన్నియు మృగముద్వార జయింపబడుటచే, మృగము ప్రపంచమంతటికి నియంతగా అయి పరిపాలన చేయును. (ప్రకటన 13:7)

"....ప్రతి వంశము మీదను ప్రతి ప్రజ మీదను అధికారము దానికి (మృగమునకు) యివ్వబడెను.

# శ్రమల మధ్యపు రోజులు

ఏడు సంవత్సరముల (శ్రమల) తీర్పు రోజుల నడుమ రెండు ముఖ్య సంఘటనలు జరుగును.

## 1. ఇద్దరు ప్రవక్తల సాక్షములు

యోవేలు ప్రవక్తద్వార చెప్పబడినట్లుగా "ఆ దినమున యెహోవా నామమును బట్టి ఆయనకు ప్రార్థనచేయు వారందరు రక్షింపబడుదురు."

—(యోవేలు 2:32). మనుష్యుల కొరకు సంకల్పించిన రక్షణ ఇంతటితో సమాప్తమగును. ప్రపంచమందలి మనుష్యులు రెండు తెగలకు చెందినవారుగా యున్నారు. వారు గొఱ్ఱెలు, మేకలుగా—విశ్వాసులు లేక అవిశ్వాసులుగా విభాగింపబడియున్నారు. ఈ కాలమందు మనుష్యులు ఏ తెగకు చెంది యుండెదరో, మార్పు చెందకుండ దానియందే యుందురు. 3 1/2 సంవత్సరములు ప్రకటించుటకు, సాక్షమిచ్చుటకుగాను, దేవుని చేత పంపబడిన ఇద్దరు ప్రవక్తల పని, అలజడి లేచుటద్వార ముగింపబడును.

"వారు ఇద్దరు ప్రవక్తలు) సాక్షము చెప్పుట ముగింపగానే అగాధములో నుండి వచ్చు క్రూరమృగము వారితో యుద్ధముచేసి జయించి వారిని చంపును. వారి శవములు ఆ మహాపట్టణపు సంత వీధిలో పడియుండును. వానికి ఉపమాన రూపముగా సొదొమ అనియు ఐగుప్తు అనియు పేరు; అచ్చట (యెరూషలేము) వారి ప్రభువు కూడ సిలువ వేయబడెను. మరియు ప్రజలకును, వంశములకును, ఆ యా భాషలు మాటలాడువారికని, జనములకును సంబంధించిన వారు మూడు దినములన్నర (3 1/2 దినములు) వారి శవములను చూచుచు వారి శవములను సమాధిలో పెట్టనియ్యరు. ఈ ఇద్దరు ప్రవక్తలు భూనివాసులను బాధించినందున భూనివాసులు వారి గతి చూచి సంతోషించుచు, ఉత్సహించుచు, ఒకనికొకడు కట్నములు పంపుకొందురు. అయితే ఆ మూడు దినములన్నర యైన పిమ్మట దేవుని యొద్దనుండి జీవాత్మ వచ్చి వారిలో ప్రవేశించెను గనుక వారు పాదములు ఊని నిలిచిరి. వారిని చూచిన వారికి మిగుల భయము కలిగెను. అప్పుడు - ఇక్కడికి ఎక్కిరండని పరలోకమునుండు గొప్ప స్వరము తమతో చెప్పుట వారువిని, మేఘారూడులై పరలోకమునకు ఆరోహణమైరి, వారు పోవుచుండగా వారి శత్రువులు వారిని చూచిరి. ఆ గడియలోనే గొప్ప భూకంపము కలిగినందున ఆ పట్టణములో పదియవ భాగము కూలిపోయెను. ఆ భూకంపము వలన ఏడువేల మంది చచ్చిరి. మిగిలినవారు భయాక్రాంతులై పరలోకపు దేవుని మహిమపరచిరి." (ప్రకటన 11:7-13).

ఈ సంఘటనను ప్రపంచమందలి అన్ని దేశముల వారు చూచెదరని చెప్పబడియున్నది. అంటే ఇది ఆనాడు, ప్రవేశపెట్టబడే అంతర్జాతీయ టెలివిజను ద్వార సంభవమేనని తెలిసికొనవచ్చును. మృగము శక్తిగలిగిన వాడై, ఈ ఇద్దరు దేవుని సాక్షులను (ప్రవక్తలను) చంపును. అయితే దేవుడు వారిని తిరిగి బ్రతికించుటద్వార, వారు ఆరోహణమై పోవుటచూచి, లోకమందలి అవిశ్వాసులలో గొప్ప కలవరపాటు కలుగును. ఈ సంఘటన యేసుప్రభువు సిలువ వేయబడి శ్రమనొందిన తర్వాత తాను ఏలాగు ఆరోహణమయ్యెనో, ఆలాగే జరుగును.

యేసుప్రభువు సిలువ వేయబడిన తరువాత, పెద్ద భూకంపము కలిగెను. దీనిద్వార దేవుడు చరిత్రలో ఒక సమయమును నిర్ణయించెను. అలాగే యెరూషలేము తిరిగి భూకంపము ద్వార కదల్చబడుట వలన శ్రమల కాలపు మధ్య రోజులలోనికి వచ్చిరని లోకమునకు గుర్తింపచేసి, చివరిగా రక్షణ పొందుటకు సమయము కలిగియున్నారని, అంతిమ 3 1/2 సంవత్సరముల గొప్ప శ్రమల ఆరంభములో యున్నారని మనుష్యులకు గుర్తుచేయబడును. దీని తరువాత లోకాంతము జరుగును.

## 2. మృగమును (క్రీస్తు విరోధిని) పూజించుట

అన్ని దేశములు, మృగపు ఆధిపత్యముక్రిందికి తేబడును. మృగపు పరిపాలనలో ప్రపంచమంతటికి, (తనక్రింద) ఒకేపాలన, సైన్యము, ఆహార క్రయవిక్రయములు మొదలగునవి జరుగును. ఇతను ప్రపంచమంతటికి, నియంతగా (Dictator) నగును.

మత సంబంధమైన బాబిలోనియాను మృగము నాశనముచేసి, దాని ఖాళీని పూర్తిచేయుటకు, ఒక క్రొత్త మతమును స్థాపించును.

దీనికి ముందుగా, అతడు, యూదుల మతమును నాశనము చేయుటకు సంకల్పించి, యెరూషలేములోని దేవాలయములో జరుగు బలులను నైవేద్యములను నిలిపివేయించును.

"అతడు (మృగము) ఒకవారము (7 సం॥ వరకు అనేకులకు నిబంధ నను స్థిరపరచును, అర్థ వారమునకు (3 1/2 సం॥) బలిని నైవేద్యమును నిలిపివేయును, హేయమైనది నిలుచువరకు నాశనము చేయువాడు (మృగము) వచ్చును. నాశనము చేయువానికి రావలెనని నిర్ణయించిన నాశనము ముగించువరకు ఈలాగున జరుగును." దానియేలు 9:27.

రెండవదిగా, ఇతడు యూదుల దేవాలయములో తన సింహాసనమును ప్రతిష్ఠించి కూర్చుండి తానే దేవుడనని చెప్పుకొనును.

"ఏది దేవుడనబడునో, ఏది పూజింపబడునో, దాని నంతటిని ఎదిరించుచు, దాని కంతటికి పైగా వాడు తన్ను తానే హెచ్చించుకొనును, తాను (మృగము) దేవుడనని తన్ను కనుపరచుకొనుచు, దేవుని ఆలయములో కూర్చుండును గనుక ఏ విధముగా నైనను ఎవడును మిమ్మును మోసపరచనియ్యకుడి." 2 థెస్సలోనీకయులకు 2:4.

"ఆ రాజు (మగృము) ఇష్టాను సారముగా జరిగించి తన్ను తానే హెచ్చించుకొనుచు అతిశయపడుచు, ప్రతి దేవత మీదను దేవాదిదేవుని మీదను గర్వముగా మాటలాడుచు ఉగ్రత సమాప్తి యగువరకు వృద్ధి పొందును; అంతట నిర్ణయించినది జరుగును." దానియేలు 11:36.

పై వచనము ద్వార, మగృము అన్ని మతములకు విరోధియై, అందరును తన్ను మాత్రమే పూజించవలెనని బలవంతము చేయునని స్పష్టమగుచున్నది. అబద్ధ ప్రవక్త (రెండవ మృగము) మృగము యొక్క ప్రతిమను చేసి, అందరిచే పూజింపచేయును. ఈ ప్రతిమ మాట్లాడునదిగా యుండును. ఈ ప్రతిమ కంప్యూటర్ వలన ఈలాగున మాట్లాడుట సంభవముగానే యుండును.

"అది (అబద్ధ ప్రవక్త) ఆకాశము నుండి భూమికి మనుష్యుల యెదుట అగ్ని దిగివచ్చునట్లుగా గొప్ప సూచనలు చేయుచున్నది. కత్తి దెబ్బ తినియు బ్రతికిన యీ క్రూర మృగమునకు ప్రతిమను చేయవలెనని అది భూనివాసులతో చెప్పుచు, ఆ మృగము ఎదుట చేయుటకు తన కియ్యబడిన సూచనలవలన భూనివాసులను మోస పుచ్చుచున్నది. మరియు

ఆ మృగము యొక్క ప్రతిమకు నమస్కారము చేయని వారిని హతము చేయునట్లును, ఆ మృగము యొక్క ప్రతిమకు ప్రాణమిచ్చుటకై దానికి అధికారము ఇయ్యబడెను. (ప్రకటన 13:13-15.)

ఈ ప్రతిమ దేవాలయములో ప్రతిష్ఠింపబడునని దానియేలు ప్రవక్తకూడ ప్రవచించెను.

"అతని పక్షమున శూరులు లేచి, పరిశుద్ధ స్థలపు కోటను అపవిత్రపరచి, అనుదిన బలి నిలిపివేసి, నాశనమును కలుగజేయు హేయమైన వస్తువును నిలువ బెట్టుదురు'' ప్రకటన 11:31.

ప్రపంచమందలి ప్రతివారు ఈ ప్రతిమకు నమస్కారము చేయుటకు బలవంతము చేయబడుదురు, మరియు నమస్కారము చెయ్యనివారు సంహరింపబడెదరు.

## 3. యూదులు (శ్రమలకోర్చలేక) పారిపోవుట

యూదులు, తమ దేవుని తప్ప వేరొక దేవుని లేక ప్రతిమను పూజింపరు కావున, ఈ మృగపు ప్రతిమకు నమస్కారము చేయుటకు ఒప్పుకొనరు. అయితే ఈలాగున చేయుటద్వార, వారు మృగము వలన ఘోరముగా హింసించబడెదరు. ఈ సమయమును గూర్చియే ప్రభువైన యేసు, ఈ హేయమైన వస్తువు నిలువపెట్టబడిన తరువాత యూదయలో నున్నవారు పారిపోవుటకు వెనుక తీయవద్దని చెప్పెను— "కాబట్టి ప్రవక్తయైన దానియేలు ద్వార చెప్పబడిన నాశనకరమైన హేయవస్తువు పరిశుద్ధ స్థలమందు నిలుచుట మీరు చూడగానే—చదువువాడు గ్రహించుగాక - యూదయలో ఉండువారు కొండలకు పారిపోవలెను. మిద్దెమీద ఉండువాడు తన యింటిలో నుండి ఏదైనను తీసికొనిపోవుటకు దిగకూడదు .... అప్పుడు మహాశ్రమ కలుగును గనుక మీరు పారిపోవుట చలికాలమందైనను విశ్రాంతి దినమందైనను సంభవింపకుండ వలెనని ప్రార్థించుడి. లోకారంభమునుండి ఇప్పటివరకు అట్టిశ్రమ కలుగలేదు, ఇక ఎప్పుడును కలుగబోదు. ఆ దినములు

తక్కువ చేయబడక పోయినయెడల ఏ శరీరియు తప్పించుకొనదు. ఏర్పర్చబడిన వారి నిమిత్తము ఆ దినములు తక్కువ చేయబడును." (మత్తయి 24:15_22).

ఈ మహా శ్రమల రోజులలో ఎందరో పరిశుద్ధులు చంపబడెదరు. కొందరు కొండలలో దాగుకొని, అతికష్టము మీద ఈ సమయము గడచిపోవు వరకు తమ్మును తాము రక్షించుకొందురు.

"ఆ స్త్రీ (ఇశ్రాయేలు) ఆరణ్యమునకు పారిపోయెను: అచ్చట వారు వెయ్యిన్ని రెండువందల అరువది (1260) దినములు ఆమెను పోషింపవలెనని దేవుడామెకు ఒక స్థలము సిద్ధపరచి యుంచెను.... అందువలన ఆమె అరణ్యములో ఉన్న తన చోటికి ఎగురునట్లు గొప్ప పక్షిరాజు రెక్కలు రెండు ఆమెకు ఇయ్యబడెను. అచ్చట ఆ సర్పముఖమును చూడకుండ ఆమె ఒక కాలము కాలములు అర్థకాలము పోషింపబడును." (ప్రకటన 12:6_14)

ఈ 3 1/2 సం॥లలో నాశనము కావింపబడగా మిగిలిన యూదులు ఎచ్చట దాచబడెదరు? — ఈ సమయములో పూర్వకాలపు ఎడారిలోని పట్టణమగు పెట్రా (Petra) యూదులు దాగుకొనుటకు వినియోగింపబడునని కొందరు భావింతురు. ఈ పట్టణము యెరూషలేమునకు 150 మైళ్ళ దూరములో తూర్పు పశ్చిమదిశల మధ్యన కలదు. ఈ పట్టణము లోనికి ప్రవేశించు మార్గమంతయు ఎడారిమయమై, కొండలమధ్యన కోటను కల్గియున్నది. ఇది ప్రస్తుతము జోర్డాన్ దేశమందు యాత్రికులు దర్శించు క్షేత్రముగా యున్నది. ఈ స్థలము యాత్రికులను ఆకర్షించుటకుగల కారణమేమనగా, కొండలమధ్యనున్న పురాతన పట్టణ భాగములో 6,000 అడుగుల పొడవైన గొప్ప నెర్రె (slit) ను కల్గియున్నది. ఇచ్చటనే దేవుడు అద్భుత రీతిగా శ్రమల రోజులలో మిగిలిన యూదులను దాచునని భావింపబడుచున్నది.

## 4. మృగము యొక్క ముద్ర (666):-

మృగము చివరిగా, లోకమందలి సర్వ జనుల మనస్సులను, శరీరములను తన అధికారములోనికి తెచ్చుకొనుటకు ప్రయత్నించును.

ఇతను (మృగము) లోకమందలి ప్రతి మనుష్యుడు తనకు సంబంధించిన ముద్రను నొసటి యందైనను లేక కుడిచేతి మీదనైనను ధరించవలెనని బలవంతము చేయును. మృగమునకు సంబంధించిన ముద్రలేనివాడు ఏ వస్తువైనను క్రయ విక్రయము చేయుటకు వీలుకాకుండ చేయబడును. ఈ ముద్ర, 666 అనెడి సంఖ్య, ప్రతివారు ధరించులాగున, కంప్యూటర్ పద్ధతిద్వారా, (ఎవరైన ధరించకున్న వారును) తమ నొసటి మీద లేక కుడిచేతి పైన ధరించునట్లుగా మృగము బలవంతము చేయును.

"కాగా కొద్దివారు గాని, గొప్పవారు గాని, ధనికులు గాని, దరిద్రులు గాని, స్వతంత్రులు గాని, దాసులు గాని, అందరును తమ కుడిచేతిమీద నైనను తమ నొసటి యందైనను ముద్ర వేయించుకొనునట్లును, ఆ ముద్ర అనగా ఆ మృగము పేరైనను దాని పేరిట సంఖ్యయైనను గలవాడు తప్ప, క్రయ విక్రయములు చేయుటకు మరి యెవనికిని అధికారము లేకుండునట్లును అది వారిని బలవంతము చేయుచున్నది. బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము; అది యొక మనుష్యుని సంఖ్యయే, ఆ సంఖ్య ఆరువందల అరువది యారు; ఇందులో జ్ఞానము కలదు." (ప్రకటన 13:16-18)

ఆలాగున సాతానుచే ఆవరింపబడిన మృగము 3 1/2 సంవత్సరములు దుష్టపరిపాలనను సాగించుటకై, ప్రపంచమందలి సమస్తము దాని అధికారము క్రిందికి తేబడును.

"డంబపు మాటలను దేవ దూషణలను పలుకు ఒక నోరు దానికి ఇయ్య బడెను మరియు నలుబది రెండు (42) నెలలు తన కార్యము జరుప నధికారము దానికి ఏర్పాటాయెను. గనుక దేవుని దూషించుటకును, ఆయన నామమును, ఆయన గుడారమును, పరలోక నివాసులను దూషించుటకును అది నోరు తెరచెను. మరియు పరిశుద్ధులతో యుద్ధము చేయను వారిని జయింపను దానికి అధికార మియ్యబడెను. ప్రతి వంశము మీదను ప్రతి ప్రజ మీదను ఆయాభాషలు మాటలాడువారి మీదను ప్రతి జనము మీదను అధికారము దానికియ్యబడెను. భూనివాసులందరును, అనగా జగదుత్పత్తి మొదలుకొని వధింపబడియున్న గొఱ్ఱెపిల్ల యొక్క

జీవగ్రంథమందు ఎవరి పేరు వ్రాయబడలేదో వారు, ఆ మృగమునకు నమస్కారము చేయుదురు." ప్రకటన 13:5-8.

# అంతిమ (3 1/2 సం॥ల) శ్రమలరోజులు

ఏడవదూత ఊదు బూర ద్వారా వచ్చెడి తీర్పు, కడవరి ఏడు అంతిమ తీర్పుల ప్రారంభమును సూచించుచు; ఇవి ఉగ్రతా పాత్రల ద్వార కుమ్మరింపబడి, మృగమునకును, దాని ముద్రను పొందిన వారికిని శ్రమలు కల్గుటకై ఉద్దేశించబడిన తీర్పులుగా యుండును. దేవుని ఉగ్రత ఈ పాత్రల ద్వార కుమ్మరింపబడి, మృగమును, మరియు మృగపు సంబంధికులును తీవ్రమైన శ్రమలకు గురియగుదురు.

---

## మొదటి ఉగ్రతా పాత్ర

### చెడ్డపుండ్లు

"అంతట మొదటి దూత వెలుపటికి వచ్చి తన పాత్రను భూమిమీద కుమ్మరింపగా ఆ క్రూర మృగము యొక్క ముద్రగల వారికిని దాని ప్రతిమకు నమస్కారము చేయువారికిని బాధకరమైన చెడ్డపుండ్లు పుట్టెను." (ప్రకటన 16:2.)




---

ఈ ఉగ్రతా పాత్ర శ్రమల రెండవ భాగమైన 3½ సం॥ముల ప్రథమ భాగమందు, తీర్పుల రూపమున కుమ్మరింపబడును. అయితే ఈ తీర్పు మృగము, సర్వలోక జనమునకు తన ముద్రను ముద్రించక ముందు జరుగదు.

ఈ ఉగ్రతా పాత్ర ద్వార కల్గెడి శ్రమలు, మృగముయొక్క ముద్రను ధరించిన వారి కొరకే ప్రత్యేకింపబడుట, దీనిలోని విశేషము. ఈ చెడ్డ పుండ్లు, అంటువ్యాధి మాదిరిగా తీవ్ర రూపము దాల్చి, మృగపు ముద్రలను ధరించిన వారిని ద్వేష పూరితులనుగా మార్చును.

## రెండవ ఉగ్రతా పాత్ర

*సముద్రము రక్తముగా మారుట*




"రెండవ దూత తన పాత్రను సముద్రములో కుమ్మరింపగా సముద్రము పీనుగ రక్తము వంటిదాయెను. అందువలన సముద్రములో ఉన్న జీవ జంతువులన్నియు చచ్చెను." (ప్రకటన 16:3)

ముందుగా వివరింపబడిన శ్రమల రోజులలో, రెండవ బూర ద్వార కల్గిన తీర్పు వలన సముద్రములలోని, ప్రాణులు మూడవ భాగము నాశనమయ్యేనని తెలిసికొంటిమి. అయితే ఇప్పుడు ఈ తీర్పుద్వార ఇంతకు పూర్వము నాశనము కావించబడగా మిగిలిన సమస్త జల చరములు నాశనము కావించబడును. ఈలాగు జరుగుట ద్వార జాలర వృత్తి చేతనే జీవనము కావించువారు గొప్ప కష్టములకు గురియయ్యేదరు. ఇట్లు ఈ సంఘటన ప్రపంచమందు గొప్ప విషాదకరమైనదిగా రూపొందును.

## మూడవ ఉగ్రతా పాత్ర

*నదులు రక్తముగా మారుట*




"మూడవ దూత తన పాత్రను నదులలోను జలధారలలోను కుమ్మరింపగా అవి రక్తమాయెను." ప్రకటన (16:4)

ఇచ్చట మృగము మరియు వాని రాజ్యములు తాను శిరచ్ఛేదము కావించి, వేవేల కొలది క్రీస్తు విశ్వాసుల రక్తమును దారపోసిన దుష్ట కార్యములకు ప్రతిఫలముగా రాజ్యములందలి సమస్త నదులు రక్తగా మారి, రక్తమునే వారు త్రాగునట్లు తీర్పు తీర్చబడినది. ప్రపంచమందలి ప్రతి నది, సరస్సు రక్తమయమగుట ద్వార కరవు, దాహము హెచ్చైన గొప్ప విపత్తు సంభవించును.

## నాలుగవ ఉగ్రతా పాత్ర

### తీవ్రమైన వేడి




"నాలుగవ దూత తన పాత్రను సూర్యుని మీద కుమ్మరింపగా మనుష్యులను అగ్నితో కాల్చుటకు సూర్యునికి అధికారము ఇయ్యబడెను. కాగా మనుష్యులు తీవ్రమైన వేడిమితో కాలిపోయి, యీ తెగుళ్ల మీద అధికారము గల దేవుని నామమును దూషించిరి. గాని, ఆయనను మహిమపరచునట్లు వారు మారుమనస్సు పొందినవారు కారు." (ప్రకటన 16:8-9.)

ఈ తీర్పు ద్వార ప్రపంచమందు, వాతావరణ స్థితిగతులు మామూలి స్థితి నుండి మార్పొందును. మరియు భూమికి, సూర్యునికి గల సంబంధములో మార్పు చెందును. కావున సూర్యుని భయంకరమైన వేడిమి భూమిపై ప్రభావితమగును. మరియు ఈ సూర్యుని వేడిమి ఎన్నడును లేనంత తీవ్రత కల్గియుండును.

ఇచ్చట ఈ చివరి ఏడు తీర్పులందు మరో ముఖ్య విషయము గమనించగలము. మనుష్యులు నరకములో నుండెడి వేదనను భరింతురే కాని, ఈలాంటి శ్రమల తీవ్రతల ద్వారనైన మారుమనస్సు పొందరు. ఇట్లు వారి రక్షణకొరకు వేచియున్న క్షమా, కృప కాలము గడచిపోవును.

## ఐదవ ఉగ్రతా పాత్ర

### చీకటి, వేదనలు




"అయిదవ దూత తన పాత్రను ఆ క్రూర మృగముయొక్క సింహాసనముమీద కుమ్మరింపగా, దాని రాజ్యము చీకటి కమ్మెను. మనుష్యులు తమకు కలిగిన వేదనలను బట్టియు పుండ్లను బట్టియు పరలోకమందున్న దేవుని దూషించిరి గాని తమ క్రియలను మాని మారు మనస్సు పొందినవారు కారు." (ప్రకటన 16:10-11)

ఈ తీర్పు ద్వార వచ్చెడి శ్రమ చాల తీవ్రతరముగా యుండును. చీకటి వేదనలు ఎలాగు సంభవించునో ఇచ్చట వివరింపబడలేదు. అయితే ఈ శ్రమల తీర్పు, మృగపు రాజ్యము—రోమా రాజ్యము పైకి వచ్చును. మృగము ప్రపంచమునకంతటికి సార్వభౌముడైనను, ఇతని సింహాసనము, రాజ్యముఖ్య పట్టణము యూరపునందే యుండును.

ఈ సంఘటన, తూర్పు రాజ్యాధిపతులు, మృగము సర్వలోకమునకు అధిపత్యమును వహించియు ఏ సమస్యను తీర్చక యుండుటచే మరియు వచ్చెడి శ్రమల తీవ్రతను అరికట్టుటలో విఫులుడగుటచే వారి ద్వార ఇతనిపైకి ప్రయోగించబడె రసాయన అస్త్రముల ద్వార కూడ ఈ విపత్తు సంభవించునేమో?

---

## ఆరవ ఉగ్రతా పాత్ర

### హార్ మెగిద్దోను యుద్ధము



"ఆరవ దూత తన పాత్రను యూఫ్రటీసు అను మహానది మీద కుమ్మరింపగా తూర్పునుండి వచ్చు రాజులకు మార్గము సిద్ధపరచ బడునట్లు దాని నీళ్ళు యెండి పోయెను. మరియు ఆ ఘటసర్పము నోట నుండియు క్రూర మృగము నోట నుండియు అబద్ధ ప్రవక్త నోటనుండియు కప్పలవంటి మూడు అపవిత్రాత్మలు బయలు వెడలగా చూచితిని. అవి సూచనలు చేయునట్టి దయ్యముల ఆత్మలే; అవి సర్వాధికారియైన దేవుని మహా దినమున జరుగు యుద్ధమునకు లోకమంతట ఉన్న రాజులను పోగు చేయవలెనని వారి యొద్దకు వెళ్ళి, హెబ్రీ భాషలో హార్ మెగిద్దోను చోటుకు వారిని ప్రోగుచేసెను." (ప్రకటన 16:12-16).

---

ఈ ఉగ్రత పాత్రద్వార, హార్ మెగిద్దోనను చోట, దేశములనన్ని ప్రోగు చేయబడి గొప్ప యుద్ధనకు సమకూర్చబడి, దేశములన్నియు దేవునితో యుద్ధము చేయుటకు చేర్చబడును. ఈ యుద్ధము సర్వశక్తి గల దేవుని యొక్క గొప్పయుద్ధముగా పరిగణింపబడును.

హర్ మెగిద్దోను అనునది మెగిద్దోను అనుకొండకు హెబ్రీభాషలోని పేరు. ఈ కొండ ఇశ్రాయేలు దేశమునకు ఉత్తర దిశన యున్నది. మరియు మెగిద్దోను, జెజ్రెల్ మైదాన ప్రాంతములకు సమీపమున కలదు. అంతే కాక ఇది కొండ ప్రాంతములగు సమరయ, యూదా, యెరూషలేములకు సింహద్వారముగా యున్నది.

సొలొమోను రాజు మరియు ఇశ్రాయేలీయుల రాజులు తమ కోటలను ఈ కొండపైననే కట్టిరి. ఎస్ డ్రెలన్ మైదాన ప్రాంతము, కర్మెలు పర్వతము మొదలుకొని మధ్యదరా సముద్ర తీరమువరకు విస్తరించి, 20 మైళ్ళ పొడవు, 14 మైళ్ళ వెడల్పుతో ఉత్తరదిశన టాబోరు, దక్షిణ పడమర దిశల మధ్యయందు గిల్ బోరా కొండలను సరిహద్దులుగా కలిగియున్నది. ఈ మైదాన ప్రాంతము పూర్వమందు ఎన్నో గొప్ప యుద్ధములకు స్థానమైయుండెను. అలాగే సర్వశక్తుడగు దేవుని యుద్ధపు దినమున కూడ ఇదే రణరంగ స్థానముగా యుండి ప్రసిద్ధికెక్కును.

ఈ ఆరవ ఉగ్రతా పాత్ర కుమ్మరింపబడుటచే, గొప్ప నదియగు యూఫ్రటీసు నది నీరు యెండిపోయెను. యూఫ్రటీసు నది ప్రపంచములోని నదులలో గొప్ప నదిగా పేరు గాంచినది. ఇది టర్కీ దేశమందు ఉద్భవించి, 1780 మైళ్ల పొడవున పారుచు సిరియా, ఈరాఖ్ ప్రాంతములగుండా ప్రయాణించి, పెర్షియా సింధుశాఖ ద్వార అంతరించును. ఈ నది యెండిపోవుటచే, తూర్పు రాజ్యములు మధ్యాసియా ప్రాంతముపై, టిబెట్, పాకిస్తాన్, ఇరాన్, ఈరాఖ్ ప్రాంతములగుండా దాడి జరుపుటకు వీలుకలుగును.

ఈ దాడి ఎందుకొరకు జరుగునో కారణము తెలియదు. కాని, సాతాను, ప్రవచనముల నెరవేర్పుకొరకై అన్ని రాజ్యములను, ప్రభువగు దేవునితో యుద్ధము చేయుటకై ఇచ్చటికి సమకూర్చునని మాత్రము తెలియనగును. ఈ దాడి జరుపుటలో తూర్పు రాజ్యములకు మరొక ఉద్దేశమును కలదు. 3 సం॥ల మృగముయొక్క పరిపాలనను సహించలేక వానిని పడద్రోయుటకు గాను, అన్ని రాజ్యములు ఏక దాటిగా కలిసి, మధ్యాసియా ప్రాంతమును స్వాధీన పర్చుకొనుటకై వచ్చును.

ఈ సమయమందే ప్రపంచమందున్న తక్కిన రాజ్యములు తూర్పు రాజ్యములకు, లేక మృగముయొక్క రాజ్యములకు మైత్రి దేశములుగా యుండి ఈ యుద్ధములో పాల్గొనుటకై నలుమూలలనుండి హర్ మెగిద్దోను ప్రాంతమునకు తరలి వచ్చును. ఈలాగు చేరిన భూరాజ్యముల సైన్యములన్నియు ఎస్డ్రేలన్ మైదాన ప్రాంతమందే బారులు తీర నిలువబడక, ఈ ప్రాంతము మొదలుకొని ఇరాన్, సిరియా, టర్కీ, ఈజిప్టు, ఆఫ్రికా, యూరపు మరియు మధ్యదరా సముద్ర ప్రాంతములలో యుద్ధమునకై సిద్ధముగా యుండును. అయితే ఎస్డ్రేల్-హర్ మెగిద్దోను ప్రాంతమే రాజ్యములు యుద్ధము చేయు కేంద్రస్థానముగా యుండును.

ఈ యుద్ధము ఎన్ని రోజులు జరుగునో తెలియదు కాని, ఈ యుద్ధములోనికి ప్రభువగు క్రీస్తు తన వెవేల సైన్యసమూహముతో ప్రత్యక్షమగుటతోడనే ప్రతి వారిని ఆశ్చర్య చకితులనుగా చేయును.

ఈ యుద్ధపు వివరణలు ప్రకటన 19 వ అధ్యాయములో స్పష్టముగా వివరింపబడినది.

"మరియు పరలోకము తెరువబడి యుండుట చూచితిని. అప్పుడిదిగో, తెల్లని గుఱ్ఱమొకటి కనబడెను దానిపై కూర్చున్నవాడు (క్రీస్తు) నమ్మకమైనవాడును సత్యవంతుడును అను నామము గలవాడు. ఆయన నీతినిబట్టి విమర్శచేయుచు యుద్ధము జరిగించుచున్నాడు. ఆయన నేత్రములు అగ్నిజ్వాలవంటివి....పరలోకమందున్న సేనలు (దూతలు) శుభ్రమైన తెల్లని నారబట్టలు ధరించుకొని తెల్లని గుఱ్ఱములెక్కి ఆయనను వెంబడించుచుండిరి. జనములను కొట్టుటకై ఆయన నోటనుండి వాడిగల ఖడ్గము బయలు వెడలు చున్నది. ఆయన యినుప దండముతో వారిని ఏలును. ఆయనే సర్వాధికారియగు దేవుని తీక్షమైన ఉగ్రత అను మద్యపుతొట్టి త్రొక్కును. - రాజులకు రాజును, ప్రభువులకు ప్రభువును అను నామము ఆయన వస్త్రము మీదను వ్రాయబడియున్నది.

మరియు ఒక దూత సూర్యబింబములో నిలిచి యుండుట చూచితిని అతడు గొప్ప శబ్దముతో ఆర్భటించి—రండి, రాజుల మాంసమును సహస్రాధిపతుల మాంసమును బలిష్ఠుల మాంసమును గుఱ్ఱముల మాంసమును వాటిమీద కూర్చుండువార మాంసమును, స్వతంత్రుల

దేమి దాసులదేమి కొద్దివారిదేమి గొప్పవారిదేమి, అందరి యొక్క మాంసమును తినుటకై దేవుని గొప్పవిందుకు కూడిరండని అకాశమధ్య మందు ఎగురుచున్న సమస్త పక్షులను పిలిచెను. (ప్రకటన 19:11-19)

ఆయన (క్రీస్తు) అధికారముతో వచ్చునప్పుడు ఖడ్గము ఆయన నోటనుండి బయలు వెళ్ళునని వివరింపబడియున్నది. ఈ ఖడ్గము ఆయన అధికారమును సూచించుచున్నది. మరియు ఆయన మాటకు తిరుగులేదని, ప్రతివారు ఆయనకు లోబడి యుండవలసినదేనని కూడ సూచించుచున్నది. ఈ విషయమే బైబిలులో ఈలాగు చెప్పబడియున్నది. 1. భూమిమీదను, పరలోకమందును ఆయనకు(క్రీస్తుకు)సర్వాధికారము ఇవ్వబడియున్నది. మత్తయి 28:18. 2. తీర్పు తీర్చుటకు సర్వాధికారము ఆయనకు (క్రీస్తుకు) అప్పగించబడియున్నది. యోహాను 5:22

మృగమును, దానికి సంబంధించిన భూరాజులును, ప్రభువైన క్రీస్తుతో యుద్ధము జరుపుటకు బారులుతీర్చి సిద్ధముగా యుండెదరు. వీరు సాతాను శక్తిని ఆధారము చేసుకొనే ఈ కార్యమునకు తలపడెదరు. జరిగెడి ఈ యుద్ధములో, నేడు శాస్త్ర విజ్ఞానముద్వార కనుగొనబడిన ఏ మారణా స్త్రములును పనిచేయలేవు. యుద్ధములో చివరకు మృగమును, వానికి సంబంధించిన రాజ్యములు పూర్తిగా ఓడి పోవును.

"అప్పుడా మృగమును, దాని యెదుట సూచక క్రియలుచేసి దానిముద్రను వేయించుకొనిన వారిని ఆ మృగపు ప్రతిమకు నమస్కరించినవారిని మోస పరచిన ఆ అబద్ధ ప్రవక్తయు, పట్టబడి వారిద్దరు గంధకముతో మండు అగ్నిగుండములో ప్రాణముతోనే వేయబడిరి. కడమవారు గుఱ్ఱము మీద కూర్చున్నవాని (క్రీస్తు) నోటనుండివచ్చిన ఖడ్గముచేత వధింపబడిరి; వారి మాంసమును పక్షులన్నియు కడుపార తినెను." (ప్రకటన 19 : 20-21.)

## ఏడవ ఉగ్రతా పాత్ర

### *భూకంపము, గొప్ప వడగండ్లు*

"ఏడవ దూత తన పాత్రను వాయుమండలము మీద కుమ్మరింపగా సమాప్తమైనదని చెప్పుచున్న యొక గొప్ప స్వరము గర్భాలయములో ఉన్న సింహాసనము నుండి వచ్చెను ... ఆ వడగండ్ల దెబ్బ మిక్కిలి గొప్పదైనందున మనుష్యులు ఆ దెబ్బనుబట్టి దేవుని దూషించిరి."

(ప్రకటన 16:17-21.)




ఇచ్చట పై ప్రవచనముయు ప్రకారము ప్రపంచమంత భూకంపము ద్వార కదిలింపబడును. ఈ భూకంపము ఏ ఒక్క ప్రాంతమునకో చెందినదిగా యుండక, ప్రపంచమందలి ప్రతి ప్రాంతము దీనిద్వార కదిలింపబడును. అంతేగాక ఇది మానవుని చరిత్రలో కనివిని ఎరుగనిదై యుండును.

ప్రవచనము ప్రకారము, లోకమందు ఘోరనష్టము, మనుష్య నాశనము ఈ భూకంపముద్వార కలుగును. యెరుషలేము పట్టణము ఈ భూకంపమునకు గురియై, పట్టణము మూడు భాగములుగా విభజింపబడును. రోమ్ (బాబిలోనియా నివాసస్థానము) ఈ భూకంపమునకు గురియై నాశనము కావింపబడును. లోకమందలి పెక్కు రాజ్యముల పట్టణములు కూలిపోవును, ద్వీపములు సమూలనాశనము కావించబడును, కొండలు విరుగ గొట్టబడి చదునుగావించబడును. దీని ద్వార చివరకు భూమి భూగోళశాస్త్రమే మార్పునొందును.

కాలిఫోర్నియా ప్రాంతమున జరుగనున్న భూకంపము ఈ సమయముననే జరుగవచ్చునని బావించవచ్చును. ఈభూకంపము లోకమందలి నాలుగింట మూడు భాగములను($\frac{3}{4}$)కదిలించును. ఇది భూకంపముయొక్క రేఖయగు, దక్షిణ అమెరికా, కరిబ్బీన్, కాలిఫోర్నియా, అలాస్కా, జపాన్, హిమాలయాప్రాంతము, ఇరాన్, ఇశ్రాయేలు, టర్కీ మరియు దక్షిణ యూరపు ప్రాంతములను కంపింపచేయును. ఇది సంభవమా? అని నీవు

అనిపించవచ్చును, గాని 1964 సం॥ లో అలాస్కాలో వచ్చిన భూకంపము ద్వార హిమాలయ ప్రాంతము మరియు సగము ప్రపంచము దీని ప్రభావమునకు గురియైయ్యెను. వీనిలో, భూకంప రేఖ (Earthquake belt) యందున్న, లాస్ ఎంజల్స్, సాన్‌ఫ్రాన్సిస్కో టోక్యో మొదలగునవి కలవు.

ఈ భూకంపము యుగ సమాప్తికి నాంది పలుకుచు, దేవుని ద్వార క్రొత్త యుగమును స్థాపింపబడుటకు సాధనముగా వాడబడును. భూకంపము ద్వారనే కాక, ఎడవ ఉగ్రతా తీర్పు ద్వార గొప్ప వడగండ్ల (సుమారు 5 కిలోల బరువు కలిగియున్న వర్షపు రాళ్ళ) వర్షము కురియును. దీని ద్వార గొప్ప వఱదల బీబత్స కలుగును. ఈలాంటి వర్షము జూన్ 1970 సం॥న పెరు (Peru) ప్రాంతములో వచ్చెను. కావున, ఈ వర్షము ఎలాగుండునో తెలియనగును.

అంత్యమున, దుష్టకార్యములకు, దేవునికి విరోదకార్యములకు, నీతి భ్రష్టత్వ కార్యములకు మూల కారకుడైన సాతాను బందింపబడి, ఈ యుగమునకు సమాప్తి జరుగును.

"మరియు పెద్ద సంకెళ్లను చేత పట్టుకొని అగాధము యొక్క తాళపు చెవిగల యొక దేవదూత పరలోకము నుండి దిగివచ్చుట చూచితిని. అతడు ఆది సర్పమును, అనగా అపవాదియు సాతానును అను ఆ ఘట సర్పమును పట్టుకొని వెయ్యి సంవత్సరములు వానిని బంధించి అగాధములో పడవేసి, ఆ వెయ్యి సంవత్సరములు గడచువరకు ఇక జనములను మోస పరచకుండునట్లు అగాధమును మూసి దానికి ముద్రవేసెను. అటు పిమ్మట వాడు కొంచెము కాలము విడిచిపెట్టబడవలెను." (ప్రకటన 20:1-3).

ఈ విధముగా మూడు దుష్ట శక్తులగు సాతాను, మృగము, అబద్ధ ప్రవక్త నాశనము కాబింపబడెదరు. ఈ ఏడు సంవత్సరముల శ్రమల రోజులలో 5/6 వంతుల ప్రపంచ జనాభ నశించును.

ప్రియ చదువరీ! నీవు ఇంతవరకు ఈ లోకమునకు రాబోయెడి భయంకర తీర్పులను, వాని పరిణామములను తెలిసికొనియున్నావు. ఈ ఉగ్రత

రోజులనుండి తప్పించుకొను మని నిన్ను స్వయముగా కోరుచున్నాము! ఈ పుస్తకపు చివరి అధ్యాయములో నీవు ఏమి చెయ్యవలసినది నీకు తెలుపబడి యున్నది.

ఈ విధముగా సాతానుకు సంబంధించిన మృగము, అబద్ధ ప్రవక్త నాశనము కావింపబడెదరు. ఈ 7 సం॥ల శ్రమల రోజులలో లోక మందలి జనాభాలో అయిదింట అరుపాళ్లు (5/6) శ్రమల ద్వార చంప బడెదరు. ఇక ఇప్పటినుండి నూతన శకము ఆరంభమగును.

ఇప్పుడు ఇక వచ్చెడి క్రొత్త యుగము అత్యున్నత స్థితిని కల్గినదై యుండును.

# క్రీస్తు ప్రభువు (రెండవ మారు) భూమిపైకి దిగివచ్చుట

> ''ఇదిగో ఆయన (క్రీస్తు ప్రభువు) మేఘారూఢుడై వచ్చుచున్నాడు. ప్రతి నేత్రము ఆయనను చూచును, ఆయనను పొడిచినవారును చూచెదరు. భూ జనులందరు ఆయనను చూచి రొమ్ము కొట్టుకొందురు. అవును ఆమేన్." ప్రకటన 1:7.

"ఆదాము మొదలుకొని ఏడవ తరమువాడైన హనోకు ఈ విషయమై ప్రవచించిరి.—"ఏడవవాడైన హనోకు కూడ వీరిని గూర్చి ప్రవచించి యిట్లనెను.—ఇదిగో అందరిని తీర్పు తీర్చుటకును, వారిలో భక్తిహీను లందరును భక్తిహీనముగా చేసిన వారి భక్తిహీన క్రియలన్నిటిని గూర్చియు, భక్తిహీనులైన పాపులు తనకు విరోధముగా చెప్పిన కఠిన మైన మాటలన్నిటిని గూర్చియు వారిని ఒప్పించుటకును, ప్రభువు తన వేవేల పరిశుద్ధుల పరివారముతో వచ్చెను. వారు తమ దురాశల చొప్పున నడుచుచు, లాభము నిమిత్తము మనుష్యులను కొనియాడుచు (ముఖస్తుతి చేయుచు) సణుగువారును తమ గతినిగూర్చి నిందించువారునై యున్నారు. వారి నోరు డంబమైన మాటలు పలుకును." (యూదా. 14,16)

"....అప్పుడు మనుష్య కుమారుని సూచన ఆకాశమందు కనబడును. అప్పుడు మనుష్య కుమారుడు ప్రభావముతోను, మహా మహిమ తోను ఆకాశ మేఘారూఢుడై వచ్చుట చూచి, భూమి మీద నున్న సకల గోత్రముల వారు రొమ్ము కొట్టుకొందురు. మరియు ఆయన గొప్ప బూర తో తన దూతలను పంపును. వారు ఆకాశము యొక్క ఈ చివరనుండి ఆ చివరవరకు నలుదిక్కులనుండి ఆయన ఏర్పరచుకొనిన వారిని పోగుచేతురు." మత్తయి 24:30-31.

"....ఆకాశ మేఘారూఢుడై మనుష్య కుమారుని పోలిన యొకడు వచ్చి, ఆ మహా వృద్ధుడగు వాని సన్నిధిని ప్రవేశించి, ఆయన సముఖ నకు తేబడెను. సకల జనులును రాష్ట్రములును ఆయా భాషలు మాట లాడు వారును ఆయనను సేవించునట్లు ప్రభుత్వమును మహిమయు ఆధి పత్యమును ఆయన కీయబడెను. ఆయన ప్రభుత్వము శాశ్వతమైనది అదెన్నటికిని తొలగిపోదు. ఆయన రాజ్యము ఎల్లప్పుడును లయము కాదు." (దానియేలు 7:13-14).

"ఆ దినమున యెరూషలేము ఎదుట తూర్పుతట్టున నున్న ఒలీవ కొండ మీద ఆయన పాదములుంచగా ఒలీవకొండ తూర్పు తట్టునకును పడమటి తట్టునకును సగముకొండ దక్షిణపు తట్టునకును జరుగును గనుక విశాల మైన లోయ యొకటి యేర్పడును." జెకర్యా 14:4.

ఇశ్రాయేలీయులు తాము చిరకాలము నుండి కనిపెట్టిన, ఇంత వరకు ఒప్పుకొనకుండిన, తెలియక సిలువవేసిన మెస్సీయాను పశ్చాత్తాప హృదయములతో ఒప్పుకొందురు. ఈ సమయమున తమ మెస్సీయాను అంగీకరించుటకై కొందరు ఇశ్రాయేలీయులు భూమిపై నిలిచియుందురు. "దావీదు సంతతివారి మీదను యెరూషలేము నివాసుల మీదను కరుణ నొందించు ఆత్మను విజ్ఞాపనచేయు ఆత్మను నేను కుమ్మరింపగా వారు తాము పొడిచిన నా (వాని-క్రీస్తు) మీద దృష్టియుంచి, యొకడు తన యేక కుమారుని విషయమై.... యొకడు ప్రలాపించునట్లు అతని విషయమై దుఃఖించుచు, ప్రలాపింతురు" .... ఆ దినమున పాపమును అపవిత్ర తను పరిహరించుటకై దావీదు సంతతివారి కొరకును, యెరూషలేము నివాసుల కొరకును ఊటయొకటి తియ్యబడును."(జెకర్యా 12:10, 41:1.)

# క్రీస్తుప్రభువు (రెండవమారు) భూమి పైకి దిగివచ్చుట దేనికొరకు ?

1. ఆయనను వెంబడించు వారందరును (నామకార్ధ క్రైస్తవులు మొ॥ వారు) పరలోక రాజ్యమునకు వారసులు కారు. ప్రభువు, లోకమందున్న వారిలో, విశ్వాసులను, అవిశ్వాసులను, గొల్లవాడు గొర్రెలను, మేకలను వేరుచేసినట్లుగా చేసి, తీర్పు తీర్చుటకు వచ్చును.

తన మహిమతో మనుష్య కుమారుడును ఆయనతో కూడ సమస్త దూతలును వచ్చునప్పుడు ఆయన తన మహిమగల సింహాసనము మీద ఆసీనుడై యుండును. అప్పుడు సమస్త జనములు ఆయన యెదుట పోగు చేయబడుదురు; గొల్లవాడు మేకలలో నుండి గొర్రెలను వేరు పరచునట్లు ఆయన వారిని వేరుపరచి తన కుడి వైపున గొర్రెలను ఎడమవైపున మేకలను నిలువబెట్టును. అప్పుడు రాజు తన కుడివైపున ఉన్నవారిని చూచి—నా తండ్రిచేత ఆశీర్వదింపబడినవారలారా, రండి, లోకము పుట్టినది మొదలుకొని మీ కొరకు సిద్ధపరచబడిన రాజ్యమును స్వతంత్రించుకొనుడి .... అప్పుడాయన (క్రీస్తు ప్రభువు) యెడమ వైపున ఉండువారిని చూచి - శపింపబడిన వారలారా, నన్ను విడిచి అపవాదికిని (సాతానుకును) వాని దూతలకును సిద్ధపరచబడిన నిత్యాగ్నిలోనికి పోవుడి .... వీరు (క్రీస్తు నంగీకరించనివారు) నిత్య శిక్షకును, నీతిమంతులు నిత్యజీవమునకు పోవుదురు." (మత్తయి 25:31-46.)

7 సం॥లు భయంకరమైన శ్రమలను అనుభవించి, తిరిగి నరకములోనికి పంపబడుట అనునది, ఊహించుటకే చాలా భయంకరముగా కాన్పించుచున్నది. ఇది ఘోరమైనదిగా, భయంకరమైనదిగా కాన్పించుచున్నను, ఇది సత్యమైనదిగా యుండి సంభవింపనై యున్నది. దేవుని సంకల్పము చొప్పున రక్షణ, క్రీస్తు ద్వార పొందుటకు నిరాకరించిన ప్రతి వారికిని ఈ తీర్పు సంభవించును.

యేసు క్రీస్తు, ఒక ప్రవక్త, మత గురువు, బోధకుడు మాత్రమే కాక, దేవుని కుమారుడె, ఆయన ద్వార ప్రపంచములోనివన్నియు సృజింప

బడెను. మరియు అవన్నియు ఆయన నిమిత్తమే సృజింపబడెను, (హెబ్రీ. 1:2, కొలొస్సయులకు 1:16 చదువుము). ఆయన ద్వారనే ప్రపంచమునకు తీర్పు తీర్చబడును. (అపొ. కార్య. 17:31.) ఆయన సదాకాలము ప్రభువును, దేవుడనై యున్నాడు.

2. క్రీస్తు తన నీతి రాజ్యమును భూమిపై స్థాపించి పాలించును. ఆదాము, హవ్వ ద్వార లోకము కోల్పోయిన స్వర్గ తుల్యమైన స్థితి, దాని దివ్యత్వము, క్రీస్తు ద్వారా తిరిగి నెలకొల్పబడును. యెరూషలేమును ఆయన తిరిగి నిర్మించి, దానిని తన ముఖ్యపట్టణముగా చేసికొని, శాంతి, ఆశీర్వాదమునకు నిలయమగు పట్టణముగా మార్చును. యెరూషలేములో ఆయన ఒక క్రొత్త దేవాలయ నిర్మాణమును ఆయన తన ఆధ్వర్యములో నిర్మించి, దానిలో పూర్వపు రీతిగా దేవునిని, జంతువుల బలులద్వార ఆరాధించకుండ, లోకమందలి సమస్త ప్రజలు ఆయనను ఆత్మతోనే ఆరాధించునట్లుగా చేయును.

ఈ విషయమే చాలామంది ప్రవక్తలు ప్రవచించిరి :

" ... యెహోవా తేజో మహిమతో మందిరము నిండియుండెను." యెహెజ్కేలు 43:5, 2,

"యెహోవా సర్వలోకమునకు రాజై యుండును, ఆ దినమున యెహోవా ఒక్కడే అనియు, ఆయనకు పేరు ఒక్కటే-అనియు తెలియబడును." "మరియు యెరూషలేము మీదికి వచ్చిన అన్యజనులలో శేషించిన వారందరును సైన్యములకు అధిపతియగు యెహోవా యను రాజునకు మ్రొక్కుటకును పర్ణశాల పండుగ ఆచరించుటకు ఏటేట వత్తురు. లోకమందుండు కుటుంబములలో సైన్యములకు అధిపతియగు యెహోవా యను రాజునకు మ్రొక్కుటకై యెరూషలేమునకు రాని వారందరి మీద వర్షము కురువకుండును." (జెకర్యా. 14:9, 16-17.)

"అంత్య దినములలో పర్వతములపైన యెహోవ మందిరము పర్వత శిఖరమున స్థిరపరచబడి కొండలకంటె ఎత్తుగా ఎత్తబడును. ప్రవాహము వచ్చినటు సమస అన్యజనులు దానిలోనికి వచ్చెదరు."

నా పరిశుద్ధ పర్వతమంతటను ఏ మృగమును హానిచేయదు, నాశనము చేయదు. సముద్రము జలముతో నిండియున్నట్లు లోకము యెహోవాను గూర్చిన జ్ఞానముతో నిండియుండును." (యెషయా 2:2-3; 11:9)

"ఆ కాలమున - యెహోవా యొక్క సింహాసనమని యెరూషలేమునకు పేరు పెట్టెదరు; జనములన్నియు తమ దుష్ట మనస్సులో పుట్టి మూర్ఖత్వము చొప్పున నడచుకొనక యెహోవా నామమును బట్టి యెరూషలేమునకు గుంపులుగా కూడివచ్చెదరు." (యిర్మీయా 3:17.)

మహా శ్రమలనుండి రక్షింపబడి, ఆయన రాజ్యములోనికి ప్రవేశింపబడినవారికి, ఈ సంగతులు సంతోషముతో ఒడలు జలదరింపబడు కథనముగా యుండును. దేవుడే అధిపతిగా యున్న ఈ ప్రభుత్వములో, సమస్త రంగములగు, వ్యవసాయ, విజ్ఞాన, సాంస్కృతిక, ఆర్థిక మొదలగు వాటియందు, కొద్దికాలములోనే లోకము అభివృద్ధిచెందును, ఇదే కాక, నేటి మానవుడు, తన అవిశ్వాసముతో సంభవముగా చేయలేకుండ యుండిరి. ఎన్నో సమస్యలను ఎదుర్కొనుచున్నట్లుగా ఆనాడు యుండదు.

శ్రమల రోజులలో హతసాక్షులుగా చేయబడినవారు, ఆయన రాజ్యమందు ప్రత్యేకమైన పనులను చేయవారుగా నియమింపబడెదరు.

"అంతట సింహాసనములను చూచితిని; వాటిమీద ఆసీనులై యుండు వారికి విమర్శ చేయుటకు అధికారము ఇయ్యబడెను. మరియు క్రూర మృగమునకైనను దాని ప్రతిమకైనను నమస్కారము చేయక, తమ నొసళ్ళయందు గాని చేతులయందు గాని దాని ముద్ర వేయించుకొనని వారిని, యేసు విషయమై తామిచ్చిన సాక్షము నిమిత్తమును దేవుని వాక్యము నిమిత్తమును శిరచ్ఛేదనము చేయబడిన వారి ఆత్మలను చూచితిని. వారు బ్రతికినవారై వెయ్యి సంవత్సరములు క్రీస్తుతో కూడ రాజ్యము చేసిరి. ఆ వెయ్యి సంవత్సరములు గడచువరకు కడమ మృతులు బ్రతుకలేదు; ఇదియే మొదటి పునరుత్థానము." (ప్రకటన 20:4-5)

ఇప్పుడు క్రీస్తు సంఘమందున్న విశ్వాసులు, ఆయన రాజ్యమందు, ఆయన ఉద్దేశములను నెరవేర్చుటకు, పరిపాలించుటకు, కీలకస్థానము లందు నియమించబడి, ధన్యకరమైన వారుగా యుండెదరు. వీరు ఆయన

సంఘమగు, తన పెండ్లి కుమార్తెకు సంబంధించినవారు. ఈ సంఘమే పరలోక యెరూషలేము అని పిలువబడును.

"అంతట ఆ కడపటి యేడు తెగుళ్ళతో నిండిన యేడు పాత్రలను పట్టుకొని యున్న యేడుగురు దేవ దూతలలో ఒకడు వచ్చి - ఇటు రమ్ము, పెండ్లి కుమార్తెను, అనగా గొఱ్ఱెపిల్ల యొక్క భార్యను నీకు చూపెదనని నాతో చెప్పి, ఆత్మ వశుడనై యున్న నన్ను యెత్తయిన గొప్ప పర్వతము మీదికి కొనిపోయి యెరూషలేము అను పరిశుద్ధ పట్టణము దేవుని మహిమగలదై పరలోకమందున్న దేవుని యొద్దనుండి దిగివచ్చుట నాకు చూపెను. దానియందు వెలుగు ధగధగ మెరయు సూర్యకాంతము వంటి అమూల్య రత్నమును పోలియున్నది." ప్రకటన 21:9-11.

క్రీస్తు తన రాజ్యమును స్థాపించి భూమిమీద వెయ్యేండ్ల (1000) వరకు పరిపాలన చేయును. తదుపరి, పాతభూమి, ఆకాశము తొలగించబడి వాని స్థానములననే నూతన భూమి, నూతన ఆకాశము దేవునిచేత సృజింపబడును. సాతాను నరకమందు బంధింపబడును. (ప్రకటన 21:1) పై సంఘటన పిమ్మట యేసుప్రభువు తీర్పు తీర్చుటకు, తెల్లని సింహాసనము వేయబడును. ఈ సమయమందు అవిశ్వాసులందరు తీర్పు తీర్చబడినవారై, నరకములోనికి త్రోయబడి, ఇచ్చట వారు నిత్యము (తమ దుష్ట తలంపుచే) కాల్చబడెదరు.

"మరియు ధవళమైన సింహాసనమును దానియందు ఆసీనుడై యున్న యొకనిని చూచితిని; భూమ్యాకాశములు ఆయన సముఖము నుండి పారిపోయెను; వాటికి నిలువచోటు కనబడకపోయెను. మరియు గొప్పవారేమి కొద్ది వారేమి మృతులైన వారందరు ఆ సింహాసనము యెదుట నిలువబడియుండుట చూచితిని. అప్పుడు గ్రంథములు విప్పబడెను; మరియు జీవగ్రంథమను వేరొక గ్రంథము విప్పబడెను; ఆ గ్రంథముల యందు వ్రాయబడి యున్నవాటిని బట్టి తమ క్రియల చొప్పున మృతులు తీర్పు పొందిరి. సముద్రము తనలోఉన్న మృతులను అప్పగించెను; మరణమును పాతాళ లోకమును వాటి వశమున నున్న మృతుల నప్పగించెను; వారిలో

ప్రతివాడు తన క్రియలచొప్పున తీర్పు పొందెను. మరణమును మృతుల లోకమును అగ్నిగుండములో పడవేయబడెను. ఈ అగ్నిగుండము రెండవ మరణము. ఎవని పేరైనను జీవగ్రంథమందు వ్రాయబడినట్టు కనబడని యెడల వాడు అగ్నిగుండములో పడవేయబడెను." ప్రకటన 20:11-15.
విశ్వాసులు - తమ పాపములనుండి క్షమింపబడి, దేవుని కృపద్వార రక్షణపొందిన వారు, నిత్యజీవమునకును, ఆయన నిత్యరాజ్యమునకును వారసులుగా చేయబడుదురు.

అయితే మహోన్నతుని పరిశుద్ధులే రాజ్యాధికారము నొందుదురు; వారు యుగయుగములు, యుగ యుగాంతముల వరకు రాజ్యమేలుదురు .... ఆకాశమంతటి క్రిందనున్న రాజ్యమును అధికారమును రాజ్యమహాత్మ్యమును మహోన్నతుని పరిశుద్ధులకు చెందును. ఆయన (క్రీస్తు రాజ్యము నిత్యము నిలుచును.) అధికారులందరును దానికి విధేయులగుదురు. (దానియేలు 7:18, 27.)

ఈ విధముగ ప్రవచనములందు తెల్పబడిన రీతిగా, అవిశ్వాసులు నిత్య నాశనమును, విశ్వాసులు నిత్యజీవమును పొందెదరు. దేవుడు మనముందు ఈ రెండు మార్గములను పెట్టియున్నాడు. వీనిలో మనకు ఇష్టమైనదానిని ఏర్పర్చుకొనుటకు స్వతంత్రమును కూడ ఇచ్చియున్నాడు.

యెహోవా సెలవిచ్చునదేమనగా - జీవ మార్గమును మరణ మార్గమును నేను మీ యెదుట పెట్టుచున్నాను. (యిర్మీయా 21:8)

# మెస్సీయాను గూర్చిన ప్రవచనములు

రాబోయే అధ్యాయములలో కొన్ని పాత, క్రొత్త నిబంధనలలో తెల్పబడిన బైబిలు ప్రవచనములు మరియు క్రీస్తు రెండవ రాకడను గూర్చి తెల్పబడిన 300 ప్రవచనములు కలవు.

పాత నిబంధనలో ఆయన మొదట రాకడను గూర్చి తెల్పబడి 200 ప్రవచనములు నెరవేర్చబడినట్లుగానే ఆయన రెండవ రాకడను గూర్చిన ప్రవచనములను నెరవేరబడును.

నజరేతు వాడగు యేసును గూర్చిన ప్రవచనములు, ఆయన మొదటి రాకడలో అక్షరాల ఆయన యందు ఎలాగు నెరవేరబడునో తెల్పుటకు క్రింద ఇరవై ప్రవచనములను వివరించుచున్నాను.

బాక్సులో ఉన్నవి ప్రవచనములు, బాక్సులో లేనివి నెరవేర్పులు.

కాబట్టి ప్రభువు తానేయొక సూచన మీకు చూపును. ఆలకించుడి, కన్యక గర్భవతియై కుమారుని కని అతనికి ఇమ్మానుయేలని పేరు పెట్టును. యెషయా 7:14.

క్రీ. పూ. 742.

యేసు క్రీస్తు జనన విధమెట్లనగా ఆయన తల్లియైన మరియ యోసేపునకు ప్రధానము చేయబడిన తరువాత వారేకము కాక మునుపు ఆమె పరిశుద్ధాత్మ వలన గర్భవతిగా ఉండెను ... ఆమె ఒక కుమారుని కని ఆయనకు యేసు అని పేరు పెట్టెను. (తన ప్రజలను వారి పాపములనుండి ఆయనే రక్షించును గనుక ఆయనకు యేసు అని పేరు) మత్తయి 1:18-25, లూకా 1:26-38, 2:21.

బేత్లెహేమా ఎఫ్రాతా, యూదా వారి కుటుంబములలో నీవు స్వల్ప గ్రామమైనను నా కొరకు ఇశ్రాయేలీయులను ఏలబోవు వాడు నీలో నుండి వచ్చును; పురాతన కాలము మొదలుకొని శాశ్వత కాలము ఆయన ప్రత్యక్ష మగుచుండెను. మీకా 5:2. క్రీ.పూ.

ప్రజాసంఖ్య వ్రాయవలెనని కైసరు ఔగుస్తు వలన ఆజ్ఞ ఆయెను కనుక మరియ తన భర్తయగు యోసేపుతో బేత్లెహేమనబడిన ఊరికి వెళ్ళెను. అచ్చట నున్నప్పుడే, శిశువగు యేసు జన్మించెను. లూకా 2:1-7 చదువుము.

యెహోవా ఈలాగు సెలవిచ్చు చున్నాడు. ఆలకించుడి, రామాలో అంగలార్పును మహారోధన ధ్వనియు వినబడుచున్నది; రాహేలు తన పిల్లలను గూర్చి యేడ్చుచున్నది; ఆమె పిల్లలు లేకపోయినందున ఆమె వారిని గూర్చి ఓదార్పు పొంద నొల్లకున్నది. యిర్మియా 31:15 క్రీ.పూ. 58 సం॥

హేరోదు రాజు శిశువగు మెస్సీయాను చంపుటకై, బేత్లెహేము లోను దాని సకల ప్రాంతముల లోను రెండు సంవత్సరములు మొదలుకొని తక్కువ వయస్సు గల మగపిల్లలనందరిని వధించెను. మత్తయి 2:16_18. చదువుము.

ఇశ్రాయేలు బాలుడై యుండగా నేను అతనియెడల ప్రేమకలిగి నా కుమారుని ఐగుప్తులో నుండి పిలిచితిని, హోషేయ 11:1, క్రీ. పూ. 750.

హేరోదు శిశువును సంహరింపవలెనని ఉద్దేశించినట్లుగా ప్రభువు దూత ద్వారా హెచ్చరింపబడుటచే యోసేపు మరియను, శిశువగు యేసును తీసికొని ఐగుప్తుకు వెళ్ళి దేవుడు తిరిగి పిలుచువరకు అచ్చటనే యుండెను. మత్తయి 2:14_23 క్రీ. శ. 1.

యేసు ప్రభువు చాలవరకు గలిలయలో నివాసముండెను. మత్తయి 4:12_16, క్రీ. శ. 26:30.

.... అంత్య కాలమున ఆయన సముద్ర ప్రాంతమును, అనగా యొర్దాను అద్దరిని అన్యజనుల గలిలయ ప్రదేశమును మహిమగల దానిగా చేయుచున్నాడు. యెషయా 9:1_2 క్రీ. పూ. 742.

మోషే - నీ దేవుడైన యెహోవా నీ మధ్యను నా వంటి ప్రవక్తను నీ సహోదరులలో నీ కొరకు పుట్టించును. ఆయన మాట నీవు వినవలెను. ద్వితీ. కాండము 18:16. క్రీ. పూ. 1600.

మోషే పలికిన విధముగా, క్రీస్తు ప్రభుని ఇశ్రాయేలీయులు ప్రవక్తగా గుర్తించిరి. యోహాను 1:45, 6:14. చదువుము.

యేసు దేవాలయములో ఎడ్లను గొఱ్ఱెలను పావురములను అమ్ము వారలను, రూకలు మార్చువారిని, నాతండ్రి ఇల్లు వ్యాపారపు ఇల్లుగా చేయకుడని చెప్పి తోలివేసెను. యోహాను 2:13-17.

నీ యింటిని గూర్చిన ఆసక్తి నన్ను భక్షించియున్నది. నిన్ను నిందించినవారి నిందలు నా మీద పడినవి. కీర్తనలు 69:9 క్రీ. పూ. 1020 సం॥

సీయోను నివాసులారా, బహుగా సంతోషించుడి, యెరూషలేము నివాసులారా, ఉల్లాసముగా ఉండుడి; నీ రాజు నీతి పరుడును రక్షణ గలవాడును దీనుడునై, గాడిదను గాడిద పిల్లను ఎక్కి నీ యొద్దకు వచ్చుచున్నాడు. జెకర్యా 9:9 క్రీ. పూ. 520

ఈ ప్రవచనము క్రీ. శ. 30 సం॥ ములప్పుడు ఒలీవ కొండనుండి యెరూషలేముకు క్రీస్తు గాడిదపై వెళ్ళుటద్వార అక్షరాల నెరవేరెను. మత్తయి 21:1-11.

యేసు శిష్యుడగు యూదా ఇస్కరియోతు ద్రోహముతో ప్రభువును అప్పగించెను. మత్తయి 26:47-50.

నేను నమ్ముకొనిన నా విహితుడు నా యింట భోజనము చేసినవాడు నన్ను తన్నుటకై తన మడిమ నెత్తెను. కీర్తనలు 41:9 క్రీ. పూ 1020.

వారు నా కూలికై ముప్పది తులముల వెండిని తూచి యిచ్చిరి. జెకర్యా 11:12 క్రీ.పూ. 487.

యూదా ఇస్కరియోతు ద్రోహముతో క్రీస్తును అప్పగించుటకు ముప్పై వెండి నాణెములను పొందెను. మత్తయి 26:15.

యేసు, ప్రధాన యాజకుల ద్వార పిలాతు నొద్దకు తీర్పుకొరకు తేబడగా ఒక్క మాట యైనను పలుకక మౌనియై యుండెను.
మత్తయి 27:12_14.

అతడు దౌర్జన్యము నొందెను. బాధింపబడినను అతడు నోరు తెరువలేదు. యెషయా 53:7 క్రీ. పూ. 700.

.... వారు నా చేతులను నా పాదములను పొడిచి యున్నారు.
కీర్తనలు 22:16.

యేసు ప్రభువు తన అరచేతుల యందు పాదములయందు మేకులతో సిలువ వేయబడెను. క్రీ.శ. 30 యోహాను 19;18, 20:27.

క్రీస్తు సిలువ వేయబడిన పిమ్మట యూదులు ఆయనను చూచి తల లూపుచు హేళనచేసి, దూషించిరి. మత్తయి 27:39_44 క్రీ. శ. 30.

వారి నిందలకు నేను ఆస్పదుడనైతిని. వారు నన్నుచూచి తమ తలలు ఊచెదరు. కీర్తనలు 109:25 క్రీ. పూ. 1020.

వారు చేదును నాకు ఆహారముగా పెట్టిరి, నాకు దప్పియైనప్పుడు చిరకను త్రాగనిచ్చిరి. కీర్తనలు 69:21,

వారు ఒక స్పంజీ చిరకతో నింపి హిస్సోపు పుడకకు తగిలించి ప్రభువు నోటికి ఆయన సిలువపై నుండగా ఇచ్చిరి _ యోహాను 19:29 చదువుము.

సైనికులు యేసును సిలువ వేసిన తరువాత ఆయన వస్త్రములను భాగములుగా చేసి పంచుకొనిరి. ఆయన అంగీ కొరకు చీట్లు వేసిరి. ఇది ప్రవచన నెరవేర్పు కొరకే ఈలాగు జరిగెను. యోహాను 19:23_24.

నా వస్త్రములు వారు పంచుకొనుచున్నారు. నా అంగీ కొరకు చీట్లు వేయుచున్నారు.
దావీదు___కీర్తనలు 22:18.

వారు తాము పొడిచిన నా మీద దృష్టి యుంచెదరు. జెకర్యా. 12:10 క్రీ. పూ. 487.

ఆయన వాని యెముకలన్నిటిని కాపాడును. వాటిలో ఒకటియైనను విరిగిపోదు. కీర్తనలు 34:20.

ప్రభువు దొంగలతో సిలువ వేయబడినప్పటికి, ఆయన దేహము అరిమతయియ యోసేపు అను ధనవంతుని సమాధిలో యుంచబడెను. మత్తయి 27:57_61.

నీవు నా ఆత్మను పాతాళములో విడిచిపెట్టవు. నీ పరిశుద్ధుని కుళ్లపట్టనియ్యవు—కీర్తనలు 16:10.

పునరుత్థానము నొందిన నలుబది దినముల తరువాత యేసు ప్రభువు ఆరోహణమయ్యెను. ఈ సంఘటనను ఆయన శిష్యులు కన్నులారా చూచిరి. అపొ. కార్య. 1:6_11.

యేసు మృతినొందిన తరువాత సైనికులలో ఒకడు ఈటెతో ఆయన ప్రక్కను పొడిచెను. యోహాను 19:33_34.

సాధారణముగా సిలువ వేయబడిన వారి పాదములను విరుగగొట్టుట ద్వారా త్వరగా చనిపోవునట్లుగా చేయుదురు. కాని క్రీస్తుకు ఆలాగున జరుగలేదు. యోహాను 19:37_37. చదువుము.

అతడు మరణమైనప్పుడు భక్తిహీనులతో అతనికి సమాధి నియమింపబడెను. ధనవంతుని యొద్ద అతడు ఉంచబడెను. యెషయా 53:9. క్రీ. పూ. 700

యేసు ప్రభువు దేహము సమాధిలో భద్రపర్చబడిన మూడవ రోజున ఆయన తిరిగి సజీవుడై లేచెను. ఆయన పునరుత్థానము నొందిన తరువాత 500 మందికి తన్ను తాను సజీవునిగా కనుపర్చుకొనెను. మత్తయి 28 అధ్యాయము, 1 కొరింథీ. 15.6 చదువుము.

నీవు ఆరోహణమైతివి పట్టబడిన వారిని చెరపట్టుకొని పోతివి. కీర్తనలు 68:18.

> మనుష్య కుమారుడు మనుష్యుల చేతికిఅప్పగింపబడబోవుచున్నాడు. వారాయనను చంపుదురు; మూడవ దినమున ఆయన లేచును.—మత్తయి 17:22-23.

ఈ మూడు సత్యములు, ప్రవచింపబడిన కొన్ని నెలల తరువాత అక్షరాల నెరవేరెను. మత్తయి 26, 27 అధ్యాయములు చదువుము.

వివరింపబడిన ఈ కొన్ని ప్రవచనముల ద్వార, నజరేయుడగు యేసు, వేరొకడు కాక, ప్రవక్తలు ఎవరి విషయమై ప్రవచించిరో ఆతడేనని తేటపర్చబడినది. చదువుచున్న ప్రతి చదువరికి, ఈయనను స్వయముగా తెలిసికొనుటకై నేను పరిచయము చేసెదను. యేసుకన్న మించిన స్నేహితుడు నాకు లేదు. ఈయన నా రక్షకుడును, ప్రభువును, దేవుడునై యున్నాడు. ఈయన నాకు సమస్తములో సమస్తముగా యున్నాడు. ఆలాగే నీవు ఆయనను విశ్వసించిన నీకును కాగలడు!

# నీ తీర్మానమే నిన్ను నిత్యనాశనమునకు లేక నిత్యజీవమునకు నడుపును



> “అప్పుడు యెహోవా—నా ఆత్మ నరులతో ఎల్లప్పుడు వాదించదు. వారు తమ అక్రమ విషయములో నరమాత్రులై యున్నారు.” ఆదికాండము 6:3.

లోకాంతము సమీపించుచుండగా, రెండు గొప్పశక్తులు మనుష్యుల మనస్సులను స్వాధీన పర్చుకొనుటకు ప్రయత్నించుచున్నట్లుగా మనము గుర్తించగలము.



ఒకవైపు సాతాను తన దుష్టశక్తి ద్వారా, మనుష్యులను తప్పుత్రోవన నడిపించుటకు చూచుచున్నది. సాతాను ఊహా (Myth) సంబంధమైనవాడు కాక నిజముగా యున్నవాడై (existing) యున్నాడు. సాతాను, మనుష్యులను, దేవుని రక్షణ సంకల్పము ద్వార, రక్షింపబడకుండ ఎన్నో ప్రయత్నముల ద్వార భంగపర్చుటకు చూస్తున్నాడు. తాను, నిత్య నాశనమునకు పోయేవాడని, సాతానుకు తెలియును. అయితే దేవుని మీద పగ తీర్చుకొనుటకు గాను, తాను నిత్యనాశనమునకు పోవుచు, తనతో కూడ సాధ్యమైనంతమంది మనుష్యులను తనతో నాశనమునకు తీసికొని వెళ్ళుటకు ప్రయత్నించుచున్నాడు.

రెండవవైపు, దేవుడు, తాను క్రీస్తుద్వారా ఏర్పర్చిన కృపా రక్షణ సంకల్పమును చూస్తున్నాము. దేవుడు దీనిద్వార, మనుష్యులు నాశనమునకు పోకుండ కాపాడబడుటకు ఏర్పర్చెను.

ఆత్మల రక్షణ లేక నాశనము, ఏ శక్తిపై ఆధారపడి లేవు. దేవుడు సర్వ శక్తిమంతుడు, సాతాను కూడ తన ద్వారానే సృజింపబడినవాడు. దేవుడు సాతానును, దుష్ట శక్తిగా సృజించలేదు, కాని గర్వాంధుడైన దూత, దేవునిపై తన్ను తాను హెచ్చించుకొనుట ద్వార, దేవుడు, వానిని క్రింద పడద్రోసెను. ఆ నాటినుండి వాడు సాతాను అనే నామముతో దేవుని కార్యములను చెరుపుటకై నిశ్చయించుకొన్నాడు. కాని సర్వశక్తుడగు దేవునిని ఎదిరించుటకు వానికి శక్తి లేదు. ఎల్లప్పుడును, వానికి దేవుని బిడ్డలచేతిలో, అపజయమే కలుగును.

దేవునికి, సాతానుకు సంబంధించిన మంచి చెడులను గూర్చి లేక సత్యా అసత్యములను గూర్చి, మనుష్యుల హృదయములలో, మనస్సులలో తీరని పోరాటము, సంచలమును కలుగును. దేవుడు మనుష్యునికి మంచి చెడులను వివేచించే మనస్సులను మరియు వానిని నిర్ణయించుకొనే స్వతంత్రిమును ఇచ్చియున్నాడు. దేవుడు యేసు క్రీస్తు ద్వార ఏర్పర్చిన *రక్షణా సంకల్పమును, మనుష్యుడు స్వీకరించుటకు లేక సహకరించుటకు ప్రతివానికిని స్వతంత్రము కూడ దయచేసినాడు.* కావున యేసు క్రీస్తును తమ స్వంత రక్షకునిగా, అంగీకరిచుటకు, ఆయన ద్వార (ఆత్మీయముగా) జీవించుటకు దేవుడు ఎవరిని బలవంతము చేయడు.

ప్రతివాడును, దేవుడు, క్రీస్తు ద్వార సిద్ధపరచబడిన, రక్షణ సంకల్పమును నిరాకరించుటకును స్వీకరించుటకును స్వతంత్రము కలిగినవాడై యున్నాడు —నిరాకరించువాడు తన స్వనాశనమును కోరుకొనువాడై యున్నను, ఈలాగు చేయుటకును స్వతంత్రుడై యున్నాడు. కావున, ఒకని నిర్ణయమును బట్టియే, వాడు తన నాశనమునకు పోవు మార్గమును లేక నిత్యజీవమునకు వెడలు మార్గమును స్వయముగా నిర్ణయించుకొని బాధ్యుడగుచున్నాడు.

దేవుడు మనుష్యులతో ఈలాగు చెప్పుచున్నాడు — "నా జీవముతోడు దుర్మార్గుడు మరణము నొందుటవలన నాకు సంతోషము లేదు; దుర్మార్గుడు తన దుర్మార్గత నుండి మరలి బ్రతుకుట వలన నాకు సంతోషము కలుగును." (యెహెజ్కేలు 33:11).

దేవుడు రాబోయే సంగతులను బైబిలులో ఎందుకు వివరించినాడంటే, లోకమునకు దేవునిద్వార రాబోయే తీర్పు రోజుల ఉగ్రత దినములనుండి మనుష్యుడు రక్షింపబడి, రక్షణకొరకు తరుణమున్నప్పుడే రక్షింపబడునట్లుగా దేవుడు వీలు కలుగచేసెను.

"యెహోవా (దేవుడు) మీకు దొరుకు కాలమునందు ఆయనను వెదకుడి ఆయన సమీపములో ఉండగా ఆయనను వేడుకొనుడి. భక్తిహీనులు తమ మార్గమును మానవలెను. వారు యెహోవావైపు తిరిగిన యెడల ఆయన వారియందు జాలిపడును. వారు మన దేవునివైపు తిరిగినయెడల ఆయన బహుగా క్షమించును." యెషయా 55:6-7.

లోకమందలి మనుష్యుల చెడుతనము, అవినీతి, దుర్నీతి, పాపస్థితి, ఆధునిక నాగరికత మొ॥ హేయ కార్యములు హెచ్చై, దేవుని తీర్పుకొరకు లోకము భద్రపర్చబడియున్నది. దేవుని ఆత్మ నరులతో ఎల్లప్పుడు వ్యాజ్యమాడ నేరదు. కావున వీరికి తీర్పు తీర్చబోవుచున్నాడు. అయితే, వెంటనే లోకమునకు ఎందుకు తీర్పు తీర్చుటలేదంటే—

"కొందరు ఆలస్యమని యెంచుకొనునట్లు ప్రభువు తన వాగ్దానమును గూర్చి ఆలస్యము చేయువాడు కాడు. గాని యెవడును నశింపవలెనని యిచ్ఛయింపక అందరు మారుమనస్సు పొందవలెనని కోరుచు, మీ యెడల దీర్ఘశాంతము గలవాడై యున్నాడు. అయితే ప్రభువు దినము

దొంగ వచ్చినట్లుగా వచ్చును. ఆ దినమున ఆకాశములు మహా ధ్వనితో గతించిపోవును. పంచభూతములు మిక్కుటమైన వేంద్రముతో లయమై పోవును. భూమియు, దాని మీద నున్న కృత్యములును కాలిపోవును." (2 పేతురు 3:9-10.)

ఈ అంతిమ రోజులలో, దేవుడు విశ్వాసులను, తన శరీరమగు - క్రీస్తు సంఘములోనికి చేర్చుకొనుచున్నాడు. కొన్ని రోజుల పిమ్మట *క్రీస్తు సంఘమందు తిరిగి చేర్చుకొనుటకు స్థలము లేకుండ యుండ, రక్షణ పొందుటకు తిరిగి తరుణము దొరుకదు.*

క్రీస్తు సంఘ సమకూర్పు పూర్తి అగుట తోడనే, విశ్వాసుల కూర్పుతో నిండిన ఈ సంఘము, ప్రభుని కలుసుకొనుటకై పై కెత్తబడును (Raptured). పిదప భూమి పై నిలిచినవారి కొరకై భద్రపరచిన శ్రమల రోజులు ఆరంభమగును.

ప్రియచదువరీ! నీవు ఆయన (క్రీస్తు)ద్వార ఏర్పర్చిన రక్షణ సంకల్పము అంగీకరించుట ద్వార, ఆయన సంఘమందలి విశ్వాసులతో చేరి క్రీస్తును కలిసికొనుటకు పై కెత్తబడెదవో, లేక ఆయన రక్షణను నిర్లక్ష్యము చేసి నిత్య నాశనమునకు వెళ్ళెదవో *నేడే నిశ్చయించుకొనుము.*

"ఇదిగో ఇప్పుడే మిక్కిలి అనుకూలమైన సమయము, ఇదిగో ఇదే రక్షణ దినము" 2 కొరింథీ. 6:2.

దేవుడు నీ రక్షణకొరకై పోరాడుచున్నట్లు, ఇప్పుడు నీ హృదయమందు గ్రహించుట లేదా? నీ పాపముల భారము ద్వార నీవు క్రుంగియున్నావని నీకు తెలియును. వాటినుండి నీవు క్షమించబడి, విముక్తి నొందవలెనని కూడ నీకు తెలియును. ఈ సంగతి, రేపు ఆలోచించవచ్చునని నీవు వాయిదా ఇప్పుడు వేయవచ్చును. కాని రేపు ఏమి జరుగునో నీకు తెలియదు. నీవు ఈలాగే నీ పాపస్థితిలో యున్న, నీవు మరణించిన తరువాత నరకములోనికి త్రోయబడెదవేమో! లేక వేదనకరమైన శ్రమల రోజులను అనుభవించుటకు లోకమందు మిగల్చబడెదవో! ఆలోచించుకొనుము.

ఇప్పటికిని, నీవు రక్షణ పొందుటకు ఆలస్యము చేస్తూ నీ భవిష్యత్తు విషయము నిర్ణయించుకొనుటకు తీర్మానము చేయక అలక్ష్యము

చేస్తున్నావు. ఈ విషయమందు నీవు తక్షణమే ఒక నిర్ణయమునకు రావలెను, ఇంకా సమయమున్నది, తరువాత చూడవచ్చును అని వాయిదా వేయుచు, కాలయాపనము చేయుటకు వీలులేదు. నీ పాపముతో నీవు మనశ్శాంతి లేకుండ యుండుటకంటె, ఆయన ద్వార రక్షణ పొంది శాంతిని పొందుట శ్రేయస్కరము. నీలో నున్న పాపము లేక, నీవు పూజించు విగ్రహము లేక నీ అలవాటు లేక మరే రకమైన ఆచారము, వ్యాపారము నీ నాశనమునకే దారి తీయును. నీలో నున్న నీ పాపపు స్థితి, నిన్ను నిత్య నాశనమునకు నడుపునని, *నీ మనస్సాక్షి కూడ ఇప్పుడు గద్దించుచున్నది.* కావున *రక్షణ విషయమై వాయిదా వేయకుము.* ఇప్పటికిని, నీవు రక్షణ నొందు విషయములో తీర్మానము చేయుటకు ఇంకా సమయము కలదు కనుక నీ చేతిలో నున్న పనిని మొదట చేయవలెనని నీకు యుండవచ్చును. కాని కాలయాపనచేయుట నీకే ముప్పు. *నీవు నిప్పుతో చెలగాటము ఆడినవాడవగుదువు*-నిప్పుతో ఆడి కాల్చుకొనకుండిన వాడెవడు? నీవు ఈ విషయములో త్వరపడి రక్షణ విషయమై తీర్మానము చేసికొనకున్న; వెంటనే లేక తరువాత క్రీస్తు ఆయన ధవళ సింహాసనముపై కూర్చుండి తీర్పు తీర్చునాడు నీ పాపమే నిన్ను పట్టుకొనును.

నీవు రక్షణ పొందినయెడల, క్రీస్తు ధవళ సింహాసనము ఎదుట దోషిగా నిలుచుండే అవసరము రాదు. మరియు లోకము మీదికి రాబొయ్యేది మిక్కిలి వేదనకరములగు శ్రమ రోజులలో నీవు లోకమందు వీనిని అనుభవించుటను మిగల్చబడవు. నీవు రక్షణ పొందుట ఎట్లు? — దేవుడు సంకల్పించిన రక్షకుని ద్వారనే రక్షణ నొందగలవు. ఈ క్రింది దేవుని వాగ్దానములు కలవు, మరియు వానిని నీవు హృదయ పూర్వకముగా విశ్వసించుట ద్వార రక్షణ నొందెదవు.

1. మన పాపములను మనము ఒప్పుకొనిన యెడల ఆయన నమ్మదగినవాడును నీతిమంతుడును గనుక ఆయన మనపాపములను క్షమించి సమస్త దుర్నీతినుండి మనలను పవిత్రులనుగా చేయును. 1యోహాను 1:9.

కావున మన పాపములను మనము దేవునిఎదుట ఒప్పుకొనినయెడల ఆయన లోకాధికారివలె క్షమించక యుండడు. ఎందుకనగా, క్రీస్తు నీ పాపముల

కొరకు చనిపోయి ప్రాయశ్చిత్త బలిగా ఆయెను. కావున, దేవునితో ఈ సత్యమునే నీవు ఒప్పుకొనిన, దీని ఆధారముగా నిన్ను క్షమించును. ఏలయనగా — "మనుష్యులొక్కసారే మృతి పొందవలెనని నియమింపబడెను. ఆ తరువాత తీర్పు జరుగును. అలాగుననే క్రీస్తు కూడ అనేకుల పాపములను భరించుటకు ఒక్కసారే అర్పింపబడి, తన కొరకు కనిపెట్టుకొని యుండు వారి రక్షణ నిమిత్తము పాపము లేకుండ రెండవ సారి ప్రత్యక్షమగును" హెబ్రీయులకు 9:27-28.

---

2. "తన్ను ఎందరంగీకరించిరో వారికందరికి, అనగా తన నామమునందు విశ్వాసముంచిన వారికి దేవుని పిల్లలగుటకు ఆయన అధికారము అనుగ్రహించెను." యోహాను 1:12.

---

దేవుడు నిన్ను తన స్వంత కుమారుని/కుమార్తెగా స్వీకరించి, తన కుటుంబములోనికి చేర్చుకొని, తన ఇంటిలోని భాగ్యములన్నియు ఇవ్వ గోరుచున్నాడు. ఇంతేకాక దేవుని నుండి నీవు శాంతి, ఆనందము పొందగలవు.

---

3 "దేవుడు లోకమును ఎంతో ప్రేమించెను. కాగా ఆయన తన అద్వితీయ కుమారునిగాపుట్టినవానియందు(క్రీస్తునందు)విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్యజీవము పొందునట్లు ఆయనను అనుగ్రహించెను". యోహాను 3:16.

---

దేవుడు నీ రక్షణ విషయమై అభయమిచ్చుచున్నాడు. ఎలాగనగా, నీ రక్షణ కొరకు, తన కుమారుని ఘోర సిలువ శ్రమలను భరించుటకు ఇవ్వగా, నీవు, క్రీస్తు నీ పాపముల కొరకే మరణించినాడని నీ హృదయమందు విశ్వసించిన, నిన్ను త్రోసివేయక నీ పాపములనుండి రక్షించును.

---

4. "....యేసు ప్రభువని నీ నోటితో ఒప్పుకొని, దేవుడు మృతులలో నుండి ఆయనను లేపెనని నీ హృదయమందు విశ్వసించిన యెడల నీవు రక్షింపబడుదువు." రోమా 10:9

---

ఈ విషయము వాక్యము తేటగా, నమ్మకముగా తెల్పుచున్నది. చిన్నవారు సహితము ఈ సత్యమును గ్రహింప గలరు. అయినను చాలా మంది తమ క్రియల ద్వార, మంచి కార్యముల ద్వార, స్వనీతి

ద్వార రక్షణ పొందుటకు తలంచుచు లేక పాటుపడుచు, తొట్రుపడుచున్నారు.

"మీరు విశ్వాసము ద్వార కృపచేతన రక్షింపబడి యున్నారు. ఇది మీ వలన కలిగినది కాదు. దేవుని వరమే (gift of God) అది (రక్షణ) క్రియలవలన కలిగినది కాదు. గనుక ఎవడును అతిశయపడ వీలులేదు" ఎఫెస్సీయులకు 2:8–9.

"మనము నీతిని అనుసరించి చేసిన క్రియల మూలముగా కాక, తన కనికరము చొప్పుననే పునర్జన్మ సంబంధమైన స్నానము ద్వారాను, పరిశుద్ధాత్మ మనకు నూతన స్వభావము కలుగజేయుట ద్వారాను మనలను రక్షించెను." తీతు 3:5.

"మేమందరము అపవిత్రులవంటి వారమైతిమి మా నీతి క్రియలన్నియు మురికి గుడ్డవలె నాయెను." యెషయా 64:6.

ఈ విషయములో యేసు ప్రభువు ఈలాగు చెప్పుచున్నాడు—"తండ్రి నాకు అనుగ్రహించు వారందరును నా యొద్దకు వత్తురు. నా యొద్దకు వచ్చు వానిని నే నెంత మాత్రమును బయటికి త్రోసివేయను ... విశ్వసించు వాడే నిత్యజీవము గలవాడు." యోహాను 6:37, 47.

నీవు రక్షణ పొందుటకు :

1. నీవు పాపివని ఒప్పుకొని దేవునిని నీ పాపములను క్షమించునట్లుగా ప్రార్థించుము.

2. నీ హృదయమందు యేసు క్రీస్తు దేవుని కుమారుడని, ఆయన నీ పాపముల కొరకు లోకమునకు వచ్చి సిలువ శ్రమలు పొంది తిరిగి లేచుట ద్వార (పునరుత్థానము నొందుట ద్వార) నీ రక్షకుడయ్యెనని విశ్వసించవలెను.

3. నీ జీవితమునకు క్రీస్తును ప్రభువుగా, దేవునిగా, రక్షకునిగా స్వీకరించి, నీ జీవితమును ఆయన ఇష్ట ప్రకారము నడుచుటకు నిన్ను నీవు ఆయనకు లోబర్చుకొని, అప్పగించుకొనుము. (surrender)

# క్రీస్తు కొరకు నా నిర్ణయము

ఓ దేవా! నీవు వాగ్దానము చేసిన రీతిగా, నీవు నా పాపములను క్షమించెదవని నీ యొద్దకు వచ్చితిని. కావున పాపినైన నన్ను, నా పాపములను క్షమించుము. (ఇప్పుడు నీ మనస్సులో నున్న పాపములను ఆయన సముఖములో బాహాటముగా తెల్పి, ఒప్పుకొనుము) నీ కుమారుడగు ప్రభువైన క్రీస్తు నాపాపముల కొరకు సిలువ శ్రమలొంది ప్రాయశ్చిత్త బలిగా అయ్యేనని విశ్వసించుచున్నాను. మరియు ఆయన జీవముగల నా రక్షకునిగా అగుటకు తిరిగి లేచినాడని కూడ విశ్వసించుచున్నాను. కావున ఆయనను నా ప్రభువుగా విశ్వసించి, నా మిగతా జీవితములో ఆయన అడుగు జాడలలో వెంబడించుటకు నిర్ణయించుకొన్నాను.

ప్రభువైన యేసూ, నీవు నా హృదయ స్థితిని గ్రహించిన వాడవు. నీవు నేడే నా హృదయములోనికి ప్రవేశించి, నాలో నీవుండి, నేను నీ శిష్యునిగా నగునట్లుగా మార్చి, పరిశుద్ధ జీవితమును నేను జీవించుటకు రమ్ము. నీవు ఈలాగున నా హృదయములో ప్రవేశించినందుకు నీకు వందనములు. ఆమేన్.

సంతకము ........................ తేది ..............

---

నీవు ఈ తీర్మానమును ఈ రోజు చేసినయెడల, నీ సంతోషములో నేను కూడ పాలు పొందుటకు నాకు వెంటనే ఈ క్రింది విలాసమునకు వ్రాయగలవు.

ఇంగ్లీషు వచ్చువారు :

సహో. డాన్ ఇ. స్టాన్టన్, క్లఫ్రెండ్ పబ్లికేషన్స్, సిమ్లా–1, హిమాచల్ ప్రదేశ్.

**Bro. Don E. Stanton,**
Claffind Publications.
SIMLA-1, H. P.

తెలుగు వచ్చువారు :

సహో. కె. థామస్ యన్. రెడ్డి, బంగ్లా నెం. 17, సన్నత్‌నగర్, హైద్రాబాదు–500018.

**Bro. K. Thomas N. Reddy,**
Bunglow No. 17,
Sanathnagar,
Hyderabad-500018.

# విశ్వాసీ, సిద్ధముగా యుండుము!

> "మీరనుకొనని గడియలో మనుష్యకుమారుడు వచ్చును గనుకయే మీరు సిద్ధముగా ఉండుడి" మత్తయి 24:44.

బైబిలునందు, ప్రభురాకడ కొరకై ఎదురు చూచుచు, సిద్ధపడి యుండవలెనని పలుమారు, విశ్వాసి (Believer in christ) వాక్యముద్వార హెచ్చరింపబడి యున్నాడు. క్రీస్తు రాకడ, విశ్వాసికి గొప్ప నిరీక్షణయై యున్నది. ఈ నిరీక్షణ, ప్రతివాడు తన్ను పవిత్రపర్చుకొనుటకును ఆస్పదముగా యున్నది.

ఈ విషయమందు అపొ. యోహాను కూడ చెప్పుచున్నాడు — "ఆయనయందు ఈ నిరీక్షణ (ప్రభు రెండవ రాకడ విషయమై) పెట్టుకొనిన ప్రతివాడును ఆయన పవిత్రుడై యున్నట్లుగా తన్ను పవిత్రునిగా చేసికొనును. 1 యోహాను 3:3

అపొస్తలుడైన పేతురు కూడ ఆ సమయముకొరకు మనము ఎలాగుండవలెనో చెప్పెను. — "కొందరు ఆలస్యమని యెంచుకొనునట్లు ప్రభువు తన వాగ్దానమును గూర్చి ఆలస్యము చేయువాడు కాడు గాని యెవడును నశింపవలెనని యిచ్ఛయింపక, అందరు మారుమనస్సు పొందవలెనని కోరుచు, మీ యెడల దీర్ఘ శాంతము గలవాడై యున్నాడు. అయితే ప్రభువు దినము దొంగ వచ్చినట్లు వచ్చును ... దేవుని దినపు రాకడ కొరకు కనిపెట్టుచు, దానిని ఆశతో అపేక్షించుచు, పరిశుద్ధమైన ప్రవర్తనలతోను భక్తితోను ఎంతో జాగ్రత్తగలవారై యుండవలెను. అయినను మనమాయన వాగ్దానము బట్టి క్రొత్త ఆకాశముల కొరకును, క్రొత్త భూమి కొరకును కనిపెట్టుచున్నాము; వాటియందు నీతి నివసించును." 2 పేతురు 3:9-13.

అపొస్తలుడైన పౌలు కూడ ఇతర అపొస్తులుల మాదిరిగానే ఈ విషయమందు ఈలాగు చెప్పుచున్నాడు — "మనము భక్తి హీనతను, ఇహలోక సంబంధమైన దురాశలను విసర్జించి, శుభప్రదమైన నిరీక్షణ నిమిత్తము, అనగా మహా దేవుడును మన రక్షకుడునైన యేసు క్రీస్తు

మహిమయొక్క ప్రత్యక్షత కొరకు ఎదురు చూచుచు, ఈ లోకములో స్వస్థ బుద్ధితోను, నీతితోను, భక్తితోను బ్రతుకుచుండవలెనని మనకు బోధించుచున్నది." తీతు 2:12-13.

యేసు ప్రభువు పలుమారు, "నేను త్వరగా వచ్చుచున్నాను" అని చెప్పెను. (ప్రకటన 3:11, 22:7, 12, 20)

చదువరీ! అపొస్తలుడైన పేతురు చెప్పినట్లుగా, ప్రభురాకడ సమీపమై యుండగా, ఆయన రాకడను సూచించుచు నేడు పలువిధములైన సంగతులు నెరవేరుచుండగా, శ్రమల రోజులు లోకము చుట్టు కమ్ముకొని వచ్చుచుండగా; మన స్వంతవారు — బంధువులు, స్నేహితులు, ఈ లోక ఆశలవైపుకు పరుగెత్తుచు, రక్షణ భాగ్యమును త్రోసిపుచ్చుచు లేక నిర్లక్ష్యము చేయుచుండగ మనము (విశ్వాసులమని చెప్పుకొనువారము) చూస్తు నిర్లక్ష్యముగా నున్నయెడల, మన ఆత్మీయ స్థితి ఎలాగున్నదో, మనము ఎలాంటి వారమై యున్నామో పరీక్షించుకొనవలెను.

మనము ప్రభు రాకడకొరకు కనిపెట్టు వారలమైతిమా, ఆయన రాకడ సమీపమైనదనెడి ఎరుగుబాటుతో, ఆయన వచ్చుచున్నాడనెడి సిద్ధపాటుతో, మనము ఆయనకొరకు నీతిగా జీవించుచు, ప్రేమ, సాత్వికము కల్గియుండి, నశించుచున్న ఆత్మలను రక్షించుటకు ఆశ కల్గియుండెదము. అంతేకాక, క్రీస్తుకు విరోధమైన శరీర కార్యములను త్యజించుచు, ఆయన మనకు అప్పగించిన కార్యముల(తలాంతుల)యందు నమ్మకముగా యుండెదము. మనము ఆయన రాకడ నేడే వచ్చుచున్నట్లుగా ప్రతిరోజు జీవించుచు, ప్రభు కార్యములను చేయుటయందు నిమగ్నులమై, ప్రార్థించుచు ఆత్మ నింపుదల కలిగియుండెదముగాక!.

ఈ లోకమందు అశాశ్వత ధనమును సమకూర్చుకొనుటకు అతురపడక, లోకాశలతో జీవించక యుండెదము. 10, 20 లేక 30 సం॥ల జీవితము కొరకు ఇతరులతో మన సహవాసమును ద్వేషము ద్వార లేక మరే ఇతర కారణముల వలన త్రెంచుకొనకుండ యుండెదముగాక!.

సంఘము ఎత్తబడిన తరువాత, క్రీస్తు న్యాయ తీర్పు సింహాసనమును

సంఘమందుండెడి ప్రతి విశ్వాసి ఎదుర్కొనవలెననెడి విషయమును జ్ఞప్తియుంచుకొని జీవించెదము గాక!.

ప్రతి విశ్వాసి తన క్రియలను గూర్చి దేవునికి (క్రీస్తుకు) లెక్క అప్పగించవలెనని మనము గుర్తించుకొనవలెను. "....మనలో ప్రతివాడును తన్ను గురించి దేవునికి లెక్క యొప్పగించవలెను." రోమా 14:12.

....కట్ల, గడ్డి, కొయ్య కాలు మొదలైన వాటితో కట్టిన యెడల, వాని వాని పని కనబడును. ఆ దినము (తీర్పు దినము) దానిని తేటపరచును, అది అగ్నిచేత బయలు పరచబడును. మరియు వాని వాని పని యెట్టిదో దానిని అగ్నియే పరీక్షించును. 1 కొరింథీ. 3:13.

ప్రభువు తాను త్వరగా వచ్చుచున్నట్లుగా తెల్పుటకు కొన్ని సంఘటనల ద్వార తన విశ్వాసులను మేల్కొలుపుచున్నాడు. ఈ పుస్తకమును వ్రాసే సమయములో, ఒక స్నేహితుని ద్వార తెలుపబడిన ఒక సంఘటన ఈ క్రింద వివరించబడినది.

1972 సం॥లో జర్మనీ దేశమందు రహదారిపై మోటారు కారులో ఇద్దరు వెళ్ళుచుండగా, ఒక స్త్రీ రోడ్డు ప్రక్కన నిలిచి తనను కారులో ఎక్కించు కొమ్మన్నట్లు సైగ చేయగా, వారు, ఏదో ఊరుకు వెళ్ళుచున్నదని మధ్యలో దిగి పోవుననెడి తలంపుతో, దయకలిగి ఎక్కించుకొనిరి. వారు కొంత దూరము పోగా, ఆ స్త్రీ "ప్రభువు త్వరలో వచ్చుచున్నాడు." అని చెప్పి అదృశ్యమయ్యెను.

వారు పెట్రోలు స్టేషన్ వద్ద నిలిచి అచ్చట నున్న మనిషితో ఈ సంగతిని వివరించి చెప్పగా, అతడు, ఆ స్త్రీ ఈలాగు చెప్పెనని, ఇచ్చట నిలిపి తెల్పుట మీది అయిదవ కారని సమాధానమిచ్చెను.

ఈ సందేశమును తెల్పిన స్త్రీ దేవుని దూతయేనని సంశయము లేకుండ గుర్తించవచ్చును. అవును, ప్రభువు త్వరగా వచ్చుచున్నాడు. ఆయన పిలుపుకొరకు నీవు సిద్ధముగా యున్నావా? చదువుచున్న విశ్వాసీ, అతి త్వరలో జరుగబోయే ఆయన రాకడ దృష్ట్యా, నిన్ను నీవు దేవునికి సజీవ యాగముగా నీ శరీరమును అర్పించుకొనుమని వేడుకొనుచున్నాను.

"కాబట్టి సహోదరులారా, పరిశుద్ధమును దేవునికి అనుకూలమైన సజీవ యాగముగా మీ శరీరములను ఆయనకు సమర్పించుకొనుడని దేవుని

వాత్సల్యమును బట్టి మిమ్మును బ్రతిమాలుకొనుచున్నాను. ఇట్టి సేవ మీకు యుక్తమైనది." (రోమా 12:1).
నీవు ఇప్పుడు దేవునితో క్రొత్తగా/తిరిగి నూతనముగా నిబంధన చేసి కొనెదవా?

## నా నిబంధన

ఈ రోజు నేను క్రొత్తగా/తిరిగి నూతనముగా, దేవునితో నిబంధన చేసికొను చున్నాను. నన్ను నేను మరియు నా సమస్తమును ప్రభువైన యేసు క్రీస్తుకు అర్పించి ఆయనను నా హృదయపూర్వకముగా సేవించెదను. నన్ను పవిత్రునిగా చేసి, నేనెలాగుండుట ఆయన ఉద్దేశమై యున్నదో, ఆలాగున చేయుమని ఆయనను అడుగుచున్నాను. ఆయన శక్తిద్వారానే జీవించెదను, కావున పరిశుద్ధ జీవితముతో ఆయన రాకడ కొరకు కని పెట్టెదను.

సంతకము...... .............. ..     తేది...............

# ఈ సందేశము ఇతరులు తెలుసుకొనుటకు నీవు చేయవలసిన సహాయము

యేసు క్రీస్తు—" .... ఉచితముగా పొందితిరి ఉచితముగా ఇయ్యుడి. మత్తయి 10:8.

ప్రియ చదువరీ! నీవు ఈ పుస్తకములోని సందేశము తెలిసికొన్నావని, దీని ద్వార ఆత్మీయ లాభము పొందినావని నమ్ముచున్నాను.

ఈ పుస్తకమును అచ్చొత్తించునప్పుడు, అచ్చువేయువారు దీనికి కొంత వెల నిశ్చయించిన లాభము పొందవచ్చునని చెప్పిరి. వారికి వివరించిన సంగతే నీకును ఇప్పుడు వివరించుచున్నాను.

ఈలాంటి పుస్తకములు ప్రపంచమందు ఎక్కువగా అమ్ముడు పోవు చున్నవి. ఈలాంటి పుస్తకములు చాలా ధర కలినవిగా యుండి చాలా మంది కొనగల్గే ధరకంటే అధికముగా ఇతర దేశములలోను, ఇండియా లోను యున్నవి. ఈలాంటి పుస్తకముల రచయితలు, ప్రకాశకులు కొద్ది పాటి లాభము కూడ వీనిద్వారా పొంద గల్గిరి.

పుస్తకమును కొనుటకు సామర్థ్యముగల వారికే కాక అందరికి ఈ సందేశమును వెంటనే అందించవలెననెడి ఉద్దేశముతో గ్రంథకర్త ఈ పుస్తకమును ఉచితముగా పంపించుచున్నాడు.

మీ రచయిత లేక క్లెప్పైండ్ ప్రకాశకులు ఈ పుస్తకము ద్వార లాభము పొందవలెనని ఉద్దేశించలేదు. ఇది లాభమునుసంపాదించే సంస్థ కాదు గాని, చాలమంది ఉచిత సేవకుల కూర్పుతో కూడినది. ఈ సందేశమును ప్రభువుయొక్క హెచ్చరికలను సాధ్యమైనంత ఎక్కువగా వ్యాప్తి చేయుటకు, మాకు సాధ్యమైనంతవరకు ప్రయాసపడుచున్నాము. మేము ప్రభువుతో యుండుటకు పిలువబడిన తరువాత, లోకమందు స్థిరాస్తులను, లోకస్థుల కొరకు విడిచిపెట్టి పోవుటకు ఉద్దేశించుట లేదు "భళా *మంచి నమ్మకమైన దాసుడా! శ్రేష్ఠమైన పనిచేశావు*", అని ప్రభువు వలన పిలిపించుకొనుటకు మినహా మాకు ఏమి అవసరము లేదు.

చదువరీ! నీవు '*ప్రవచింపబడిన ప్రస్తుతము-భవిష్యత్తు*, అను పుస్తకమును ఉచిత బహుమానముగా పొందితివి. నీవు ఈ పుస్తకములోని సందేశమును ఇతరులకు చాటించుటకు ఇష్టపడుచున్నావా! అలాగైన నీవు ఈ క్రింది విధముగా చేసి, ఈ వార్తను ఇతరులు తెలిసికొని ఆశీర్వదించబడునట్లు సహాయపడవచ్చును.

1. ఈ పుస్తకమును ఇతరులు చదువుటకిమ్ము.

2. ఇతరులు ఈ వార్తను చదివి ఆశీర్వదించబడునట్లుగా, వారి నిమిత్తమై నీకు చేతనైనంత విరాళమును పంపి ఇతరులకొరకు సహాయపడుము.

నీవు పంపగల్గే (చివరకు ఒక్క రూపాయి యైనను) ఈ సేవలో సహాయముగా యుండుటయే కాక సంతోషముతో అంగీకరించబడును.

నీవు ఎవరికి ఈ పుస్తకమును పంపవలెనని కోరుచున్నావో, వారి పేరు, చిరునామా (అడ్రెసు) పంపిన, మేము వారికి పంపగలము, లేక నీవు పంపే విరాళముద్వార మేమే ఇతరులకు ఈ సందేశమును అందించగలము, తద్వార నీవు ఆశీర్వాదము పొందగలవు. <u>నీవు పంపే ప్రతి పైస, ఈ వార్తను తెల్పుటకు గాను, అచ్చొత్తించుటకు, పుస్తకములను పంపుటకు మాత్రమే వాడబడును.</u>

3. పాస్టర్లు, చర్చి నాయకులు మొ॥ వారు తమకు అవసరమగు సంఖ్యలో పుస్తకములను తెప్పించుకొని చర్చి సభ్యులకు పంచి ఇవ్వ వచ్చును. దయతో మీ చర్చి లేక ఆరాధన స్థలము పేరు, చిరునామా విపులముగా వ్రాయగలరు. మీ విరాళములు ఈ సేవా వ్యాప్తి కొరకు, ఇతరుల రక్షణ కొరకు అవసరమని మర్చిపోకండి!

4. ఎక్కువ పుస్తకములు కావలసిన వారు, ఇరుగు పొరుగు వారి కొరకు, బంధువుల కొరకు ఆసుపత్రుల కొరకు, అతిథుల కొరకు కారాగారముల కొరకు, సువార్త పని కొరకు మొ॥ వాని కొరకు తెప్పించుకొని పంచిపెట్ట వచ్చును.

5. మేము ఈ పుస్తకము విషయము, దేశ పత్రికలలో ప్రకటన చేయుటకు ఉద్దేశించుచు, మా శక్తి వంచన లేకుండ ఈసందేశము ఇతరులు తెలిసికొనునట్లు ప్రయాస పడుచున్నాము. ప్రకటనకు జవాబిచ్చు ప్రతి వారికి, ఈ పుస్తకమును ఉచితముగా పంపించుచున్నాము. కావున ఈలాగు పత్రికలలో ప్రకటించుటకు, అచ్చొత్తించుటకు చాలా ద్రవ్యము ఖర్చగును. నీవు, నీకు చేతనైనట్లు, దేవుడు ప్రేరేపించు ఎలాంటి సహాయమైనను ఈ సందేశమును చాటించుటకు చేయవచ్చును.

6. ఈ పుస్తకము ఈ క్రింది భాషలలో, మార్చి 1974 సం॥ వరకు ముద్రించబడి; తెలుగు, ఇంగ్లీషు పుస్తకములను పంపిన రీతిగానే ఈ భాషలవారికిని పంపుటకు సిద్ధముగా యుండును.

(వీని చిరునామాలను ఈ పుస్తకపు మొదటి అట్ట లోపలి భాగమందు చూడగలరు.)

| | | | |
|---|---|---|---|
| మళయాలం | తమిళం | బెంగాలి | హింది. |
| కన్నడం | మరాఠి | ఒరియా | |

ఈ పుస్తకము ఈ క్రింది భాషలలో తర్జుమా చేయబడుచు, త్వరలో ముద్రణకై సిద్ధమగుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| అంగామైనాగా | లోతానాగా | తాడౌ | ఉర్దు |
| పంజాబి | కాసి | లూషై | జర్మనీ. |

వేరే మరికొన్ని భాషలలోనికి కూడ ఈ పుస్తకమును తర్జుమా చేయుటకు ఆలోచించుచున్నాము. వీని తర్జుమాలు సిద్ధమగుటతోడనే ఇవి ప్రచురింపబడును.

7. ఈ పుస్తకములోని వార్త, దేవుని చేతిలోని గొప్ప ఆయుధముగా యుండి, చదువరులను హెచ్చరించుటకు, మేల్కొలుపుటకు, కదిలించుటకు, సవాలుగా నుండుటకు, ఉజ్జీవింపబడుటకు వాడబడునట్లుగా; చదువరులు క్రీస్తు పిలుపును గ్రహించి, భవిష్యత్తులో రానైయున్న రోజుల కొరకు సిద్ధపడునట్లుగా ప్రార్థించండి.

ఈ పుస్తకమును వ్రాసి, మీకు పంపుట యందు మిక్కిలిగా ఆనందించుచున్నాను. అవును, పుచ్చుకొనుట కంటె ఇచ్చుట శ్రేష్ఠము.

క్రీస్తునందు నమ్మకమైన మీ సహోదరుడు,
డాన్. ఇ. స్టాన్టన్.

—— : ★ : ——

722

డక్కన్ లిటరేచర్ ప్రింటర్స్, 94-ఇ, సరోజినిదేవిరోడ్, సికింద్రాబాద్ 3

## —:★ అనుబంధము ★:—

### అరబ్బు—పెట్రోలు నూనెయొక్క ప్రభావము :—

మధ్యాసియాయందున్న పెట్రోలు వుత్పత్తి దేశములలో, ఇరాన్ తప్ప తక్కినవన్నియు అరబ్బు దేశములైయున్నవి. ఈ దేశములకు పెట్రోలు ద్వారా వచ్చెడి ఆదాయము వలన వారి అధికార ప్రభావము కూడ హెచ్చుగుచున్నది. 1968 సం॥లో వారి ఆదాయము సంవత్సరమునకు 4.4 బిలియను (లక్ష కోట్లు)ల డాలర్లుగ యుండి, నేడు అదే 10 బిలియనుల డాలర్ల వరకు పెరిగినది. మరియు యిదే 1980 సం॥ వరకు 40 బిలియనుల (రూ. 2,80,00,00,00,000) వరకు పెరుగునని అంచనా.

అరబ్బు దేశములు, రష్యా ద్వార ప్రోత్సహింపబడి పెట్రోలును ప్రపంచమందు రాజకీయ, ఆర్థిక, ఆయుధముగా నుపయోగించినవి. ఈ సమస్య ద్వారా అరబ్బు దేశములు, ప్రపంచమందలి అన్ని దేశములు ఇశ్రాయేలుపై వత్తిడి తెచ్చి, ఇశ్రాయేలు తాను ఆక్రమించుకొనిన స్థానములను వదలి పెట్టినట్లు చేయుటకై వుద్దేశించినవి. ఈ కారణముచే నేడు ప్రపంచమందు పెట్రోలు నూనెయొక్క కొరత యేర్పడినది. రష్యా, ఈ పెట్రోలు నూనె సరఫరా అమెరికా, పశ్చిమ దేశములకు ఆపివేయుట ద్వారా అవి ఆర్థికముగ గొప్ప దెబ్బ తినునని భావించుచు, ఈ సమస్య ద్వార జపానుకు పశ్చిమ దేశములతో యున్న సంబంధములో భేదములు రావచ్చునని కూడ ఆశించుచున్నది. అంతేకాక రష్యా, మధ్యాసియా ప్రాంతమందు ఈ పెట్రోలు సమస్య ద్వారా తన పెత్తనమును చెలాయించుటకు వీలు కలుగునని కూడ భావించియున్నది. ఈ పెట్రోలు సమస్యయే, ప్రవక్తయైన దానియేలు ప్రవచించినట్లుగ (దానియేలు 11:40,41) యూరపునుండి ఉద్భవించే క్రీస్తు విరోధి (Anti Christ) కి, అరబ్బు దేశములకు యుద్ధము జరుగుటకు దారితీయవచ్చును. పెట్రోలు నూనెను ఒక రాజకీయ ఆయుధముగ నుపయోగించి అరబ్బు దేశములు యూరపు దేశములను (ఇది యూరపు దేశములకు, వారు చావక లోకమందు మిగిలియుండు (Survival) సమస్య: ఎందుకనగా—పెట్రోలు సమస్య వారి వాణిజ్య, ఆర్థిక అభివృద్ధులకు గొప్ప దెబ్బ) తమపైకి

దండెత్తి వచ్చుటకు ఆహ్వానించుచున్నట్లుగా యున్నది. ఇట్లు, ఈ పెట్రోలు సమస్య నేడు లోకమందు గొప్ప భీతిని గొల్పు సమస్యగ మారినది.

## మధ్యాసియానందలి దౌర్జన్య చర్యలు :—

మధ్యాసియా ప్రాంతమందలి సమస్యలు తీర్చుటకు వీలు కాకుండ హెచ్చుగుచున్నవి. వానిలో కొన్ని క్రింద వివరింపబడినవి:

ఫిబ్రవరి 1973 సం॥లో ఇశ్రాయేలు, అరబ్బు (లిబ్యా) ప్రయాణికుల విమానమును సీనాయి అరణ్య ప్రాంతముపై కూల్చి వేయుటచే, దానిలో నున్న 111 మంది ప్రయాణికులలో 105 మంది చనిపోయిరి. మార్చి 1973 సం॥లో "బ్లాక్ సెప్టెంబర్" (అరబ్బు) గొరిల్లాలు కార్టం, సుధాన్‌లలోని సౌదీ అరేబియా రాయబార గృహముల పై దాడి జరిపి, వానిలోని పలువురు రాయబారులను, ప్రభుత్వోద్యోగులను చెరపట్టిరి. తుదకు గొరిల్లాలు, వీరిలో ఇద్దరు అమెరికనులను, ఒక బెల్జియం వానిని చంపిరి. ఏప్రెల్ 1973 సం॥లో అరబ్బులు, సైప్రస్‌లోని ఇశ్రాయేలు రాయబార గృహమును పేల్చివేసిరి. మరియు ఒక ఇశ్రాయేలు జెట్ విమానమునుకూడ దౌర్జన్యముతో తప్పు త్రోవను పట్టింప ప్రయత్నించిరి. దానికి ప్రతీకారముగ, ఇశ్రాయేలు తన కమెండోలను లెబానన్ పైకి పంపి ముగ్గురు అరబ్బు గొరిల్లా నాయకులను చంపించెను. యీ విధముగ ఈ ప్రాంతమందు దౌర్జన్యాత్మకమైన చర్యలు తరుగక జరుగుచునే యుండును.

## ఇశ్రాయేలు-అరబ్బుల (అక్టోబర్ 1973) యుద్ధము:—

ఇశ్రాయేలు అరబ్బుల మధ్య జరిగిన 18 రోజుల యుద్ధము యింతకు పూర్వము వీరి మధ్య 1947 సం॥ నుండి జరిగిన యుద్ధములన్నింటిలో మిక్కిలి గొప్పదై యున్నది. తొలుత ఈజిప్టు, సిరియా దేశములు ఇశ్రాయేలు ప్రాంతములగు, సూయజునకు అభిముఖముగ, మరియు గోలాన్ పీఠపు ప్రదేశములపై వరుసగా దాడి జరుపుటచే, యుద్ధమునకు దారి తీసినది. ఈజిప్టు తన 1,00,000 సైన్యముతో దాడి జరుపుటచే సూయజు కాల్వ ప్రాంతమందు 103 చదరపు మైళ్ళ భూ భాగమును ఆక్రమించికొన గలెను. యుద్ధ విరమణకు ముందు ఇశ్రాయేలు తన చాకచక్యముతో 20,000 సైన్యము మరియు 500 టాంకులతో సూయజు కాలువను

దాటి ఈజిప్టులోనికిచొచ్చుకొని పోయి, ఈజిప్టు సైన్యమునకు (ఇశ్రాయేలు భూభాగమును ఆక్రమించిన ఈజిప్టు సైన్యమునకు) ఆహార సరఫరా చేయు మార్గముల నన్నింటిని మూసివేసి, దానికి బయటి ప్రపంచముతో సంబంధము లేకుండ చేసి, దాదాపు 20,000 సైన్యమును చెరపట్టెను. అంతే కాక ఇశ్రాయేలు గోలాన్ పీఠ ప్రదేశమందున్న సూయజ్ గ్రామమును ఆక్రమించుకొని సిరియా దేశముతో భయంకరమైన యుద్ధము చేసి దాని దాడిని త్రిప్పి కొట్టెను. ఇశ్రాయేలు ఈ యుద్ధమందు హెచ్చు ప్రాంతముల నాక్రమించుకొనెను.

ఈ యుద్ధమందు దాదాపు 20,000 అరబ్బులు మరియు ఇశ్రాయేలీయులు గాయపర్చబడగా, కొందరు మరణించిరి. మరియు 6 బిలియనుల డాలర్ల (రూ. 4,5000 కోట్లు) విలువైన మిలిటరి సామాగ్రి మరియు ఆయుధములు ద్వంసము కావించబడెను. ఇప్పుడు తిరిగి ఈ దేశములు కపటోపాయములతో యుద్ధ పరికరముల విస్తరణను తిరిగి పెంపొందించుకొనుచున్నవి. యెహెజ్కేలు ప్రవక్త ప్రవచనానుసారముగ మరొకపర్యాయము ఇశ్రాయేలు, అరబ్బుల మధ్య యుద్ధము జరుగును. మరియు అంతిమమున శక్తివంతమైన దేశములు దీనిలో ముఖాముఖిగ పాల్గొనుటచే అది మూడవ ప్రపంచ యుద్ధముగ రూపొందును.

ఈ కాలమందే ఈ సమస్య పరిష్కారము కొరకు, శాంతి సంబంధమైన ఆలోచనలు జరుగుట చూచుచున్నాము. అయితే యివి తాత్కాలిక శాంతిని మాత్రమే నెలకొల్పగలవు. దీని విషయము శ్రమల రోజుల అధ్యాయములో చర్చింపబడినది. ఈ శాంతి సమయమే మూడవ ప్రపంచ యుద్ధమునకు సూచనగా యుండి, ఇది శ్రమల రోజుల ప్రారంభములో జరుగును.

## ఇశ్రాయేలీయులు :—

ఇశ్రాయేలు దేశమునకు వలసగ వచ్చెడి యూదుల సంఖ్య దినదినము హెచ్చుగుచున్నది. 1970 సం॥లో 37,000, 1971 సం॥లో 42,000, మరియు 1972 సం॥లో 56,500 మంది యూదులు క్రమముగ వలస వచ్చిరి. రష్యా నుండి యూదులు తమ దేశమునకు పోవుటకుఅనుమతి నొందుటచే 32,000 మంది ఇశ్రాయేలునకు వచ్చిరి. మరియు 1973

సం॥లో రష్యా నుండే 36,000 మంది యూదులు తమ దేశమునకు వచ్చెదరని భావింపబడెను.

**కరవులు :—**

అక్టోబరు 1972 సం॥లో ఇండియా దేశపు ప్రెసిడెంటు శ్రీ వి. వి. గిరి, ఢిల్లీలో జరిగిన పదకొండవ ఆహార మరియు వ్యవసాయ సంస్థయొక్క సదస్సులో మాట్లాడుచు; ఆసియా, పశ్చిమ తూర్పుదేశములందున్న ఆహార కొరత రూపుమాపవలెనని, దీనికి ప్రపంచ దేశములన్నియు కలిసి తోడ్పడుచు కృషి సల్పవలెనని కోరిరి.

1972 సం॥లో చైనా ఆహార ధాన్య ఉత్పత్తి, దాని ముందటి సంవత్సరముకన్న 10,000 మెట్రిక్ టన్నులు—తక్కువైయ్యెను. అతి వృష్టి, అనావృష్టియే దీనికి కారణము. కరవుల ప్రభావము ఆస్ట్రేలియ, ఆఫ్రిక, ఇండియా, మధ్యాసియా దేశములందును కలదు.

1973 సం॥లో ప్రపంచమందు యెన్నడు కలుగని కరువు సంభవించెను. ఈ సంవత్సరమందే ఒక బిలియను (10,00,000,000) మంది ప్రపంచమందు ఆకలి, ఆహార సమస్య బాధితులైరని ఐక్యరాజ్యసమితి (U. N.) ద్వారా తెలియవచ్చెను. ఈ సంవత్సరమందే కోట్లకొలది మనుష్యులు కరవు బాధితులైరి. చార్డ్, సెనిగల్, మాలి, నైగర్, మార్టేనియాలో 1,00,000 మంది మరియు 1,00,000 ఇతియోపియాలో కరవు ద్వార మరణించిరి. గత మూడు సంవత్సరములలో 80,000 మంది ఆఫ్ఘనిస్థాన్ యందు ఆకలి బాధితులైరి.

ఇండియాలో ఆహార సంస్థలన్నియు దాదాపు ప్రభుత్వాధీనములోనికి తేబడినవి. ఈవిధముగానే ప్రపంచమందంతట ఆహార మరియు తక్కిన సంస్థలన్నియు ప్రభుత్వముల ఆధీనములోనికి తీసికొని రాబడి చివరకు రాబొయ్యెడి ప్రపంచ నియంత (world dictator), క్రీస్తు విరోధి ఆధీనములోనికి తేబడును.

**దుర్నీతి :—**

అమెరికాలో సుఖవ్యాధులు 25,00,000 మందిని ప్రతి సంవత్సరము పట్టి పీడించుచున్నవి. ఈ వ్యాధిని రూపుమాపుటకు లేక అదుపులో పెట్టుటకు, ఈ ఉద్యమము కొరకు అమెరికా దేశపు సలహా సంస్థ 296 మిలియనుల డాలర్లను వచ్చే 5 సం॥లలో ఖర్చు చేయుటకు సిఫారసుచేసెను.

# ఆర్డరు ఫారము

(ఈ పుస్తకపు మొదటి అట్టలోపలి భాగమందివ్వబడిన తెలుగు చిరునామాకు మీ ఆర్డరు ఫారమును, మీరు ఆర్డరు చేసే పుస్తకములను పంపుటకు సరిపోవు తపాళ స్టాంపులను జతచేసి పంపండి).

నేను "ప్రవచింపబడిన ప్రస్తుతము–భవిష్యత్తు." అను ఈ పుస్తకమును వ్యాప్తి లోనికి తెచ్చుటకు సహాయము చేయుదును.

దయచేసి ఈ పుస్తకమును ఈ క్రింద ఇవ్వబడిన చిరునామాగలవారికి పంపండి. ఈ పుస్తకము/లను వీరికి పంపుటకు గాను పోస్టు ఖర్చులకొరకు రూ......... విలువగల తపాళ స్టాంపులను లేక రూ ... ... మనియార్డరు ద్వార పంపుచున్నాను. (మనియార్డరు రసీదు వెనుక మీ చిరునామాను తేటగా, విడి అక్షరములతో వ్రాయవలెను. లేకున్న పుస్తకములు పంపబడవు.

పేరు ................................................................................

పూర్తి చిరునామా ..........................................................................

పోస్టు ........................జిల్లా ......................రాష్ట్రము..................

(ఎక్కువ పేరులు వ్రాసేదున్న ఈ ఫారము వెనుక లేక వేరే కాగితము మీద నైన వ్రాసి పంపవచ్చును).

<u>ఎక్కువ పుస్తకములకొరకు:</u> దయచేసి.........పుస్తకములను పంపండి.

( 2 పుస్తకములకన్న హెచ్చుగా కోరేవారు ఈ సేవాభివృద్ధి కొరకు, ఇతరుల కొరకు, ఈ పుస్తక ప్రచురణ, పోస్టు, ప్యాకింగు మొ॥లగు ఖర్చులకు గాను తను విరాళములను పంపినచో పుస్తకములు పంపబడును. )

☐ Message of life ☐ Christian Challenge

నా పేరు ................................................................................

పూర్తి చిరునామా ..........................................................................

పోస్టు ........................జిల్లా ......................రాష్ట్రము ..................

( పై ఇంగ్లీషు మాగజైనులు కావలసినవారు 0-25 పై. తపాళ స్టాంపులను Claffind Publications Simla—171001. H. P. కి పంపిన, నమూన పత్రికలు పంపబడును ).

ఈ పుస్తకములోని సందేశమును వ్యాప్తిలోనికి తెచ్చుటకై, దీని ప్రచురణ మరియు పోస్టు ఖర్చులకై విరాళముగా నేను రూ................మీ ఈ విశ్వాస సేవా కార్యముల కొరకు పంపుచున్నాను.

(తెలుగు పుస్తకముల కొరకు మీ విరాళములను తెలుగు చిరునామాకు పంపవలెను).

ఈ ఫారమును చింపి పోస్టులో పంపండి—లేక వేరే కాగితముపైన నైనను వ్రాసి పంపవచ్చును.

## Other books by Don E Stanton

### Prepare for the Coming of Christ

A challenging message urging unbelievers to receive the Saviour while they may and exhorting believers to abide in Christ and prepare their lives so that they will not be ashamed at His coming.
Priee : 50 paise. Aust. 25 cents. U. K. 12 pence.

### The Day the World Burns

A frightening message dealing with the Great Tribulation but presenting also the good news and how to escape this coming fearful time.

Price : 50 paise. Aust. 25 cents. U. K. 12 pence

### Partial And Contemptible

29 messages on spiritual decline in the church, covering the whole book of Malachi. Price:- Rs. 3/- Aust. 70 cents. U. K. 35 pence

### Revival

A booklet dealing with the promise and conditions of spiritual revival; and the solemn alternative to revival. Price: 70 paise. Aust. 35 cents. U. K. 17 pence.

### God's Purpose—And you

A gospel message, showing that there is a very real purpose in man's existence, and that purpose is part of God's purpose for Himself. Price: 50 paise. Aust. 25 cents. U. K. 12 pence

### Seven Letters From the Lord Jesus

Setting forth the challenge of the seven letters in Revelation 2 & 3 A message for churches and all believers today. Price: 80 paise. Aust. 40 cents. U. K. 20 pence.

### The Broad and the Narrow Way

A booklet written in story form—the story of Manohar Made-up-my-mind who chose the Broad Way of life; and New Joe who chose the Narrow Way. Manohar was assured that he was quite alright, but he ended up begging his patron demon to help him back to the Narrow Gate. But it was too late ! *Price:* 50 paise. Aust. 25 cents. U. K. 12 pence.

All prices include postage.
Order from Maranatha Revival
Crusade, "Claffind"
Simla – 171001 H. P.